యంగ్ ఇండియా లైబ్రరీ

# ప్రజాస్వామ్యం

## 80 ప్రశ్నలు - జవాబులు


డేవిడ్ బీథమ్, కెవిన్ బోయిల్


అనువాదం : వి.వి.బి. రామారావు

పరిచయం : నిఖిల్ చక్రవర్తి

చిత్రాలు : ఆర్.కె. లక్ష్మణ్




నేషనల్ బుక్‌ట్రస్ట్, ఇండియా

యునెస్కో ప్రచురణ

సహకారంతో ప్రచురించబడినది

ప్రజాస్వామ్యం - మానవహక్కుల విద్యా కార్యక్రమంలో భాగంగా ఈ పుస్తక రచన యునెస్కో వారిచే ప్రారంభింపబడింది. పలుభాషలలో ఏకకాలంలో ఈ పుస్తకం వెలువరించబడుతుంది.

ఇందు నియోగింపబడిన హోదాలు - అందివ్వబడిన విషయమూ ఆయా దేశాల న్యాయ సంబంధమైన హోదా, ప్రాదేశికత - నగరాలు, వారివారి అధికారాలు - సరిహద్దుల నియమితతలను గురించి అవి యునెస్కో సెక్రటేరియేట్ భావాలని అర్థంకాదు.

ఇందలి వాస్తవాల ఎంపికకీ, అందింపుకీ - అందలి భావాలకీ రచయితలే బాధ్యులు. ఇవి అవసరబద్ధంగా యునెస్కో భావాలై ఉండనక్కరలేదు. వాటి విషయమై సమితికి ఎట్టి బాధ్యతలేదు.



1. ప్రజాస్వామ్యంలో చిన్నవాడు యజమాని ఎవరవ్వాలో నిర్ణయిస్తాడు.

# సార్వత్రిక మానవ హక్కుల ప్రకటన

## ప్రకరణం 21

1. ప్రతి ఒక్కరికీ తన దేశ ప్రభుత్వంలో ప్రత్యక్షంగా లేక స్వేచ్ఛగా ఎన్నుకోబడిన ప్రజా ప్రతినిధులద్వారా గాని పాలుపంచుకునే హక్కు ఉంది.
2 ప్రతి ఒక్కరికీ తన దేశంలో ప్రజాసేవకు సమానమైన అందుబాటు కలిగే హక్కు ఉంది.
3. ప్రభుత్వంయొక్క అధికారానికి ప్రాతిపదిక ప్రజల ఇచ్ఛ. ఈ ఇచ్ఛ సార్వత్రిక సమాన ఓటు హక్కులతో, క్రమకాలంలో, స్వచ్ఛమైన గోపనీయ పద్ధతిలో కాని, సమానమైన స్వేచ్ఛాయుత ఓటింగు వల్లకాని జరుపబడిన ఎన్నికలలో ప్రకటితమవాలి.

# విషయసూచిక

# పరిచయం

పౌర సమాజాన్ని నిర్వహించే పరికరంగా ప్రజాస్వామ్యానికి ఒక దీర్ఘమైన కలిమి లేములతో కూడిన చరిత్ర ఉంది. మన దేశంలోని ప్రాచీన గణతంత్ర రాజ్యాలు లేక యూరప్‌లోని ఏథెన్స్ ప్రజాస్వామ్యంవంటి వ్యవస్థల గ్రంథస్థమైన చరిత్ర సహితం ఏదో ఒక రూపంలో మానవ సమాజంలో ప్రజాస్వామ్య సంస్థలు పనిచేయడం చూడడానికి రెండువేల సంవత్సరాల కంటే వెనక్కి వెళ్ళాల్సి ఉంటుందని చూపుతుంది. మానవ కార్యకలాపాల రంగం విశాలమై అన్ని దిక్కులా లోతవుతున్న కొలదీ మానవుడి దృష్టి విస్తృతమై పౌరసమాజాన్ని నిర్మించాలనే కాంక్ష అతన్ని సామాన్య ప్రజా బాహుళ్యం నిర్ణయాలు చేసే ప్రవృత్తిలోనే కాక కార్యనిర్వహణలో కూడా పాలు పంచుకోవడానికి వీలుగా ఉండే ప్రజాస్వామ్యం వంక తీసుకువెళ్ళింది. అభివృద్ధిలో అనేక స్థాయిలలో ప్రజాస్వామ్యం వీటిని వివిధ అంశాలతో వివిధ పరిస్థితులలో తీసుకురావడానికి ప్రయత్నం చేసింది.

మనదేశంలో స్వతంత్ర పోరాటంలో ప్రజాస్వామ్యానికి విపరీతమైన గతిశక్తి వచ్చింది. ఇది ముఖ్యంగా కొద్దిమంది సుసన్నాహులైన బృందాలకి పరిమితం కాకుండా విశాలమైన మానవ సమూహాలు క్రియాశీలకంగా పాల్గొనడం వల్ల సాధ్యమైంది. మన స్వాతంత్ర్య పోరాటం వెనుక ఉన్న ఈ చారిత్రక నేపథ్యమే మనను ఒక ప్రజాస్వామ్య గణతంత్రాన్ని స్థాపించడానికి వీలు కల్పించింది. ఇందులో వయోజన ఓటు హక్కు, ఎన్నుకోబడిన ప్రజాప్రతినిధుల ప్రభుత్వం గణతంత్ర ప్రారంభంలోనే వచ్చాయి. ఇంకా అభివృద్ధి చెందిన ఇతర దేశాలు ఈ విజయ సాధనకి కొన్ని దశాబ్దాలు, శతాబ్దాలు తీసుకున్నాయి.

ప్రజాస్వామ్యంలో మన ప్రయోగం నేర్పే పాఠాలు చాలా ఉన్నాయి. ఒక విషయానికొస్తే ఓటు హక్కు ఉన్నంత మాత్రాన్న ప్రజాస్వామ్యం ఇస్తుంది అనబడే అధిక సంఖ్య పాలన ఖాయంగా వస్తుందా? మన రాజ్యాంగంలో పొందుపరచిన ఎన్నికల

ఈ పరిచయం భారతీయ ప్రతికి ప్రచురణకర్తలచే చేర్చబడింది.

వ్యవస్థ ఒక నియోజకవర్గంలో అధికసంఖ్యలో ఓట్లు వచ్చిన వ్యక్తే గెలిచినట్లుగా నిర్దేశిస్తుంది. ఇలా అయినంత మాత్రాన అధికసంఖ్యలో ఓట్లు పొందిన వ్యక్తి అధిక సంఖ్యాకుల మద్దతు పొందగలడని అర్థం కానేరదు. ఓట్లు వేసినవారు ఆ నియోజకవర్గంలో అధిక సంఖ్యాకులు కాకపోవచ్చును. ఎన్నికైన ప్రభుత్వంలో ఇలాంటి లోపాలు దేశమంతటా నిరంతరం చర్చనీయాంశాలే. మన స్వంత ప్రజాస్వామ్య వ్యవస్థలో ఎన్నిక సంస్కరణల అవసరం మన అనుభవంలోంచే ఆవిర్భవించింది. అలాగే ప్రజాస్వామ్య వస్తువును హీనపరిచే ఎన్నికల ఖర్చులూ నిరంతర చర్చా విషయమే. ఈవిధంగా మన ప్రజాస్వామ్య ప్రభుత్వం దానిని నడిపే ప్రజల నిరంతర పరిశీలనలో ఉంది. మన ప్రజాస్వామ్య పద్ధతిలో అనేక ఇతర అంశాలు కూడా లోతైన చర్చా విషయాలుగా ఉన్నాయి. వీటిలో, ఇతరాలలో ఒకటిగా, పునరానయనపు హక్కు(Right to Recall),న్యాయశాఖ మన ప్రజాస్వామ్య రాజ్యాంగానికి అతికీలకమైన కావలికాచే కుక్క పాత్రని పోషిస్తుంది.

మన బహుముఖ పౌరసమాజంలోని కార్యక్రమాల పెరుగుదల వలన ప్రజాస్వామ్యస్థాయిని పెంచాల్సిన అవసరం మనకు విస్తృతంగా కనబడుతోంది. అందువలననే పంచాయితీ వ్యవస్థని ప్రవేశపెట్టడం జరిగింది. సారాంశంగా ఈ వ్యవస్థ ప్రజాస్వామ్యం అట్టడుగుస్థాయి వరకు వెళ్ళి, అట్టడుగుస్థాయి నుండి అభివృద్ధి చెందేటట్లు చూస్తుంది. మన ప్రజాస్వామ్య పరిణామంలో ఇది ఒక ప్రముఖమైన దశ. భారతీయ ప్రజాస్వామ్యం చేసిన గమనార్హమైన సహాయాలలో ఇది ఒకటి. మన ప్రజాస్వామ్యానికి ఇది చిరకాలం నిలిచే పునాదిని ఇవ్వగలదు. దీనివలన మారుమూల గ్రామంకూడా మన ప్రజాస్వామ్య పౌర సమాజంలో క్రియాశీలకంగా పాల్గొంటుంది.

ఐదు దశాబ్దాల సంపన్నమైన మన ప్రజాస్వామ్య అనుభవం నుంచి విశాలమైన పరిణామాలు కలిగిన అనేక పాఠాలను మనం గ్రహించవచ్చును. ఇతర మానవాళితో సమానంగా ఒక ప్రజాస్వామ్య నిర్మితి తనంత తనే పౌరసమాజంలో ఇవ్వగల హామీ ఇవ్వదని మనం మనసులో ఉంచుకోవాలి. సాంఘిక, ఆర్థిక అసమానతలు ఏ ప్రజాస్వామ్యాన్నైనా అపహాస్యం చేయగలవు. ఒక స్థాయి సామాజిక, ఆర్థిక సమానత్వం లేకపోతే నిజమైన ప్రజాస్వామ్యం మనలేదని ఆర్థికంగా అభివృద్ధి చెందిన దేశాల అనుభవం కూడా తేటతెల్లం చేస్తుంది. బహు అంతస్తులున్న సంపద-గుడిశెల స్థాయిలేమి వీటి అమానుష సహజీవనం అర్థవంతమైన ప్రజాస్వామ్య స్థాయిని ఎప్పుడూ ఖాయపరచలేవు. అభివృద్ధి చెందుతున్న దేశాలలో, ప్రజలలో అధిక సంఖ్యాకులు

బీదరికాన్ని, దిక్కులేనితనాన్ని ఎదుర్కొంటున్న మనదేశం వంటి దేశాలలో ఈ అసమానత చాలా లోతైన, పట్టించుకోవలసిన విషయం అవుతుంది.

ఒక వంక శాస్త్ర, సాంకేతిక అద్భుతాలు - మానవుణ్ణి అంతరిక్షంలోకి తీసుకువెళితే మానవమేధ జీవాణువులతో సహితం ప్రయోగాలు చేయగలుగుతూ ఉంటే, అదే యుగంలో బీదరికంలేమి ఈ గోళంపై నివసించే అధిక సంఖ్యాకులను బాధించడం మన యుగపు నిలచి కనపడే వ్యంగ్యం. అట్టి అసమానత రూపుమాపేవరకు పౌర సమాజం ప్రజాస్వామ్యమని గర్వంతో చెప్పుకోలేదు. ప్రజాస్వామ్యానికి కట్టుబడే మానవాళిని నిలదీసే సవాలు ఇదే.

సరళమైన స్పష్టమైన విధంగా ప్రజాస్వామ్య శ్రేణియొక్క బహుముఖాలను మన ముందుంచడానికి శ్రమతో చేసిన ప్రయత్న పరిణామమే ఈ పుస్తకం. ప్రజాస్వామ్యాన్ని అధ్యయనం చేయడానికి ప్రయత్నించే, వారి ముందుకి వచ్చే ప్రశ్నలకి సమాధానాలు ఇవ్వడంలో ఈ పుస్తకం సహాయపడుతుంది. ఈ విధమైన చక్కని కరపుస్తకం - ప్రజాస్వామ్య నిర్మాణానికి కట్టుబడిన ఎవరికైనా నిస్సందేహంగా ఇది విలువ కట్టలేనిది.

- నిఖిల్ చక్రవర్తి

# రచయితల పీఠిక

ప్రజలు తరచు ప్రజాస్వామ్యం గురించి మాట్లాడుతూ ఉంటారు. ప్రజాస్వామ్యం అనేమాటకు వివిధ ప్రజలకు వివిధ పద్ధతులలో అర్థమయ్యే లక్షణం ఉంది. నిజంగా ప్రజాస్వామ్యంలో ఏముంది అన్న విషయంలో చాలా గందరగోళ పరిస్థితి ఉంది. అది వ్యక్తిగతమైన స్వేచ్ఛా? బహుపక్ష విధానమా? అధిక సంఖ్యాక పరిపాలనా? అల్ప సంఖ్యాక హక్కులా? ఏదైనా ఒక దేశాన్ని మనం ప్రజాస్వామ్యంగా ఎంచడానికి లేదా ఒక ప్రజాస్వామ్యం యొక్క ప్రగతిని కొలిచే అంగీకారం పొందే ప్రమాణం ఏదైనా ఉందా? ఏ దేశమైనా ప్రజాస్వామ్యంగా గుర్తింపు పొందడానికి అందులో ఏవైనా సంస్థలూ, ఆచారాలు ఉండాలా? లేదా అనేక పద్ధతులలో అనేక విధాలుగా ప్రజాస్వామ్యాన్ని సాధించవచ్చా?

ఈ పుస్తకంలో ఇలాంటి ప్రశ్నలకి సమాధానాలు మనం పొందగోరుతున్నాము. ఇందలి సమాధానాలు వేరైన కొన్నింటి కంటే నిశ్చితమైనవి.

ఏ దేశంలో పోటీ ఎన్నికలుగానీ, సార్వజనీన ఓటు హక్కు కానీ లేదో - ఎక్కడ ఎన్నుకోబడిన రాజకీయవేత్తలు ఎన్నుకోబడని రాజ్య అధికారులపై కార్యసాధకమైన నియంత్రణ ఉండదో, ఎక్కడ సంఘం ఏర్పడడానికిగానీ, సభ చేయడానికి గాని, స్వేచ్ఛాయుతంగా భావ ప్రకటన చేయడానికిగాని హామీతో కూడిన హక్కులు లేవో - ఆ దేశం ప్రజాస్వామ్యంగా గణింపబడదన్నది స్పష్టం.

ఈ గణనకు మనకు సూచక కేంద్రాలుగా పనిచేసే గుర్తింపబడిన అంతర్జాతీయ ప్రమాణాలు ఉన్నాయి. కొన్ని రంగాలలో అంతర్జాతీయ సంఘటనలు, ప్రభుత్వేతర సంస్థలు పలు సంవత్సరాలపాటు పలు దేశాల ఆచారాలను పరిశీలించి పరిణామం చెందించిన ప్రమాణాలు కొన్ని ఉన్నాయి. కాని కొన్ని రంగాలలో ప్రమాణాలు అంతగా అంగీకరింపబడి అభివృద్ధి చెందలేదు. ఉదాహరణకు పౌర రాజకీయ హక్కుల పరిరక్షణలో లేక ఎన్నికల పద్ధతులలో, అఖండత విషయంలో సామాన్య అంగీకారం

లేదు. కొన్ని దేశాలలో ఆచార వైవిధ్యం ఉంది. కొన్ని దేశాలు మరికొన్నింటికంటే స్పష్టంగా ప్రజాస్వామ్యాలు. ఉదాహరణకు : వారి వారి ఎన్నికల వ్యవస్థ, వారి ప్రభుత్వ అధినేత (అధ్యక్షుడు, ప్రధాని) వారి న్యాయవ్యవస్థ వీటిలోను తేడాలు ఉన్నాయి. ప్రజాస్వామ్యాన్ని అర్థం చేసుకోవడమంటే ప్రజాస్వామ్యపు ఆచారాలలోని న్యాయ సమ్మతమైన, అతి ముఖ్యమైన వైవిధ్యాలను అర్థం చేసుకోవడమే.

ప్రచ్ఛన్నయుద్ధం తరువాతి ప్రపంచంలో ప్రజాస్వామ్యం ఒక సార్వజనీన వ్యవహారం. ఇప్పుడు దీనిని సుమారు అన్ని దేశాలు వాంఛిస్తున్నాయి. అందువలన ప్రజాస్వామ్యం అంటే ఏమిటో, ఎలా ఉండాలో వివరించే పుస్తకం ఇప్పుడు ప్రత్యేకంగా సమయోచితం. ఈ పుస్తకం ముందుగా కొత్తవి, అభివృద్ధి చెందుతున్న ప్రజాస్వామ్యాలకి, పౌరులకి ఎన్నుకోబడిన ప్రజా ప్రతినిధులకు, ప్రజాసేవలకు ప్రజాస్వామ్యపు ఆచారాల విషయంలో కష్టమైన ప్రశ్నలకు సూటి అయిన సమాధానాలు ఇచ్చే సూచనా గ్రంథం కోరేవారికి ఉద్దేశించబడింది. తరువాత అభివృద్ధి చెందిన ప్రజాస్వామ్యాలలోని వారి వారి దేశాల ప్రజాస్వామ్య ప్రవృత్తిలో అస్పష్టమైన అవగాహన కలిగిన పలు పౌరులకి ఉద్దేశించబడినది. కారణమేమంటే ప్రజాస్వామ్యం కొనసాగడానికి లోతై, సంపన్నమవడానికి విజ్ఞానవంతులయిన పౌరులు అతి ముఖ్యం. ఈ సమాచారం విద్యా ప్రవృత్తులకి ఈ పుస్తకం తోడ్పడుతుందని మా ఆశ.

ఈరోజు ప్రజస్వామ్యం కష్టంతో కూడుకున్నది కాదని మేము నటించలేము. జాతి, మతం ఇతర వేర్పాటులవల్లా, నిరుద్యోగం, ఆర్థికమాంద్యంవల్లా, తిరుగుబాటువల్లా అంతర్జాతీయ సంస్థలూ ప్రవృత్తులలో శక్తి క్షీణించడం వల్లా, ప్రజలలో తమ జీవితాలపై తమకే శక్తి లేదన్న విస్తృతంగా ఏర్పడ్డ భావనవల్లా ప్రజాస్వామ్యాలు గట్టి సవాళ్ళను ఎదుర్కొంటున్నాయి. మేము ఈ సమస్యలకి పరిష్కారాలు చూపలేక పోయినా, సమకాలీన ప్రపంచంలో ప్రజాస్వామ్యం మనుగడకి వాటి ప్రాముఖ్యాన్ని గుర్తించగలిగాము.

మొట్టమొదట మనం ప్రజాస్వామ్యాన్ని ఎందుకింత విలువగా చూడాలి. పాఠకుడా, ఈ ప్రశ్నకి సమాధానం తరువాతి పేజీలలో చూసుకోవడానికి ఇదే సమయం. మీరు రాయాలనుకుంటే (పొలిటీ ప్రెస్ చిరునామాకి) రచయితలు మీ సూచనలను సలహాలను ఆహ్వానిస్తున్నారు. మీకు ఈ పుస్తకం ఉపయుక్తంగా కనబడుతుందని మా ఆశ.

**డేవిడ్ బీథమ్, కెవిన్ బోయిల్**

1

# మౌలిక భావాలు, నియమాలు

## 1. ప్రజాస్వామ్యం అంటే ఏమిటి?

మనం మన జీవితకాలం అంతా కుటుంబం, ఇరుగు పొరుగు వారు, సంఘాలు, వృత్తికి సంబంధించిన సంస్థలు మొదలు రాజ్యాలు, ప్రదేశాల వరకు అనేక సమూహాలు లేక సంస్థలలో సభ్యులం. అతి చిన్నవాటి నుండి అతిపెద్ద వాటి వరకు ఈ సంస్థలన్నింటిలోను వాటి వాటి గమ్యాలను, నియమాలను అనుసరించడానికి, బాధ్యతలను, లబ్ధిని సభ్యులలో పంపకం చేసుకోవడానికి, సంస్థ మొత్తానికి సంబంధించిన నిర్ణయాలు తీసుకోవాల్సి ఉంటుంది. ఎవరికొరకు వారు తీసుకునే వ్యక్తిగత నిర్ణయాలకు భిన్నంగా వీటిని సామూహిక నిర్ణయాలంటారు. ప్రజాస్వామ్యం సామూహిక నిర్ణయ నిర్మాణరంగానికి చెందినది. ఇందులో ఒక ఆదర్శం ఇమిడి ఉంది. నిర్ణయాలు సభ్యులందరి చేత తీసుకొనబడాలి. సభ్యులందరికీ నిర్ణయాలు తీసుకొనే హక్కులో సమానభాగం కావాలనే ఆదర్శం ప్రజాస్వామ్యంలో ఇమిడి ఉంది. మరోలా చెప్పాలంటే ప్రజాస్వామ్యంలో సామూహిక నిర్ణయాలలో ప్రజానియంత్రణ, నియంత్రణల అమలులో సమాన హక్కులు అనే రెండు నియమాలను అనుసరించవలసి ఉంటుంది. నిర్ణయాలను తీసుకోవడం, అమలు పరచడం వీటిని అనుసరించిన ఏ సంఘాన్నైనా ప్రజాస్వామ్యం అనవచ్చును.

### సమాజంలో, రాజ్యంలో ప్రజాస్వామ్యం

ప్రజాస్వామ్యాన్ని ఈవిధంగా నిర్వచిస్తే మొట్టమొదట రెండు విషయాలు స్పష్ట మవుతాయి. మొదటిది : మనం సామాన్యంగా భావించినట్లు ప్రజాస్వామ్యం కేవలం రాజ్యం, ప్రభుత్వం అనే రంగాలకు మాత్రమే సంబంధించినది కాదు. ప్రజాస్వామ్య నియమాలు ఏ విధమైన సంస్థ యొక్క సామూహిక నిర్ణయాలకైనా సంబంధం గలవే.

నిజానికి రాజ్యస్థాయి ప్రజాస్వామ్యానికి, సమాజంలో ఇతర సంస్థలలోని ప్రజాస్వామ్యానికి మధ్య ఒక ముఖ్యమైన సంబంధం ఉంది. రాజ్యం సమాజం యొక్క విషయాలన్నింటినీ క్రమబద్ధం చేసే హక్కు, నిర్బంధ పన్నులను పెంపుచేసే అధికారం, సభ్యుల జీవన మరణాలపై అధికారం విస్తృతమైన హక్కులు కలిగి ఉండడంవల్ల రాజ్యస్థాయిలో ప్రజాస్వామ్యం కీలకమైన ప్రాముఖ్యం కలిగి ఉంటుంది. అందుచేతనే మన అతి ముఖ్య సంబంధం ప్రజాస్వామ్య ప్రభుత్వంతోనే.

### ఒక సాపేక్ష భావన

మన నిర్వచనం గురించిన రెండవ విషయం ఏమిటంటే ఒక ప్రజాస్వామ్యం పూర్తిగా కాని ఏమీ లేని కాని వ్యవహారంకాదు. ప్రజాస్వామ్యం విషయంలో అంశాభేదం ఉండవచ్చును. ప్రజా నియంత్రణ రాజకీయ సమానత్వం అనే నియమాలు ఏఏ వ్యవస్థలలో ఎంత వరకు గుర్తించబడ్డాయి అనేది ప్రజాస్వామ్యంలోని అంశాభేదానికి సంబంధించిన విషయం. నిర్ణయాలలో సామూహిక సమాన భాగస్వామ్యం ఆదర్శం. ఈ ఆదర్శానికి ఎంత దగ్గర లేక ఎంద దూరం అన్నది మళ్ళీ అంశా విషయమే. ఒక రాజ్యంలో ప్రభుత్వం ప్రజా అధికారాన్ని పోటీ ఎన్నికల ద్వారా జవాబుదారీగా పొందినపుడు, వయోజనులందరికీ ఓటే చేసే హక్కు, పోటీ చేసే హక్కు ఉన్నప్పటికీ, చట్టబద్ధంగా రాజకీయ హక్కులకు హామీ ఉన్నప్పుడు సంప్రదాయ సిద్ధంగా ఆ రాజ్యాన్ని మనం ప్రజాస్వామ్యమంటాము. కాని అట్టి ఏ రాజ్యమూ ఆచరణలో ప్రజా నియంత్రణ, రాజకీయ సమానత్వం అనే రెండు నియమాలని పూర్తిగా కలిగి ఉండదు. ఆమేరకు ప్రజాస్వామ్యీకరణ కార్యక్రమం ఎప్పటికీ సంపూర్ణంకాదు. వారు ఏ రాజరికంలో, ఏ రాజకీయ వ్యవస్థలో ఉండడం సంభవించినా ప్రజాస్వామ్యవాదులందరూ ప్రజాస్వామిక నియమాలను సంఘటించి, పెంచే పోరాటంలో చేరి ఉన్నారు.

## 2. మనం ప్రజాస్వామ్యాన్ని విలువైనదిగా ఎందుకు చూడాలి?

మనం ప్రజాస్వామ్యాన్ని విలువైనదిగా చూడవలసి ఉండడానికి ఎన్నో కారణాలున్నాయి.

### పౌరసత్వపు సమానత్వం

ప్రజాస్వామ్య ఉద్దేశ్యం ప్రజలందరినీ సమానంగా చూడడం. కొంతమంది జీవితాలు మరికొంతమంది జీవితాలకంటే సహజ సిద్ధమైనవన్న కులీన పాలన భావాన్ని ఎదుర్కొంటూ జెరమీ బెంథామ్ అనే ఆంగ్ల న్యాయశాస్త్ర సిద్ధాంతకర్త రాసినట్లు ప్రతీ

ఒక్కరూ ఒకటిగాను ఏ ఒక్కరు ఒకటికంటే ఎక్కువ కాకుండాను లెక్కింపబడాలి. సమానత్వ నియమం కోరేది కేవలం ప్రజలందరి క్షేమాన్ని ప్రభుత్వం సమానంగా పట్టించుకోవాలని మాత్రమేకాక ప్రజలందరి ఉద్దేశ్యాలకి సమానమైన పరిగణన ఇవ్వడం కూడా. యూరిపిడిస్ అనే గ్రీకు నాటకకర్త వ్రాసిన ఒక నాటకంలో ఒక ఏథెన్స్ పౌరుడు ఇలా అన్నాడు. "మేము ధనానికి ప్రత్యేక అధికారం ఇవ్వము. బీదవాడి మాటా సమానమైన అధికారాన్నే శాసిస్తుంది." ప్రజాస్వామ్య విమర్శకులు ప్రజా సందోహాలు చాలా తెలివి తక్కువైనవని, అశిక్షితులని, ప్రజావిధానాల నిర్ణయంలో పాలు పంచుకోవడానికి హ్రస్వదృష్టి గల వారిని అభ్యంతరం చెప్పారు. ప్రజలకు సమాచారం కావాలన్న విషయం ఖాయమని దానిని వారు ఆకళింపు చేసుకోవడానికి సమయం కావాలని, అవసరం వచ్చినపుడు ఆ ప్రజలు బాధ్యతాయుతంగా కార్యరంగంలో పనిచేయడానికి సంపూర్ణంగా సమర్థులని ప్రజాస్వామికుల సమాధానం. వయోజనులందరు వారివారి వ్యక్తి గత జీవితాలను నిర్దేశించే బాధ్యత తీసుకోగలరని ఎలా అనుకుంటామో అలాగే వారు, వారి సమాజంపై ప్రభావం కలిగిన నిర్ణయా లన్నింటిలోను పాలు పంచుకోవడానికి వారు సమర్థులే.

## ప్రజావసరాలని తీర్చడం

ఇతర విధాల ప్రభుత్వం కంటే ప్రజాస్వామ్యమే ఎక్కువగా సామాన్య ప్రజల అవసరాలను తీర్చగలదు. విధాన నిర్దేశంలో ప్రజలకు చెప్పదలచిన అంశాన్ని చెప్పే అవకాశం ఎంత ఎక్కువ ఉంటే వారి అభిలాషలను, ఆశయాలను ప్రతిబింబించే నిర్ణయాలను తీసుకోవడానికి అంత ఎక్కువ అవకాశం ఉంటుంది. "జోళ్ళు కుట్టేవాడు జోడుకుడతాడు. కాని జోడు తొడుక్కున్నవాడికే తెలుస్తుంది అది ఎక్కడ కరుస్తుందో" అని ఎథీనియన్ సామెత. ప్రభుత్వ విధానాల పరిణామాలను అనుభవించేది సామాన్య ప్రజలు. కార్యసాధకమై సంగతమైన ప్రభావం చూపించే మార్గాలు క్రింద నుంచి ఒత్తిడి ఉన్నప్పుడే ఆ అనుభవాలు విధానంలో ప్రతిబింబిస్తాయి. అధికారాన్ని పొంది వున్నవారు ఎంత మంచి ఉద్దేశాలు ఉన్నవారైనా, ప్రజా ప్రభావం లేక నియంత్రణకి మినహాయింపు పొందిన వారైతే వారి విధానాలు అతి ఉత్తమమైనవిగా ఎంచితే - ప్రజల అవసరాలకి అసముచితాలవుతాయి. అతి చెడ్డగా ఎంచితే స్వార్థపూరితాలూ, అవినీతి అవుతాయి.

## బహుతావాదం-రాజీ

ప్రజాస్వామ్యం చర్చ, ఒప్పించుట, రాజీ వీటి మీద ఆధారపడుతుంది. ప్రజాస్వామిక

వాదుల చర్చపై ఊనికలో కొన్ని ముందుగా భావించిన విషయాలున్నాయి. అవేమిటంటే వివిధ విధానాలలో అభిప్రాయ భేదాలుంటాయి. ఆ వైరుధ్యాలు ప్రకటించడానికి హక్కు ఉండాలి. ఈ విధంగా ప్రజాస్వామ్యం వైవిధ్యతను సమాజంలో, సమాజంలోని పౌరుల మధ్య ఉంటుందని ముందే భావిస్తుంది. ఇలాంటి వైరుధ్యాలు ప్రకటింపబడితే ఈ భేదాలను తొలగించడానికి బలవంతంగాను, బలప్రయోగం వల్లనూ కాక చర్చద్వారా, ఒప్పించడం ద్వారా, రాజీ ద్వారా ప్రజాస్వామ్యం విజయాన్ని సాధిస్తుంది. వ్యంగ్యంగా తరచూ ప్రజాస్వామ్యాలు మాటల అంగళ్ళుగా చిత్రించబడ్డాయి. ఆవసరికంగా నిర్ణయాత్మకమైన క్రియతో అసంగతమైనదిగా కాక విధానానికి అంగీకారాన్ని పొందే అత్యుత్తమ పద్ధతి కాబట్టి బహిరంగచర్చా సామర్థ్యం దుర్గుణంగా కాక సుగుణంగానే పరిగణించబడాలి.

## మౌలిక స్వేచ్ఛల హామి

ప్రజాస్వామ్యం మౌలిక స్వేచ్ఛలకు హామీ ఇస్తుంది. బహిరంగ చర్చ పౌరహక్కులు, రాజకీయ హక్కులు పొందు పరచబడిన సంప్రదాయాలో ఈ స్వేచ్ఛలు లేకుండా సామాజిక అంతరాలు ప్రకటించి పరిష్కరించడానికి సాధ్యం కాదు. వాక్ స్వాతంత్ర్యం. సంఘంగా ఏర్పడే హక్కు, పర్యటన హక్కు, వ్యక్తి క్షేమానికి హక్కు - ఈ హక్కులు పరిరక్షింపబడటానికి మనం ప్రజాస్వామ్యంపై నమ్మకంతో ఆధారపడవచ్చును. ఎందుచేతనంటే ఈ హక్కులు ప్రజాస్వామ్య మనుగడకి అత్యంత అవశ్యకాలు కాబట్టి. అత్యుత్తమ స్థాయిలో ఈ హక్కులు వైయ్యక్తిక ప్రగతిని సుసాధ్యం చేస్తాయి. సాక్ష్యాధారాలు, రెండు పక్షాల వాదనలూ వీటి వైవిధ్యంలో పరీక్షింపబడిన సామూహిక నిర్ణయాలు చర్చ నుండి అవతరిస్తాయి.

## సమాజపరమైన పునరుత్తేజం

ప్రజాస్వామ్యం సమాజపరమైన పునరుత్తేజానికి దోహదం చేస్తుంది. వారి వారి ఔపయోగికత దాటిన విధానాలను, రాజకీయవేత్తలను శాంతియుతంగా తొలగించే ఒక నిత్యకృత్యం ఏర్పరచడంవల్ల ప్రజాస్వామ్య వ్యవస్థ ప్రజాస్వామ్యేతర పాలనలో కీలక ఉద్యోగుల తొలగింపువల్ల వచ్చే ప్రభుత్వ అంతరాలు విపరీతమైన విప్లవాలు లేకుండా సమాజపరమైన, తరాల పరమైన పునరుత్తేజాన్ని సులభ సాధ్యం చేస్తాయి.

## 3. ప్రజాస్వామ్య భావన ఎక్కడ నుంచి వచ్చింది?

సామాన్య ప్రజలు కూడ తమ జీవితాలను ప్రభావితంచేసే నిర్ణయాలలో తమ అభిప్రాయాలను చెప్పే అవకాశం ఉండాలన్న ఆశయం వివిధ చారిత్రక సమాజాలలో నుంచి బహిర్గతం అయింది. క్రీ॥పూ॥ ఐదు, నాలుగు శతాబ్దాలలో గ్రీసు దేశంలోని ఏథెన్స్ నగరంలో ఈ భావన ప్రాచీన సంస్థారూపాన్ని దిద్దుకుంది. అయిదవ శతాబ్ది తొలిదశ నుంచి ప్రజాధికారానికి ఆస్తి అర్హతలు తొలగింపబడినపుడు ప్రతి ఏథెన్స్ పౌరుడు తమ జాతి చట్టాలు విధానాలను గురించిన సమావేశాలలో స్వయంగా ఓటు వేసే హక్కు ఉండేది. న్యాయ విచారణా సేవలో పరిపాలనా సంఘాల కార్య నిర్వహణలో ప్రతీ పౌరునికి భాగం ఉండేది. పదవులకు వంతుల ప్రకారం నియామకం ఉండేది. ఆనాటి నుంచి ప్రజాస్వామ్యవాదులకు ఈ మొదటి ప్రజాస్వామ్యపు ఉదాహరణ సూచీ కేంద్రంగాను ఉత్సాహమిచ్చే భావనగాను ఉపయోగిస్తూ వచ్చింది. ఏథెన్స్ నగర పౌరులు వారి హక్కుల వినియోగ వలన ఆ దేశ ఆర్థిక, నావిక, సార్వభౌమత్వం రావడం సృజనాత్మక కళలు వెల్లివిరియడం, వేదాంత సంబంధమైన సిద్ధాంతాలు పెంపొందడం, ప్రజాస్వామ్య విమర్శకుల వాదనలను అంతమొందించాయి. సామాన్య ప్రజలకు వారి వారి వ్యవహార వ్యాపారాలలో మాట్లాడే హక్కు ఇవ్వడం వల్ల స్థబ్దుగా ఉండే ఏకవిధమైన సమాజం వస్తుందని లేక బాధ్యతారహితమైన సమాజం వస్తుందన్న విమర్శకుల వాదాలు అంతమయ్యాయి.

### ప్రత్యక్ష ప్రజాస్వామ్యం

మనకి తెలిసిన ఈనాటి ప్రజాస్వాములకంటే ఏథెన్స్ ప్రజాస్వామ్యం కొంతవరకు ఎక్కువ, కొంత వరకు తక్కువ అయిన ప్రజాస్వామ్యం. ఈనాటి ప్రాతినిధ్య ప్రజాస్వామ్యాలు పరోక్షమైనవి కాబట్టి పౌరులు పార్లమెంట్‌కి, ప్రభుత్వానికి ఓ స్థాయి దూరంగా ఉంటాయి. కాని ఏథెన్స్ పౌరులు స్వయంగా వారి సమాజంలోని ముఖ్య నిర్ణయాలను తీసికోవడంవల్ల వారిది ఎక్కువ ప్రజాస్వామికం, ప్రత్యక్ష ప్రజాస్వామ్యం సాధ్యమవడానికి సాపేక్షంగా, ఒకే సభా భవనంలో ఇమిడే చిన్న పౌరవర్గం కావాలి. పౌరవర్గానికి సమాచార జ్ఞానంతో రాజకీయ నిర్ణయాలు తీసుకోవడానికి వాదనలను, సాక్ష్యాలను గ్రహించడానికీ ఇతర బాధ్యతలు లేకుండా తగినంత కాలం అందుబాటులో ఉండాలి. ఈనాటి పౌరవర్గాలకి ప్రత్యక్ష ప్రజాస్వామ్యం సాధ్యపడడానికి కావలసిన పరిస్థితులు లేవు. అయినప్పటికీ వారు జాతీయస్థాయిలో, ఎన్నికలలో ప్రజాభిప్రాయ సేకరణలో ప్రత్యక్ష

నిర్ణయాలు తీసుకోవడానికి ప్రాంతీయస్థాయిలో నిర్ణయాలు తీసుకోవడానికి అవకాశం ఉంది.

### మినహాయింపబడిన పౌరసత్వం

పౌరసత్వం స్వతంత్రులు వారి మగబిడ్డలకు మాత్రమే పరిమితమయినందున ఏథెన్స్ ప్రజాస్వామ్యం ఈనాటి ప్రజాస్వామ్యం కంటే తక్కువ ప్రజాస్వామికం. అందులో స్త్రీలు, బానిసలు, విదేశీయులు మినహాయింపబడ్డారు. ఈ బృందాలు గృహ సంబంధమైన పనులు, ఉత్పత్తి కృషిలో పాల్గొని మగపౌరులకు రాజకీయ కార్యక్రమాలలో పాల్గొనడానికి వీలు కల్పించేవి. ప్రత్యక్ష ప్రజాస్వామ్యంలో క్రియాశీలకంగా వేరుగా పాలుపంచుకోవడం నియమితమైన పౌరసత్వంవల్లనే సాధ్యమైనది. ప్రజలు నిర్ద్వంద్వంగా పరిపాలించారు గాని ఆ ప్రజలు ఒక ప్రతిష్ఠాకరమైన స్థాయివారు మాత్రమే.

### ఆధునిక మినహాయించే లక్షణం

చాలా పాశ్చాత్య పార్లమెంటరీ వ్యవస్థలలో కూడా ఈ అదుపులు సుమారు ఇరవైయ్యవ శతాబ్దం వరకు ఉండేవని జ్ఞాపకం ఉంచుకోవడం అవసరం. ఫ్రెంచి విప్లవంతో ఖ్యాతి పొందిన "రాజకీయ అధికారమంతా ప్రజల నుండే ఆవిర్భవమవుతుంది" అన్న నియమం ప్రజలందరినీ అందులో చేర్చాలని కాదు. ఈవిధంగా ఈ శతాబ్దంలో మాత్రమే స్త్రీలకు, ఆస్తిలేని పురుషులకు పాశ్చాత్య దేశాలలో ఓటుహక్కు ఇవ్వబడినది. ఈనాటికీ దేశంలో ఉన్న వయోజనవాసులందరికీ, ఆర్థిక వ్యవస్థకీ వారెంత దోహదం చేసినా ఎన్నికలలో ఓటు హక్కులేదు.

## 4. ప్రజా ప్రాతినిధ్య పద్ధతి నిజంగా ప్రజాస్వామికమేనా?

సిద్ధాంతకర్త పద్దెనిమిదవ శతాబ్దపు రూసో ఇలా అనుకోలేదు. అయన వాదం ప్రకారం ప్రాతినిధ్య పద్ధతిలో ప్రజలు కొన్ని ఏళ్ళలో ఎన్నికల సమయంలో ఒకసారి మాత్రమే స్వతంత్రులు. ఆ తరువాత వారు పాలకుల క్రింద అప్రధాన సేవకులవలె ఉండడం బానిసత్వంకంటే మేలైనదేమీకాదు. ప్రజలకు అత్యంత ప్రాముఖ్యం ఇవ్వబడుతుందన్న మితపక్ష అభ్యంతరానికి విరుద్ధంగా ప్రాతినిధ్య పద్ధతి సముచితమైన ప్రజాస్వామ్యం కాదన్న వామపక్షాలలో ఇది అతివాదం.

### ఎన్నికల ద్వారా నియంత్రణ

పౌరవర్గం మిలియన్‌ల సంఖ్యలో ఉన్నప్పుడు, సదా రాజకీయ వ్యవహారాలలో ప్రజలు

పాల్గొనలేని పరిస్థితులలో ప్రభుత్వంపై నియంత్రణ కొరకు ఇప్పటికి వచ్చిన వ్యవస్థలలో ప్రభుత్వంపై నియంత్రణ కొరకు ఇప్పటికి వచ్చిన వ్యవస్థలలో ప్రాతినిధ్య పద్ధతి అత్యుత్తమమయినదని సామాన్య సమాధానం. ప్రజలు శాసనసభ, పార్లమెంటు సభ్యులని ప్రభుత్వ అధిపతి అయిన అధ్యక్షుణ్ణి లేక ప్రధానిని ఎన్నుకోవడంవల్ల వారి ప్రతినిధులు తమ తరఫున ప్రభుత్వాన్ని పర్యవేక్షణ చేస్తూ చట్టం చేయడంవల్ల, పన్నుల విధింపులో తమ ఆమోద తిరస్కారాలద్వారా ప్రజలు ప్రభుత్వాన్ని నియంత్రణ చేస్తారని సిద్ధాంతం. ఎంతవరకు ఎన్నికలు స్వచ్ఛంగా స్వేచ్ఛాయుతంగా ఉంటాయో ఆమేరకు ఈ ప్రజానియంత్రణ కార్యసాధకమైనది. ఆ ప్రభుత్వం స్వచ్ఛమైనది. ఆ పార్లమెంటుకు పరిశీలన చేయడానికి కార్యక్రమాలను నియంత్రించడానికి ఆచరణలో తగినన్ని అధికారాలు ఉన్నాయి.

## ప్రజాభిప్రాయం

ప్రజాప్రతినిధి పద్ధతిలో ఎన్నికలో ప్రజాభిప్రాయాన్ని తెలిపే మాధ్యమం అయినా అ ఒక్కటే మార్గంకాదు. ప్రజలు సంఘాలుగా ఏర్పడి చట్టంపై మార్పులకొరకు, మార్పులకు వ్యతిరేకంగా కాని ప్రచారం చేయవచ్చును. రాజకీయ పక్షాలలో సభ్యులు కావచ్చును. వారి వారి ప్రతినిధులతో స్వయంగా లోపాయికారి చర్చలు చేయవచ్చు. వారివంతుగా ప్రభుత్వం తమ విధానాలవల్ల ప్రభావితులయ్యేవారిని సమాజంలో కొన్ని వర్గాలవారిని సంప్రదించవచ్చును. ఆచరణలో ప్రజాప్రాతినిధ్య ప్రభుత్వాలు ప్రజాభిప్రాయాన్ని పట్టించుకోకపోవడం అరుదు. పత్రికల ద్వారాను, రేడియో, టెలివిజన్ ద్వారాను క్రమం తప్పకుండా అభిప్రాయ సేకరణ జరుగుతుంది. కాని ప్రజాప్రభావం చూపే ఈ మార్గాలన్ని చివరకు ఎన్నికల వ్యవస్థమీదే ఆధారపడి ఉంటాయి. ప్రజాభిప్రాయాన్ని పాటించకపోతే వారు అధికారంలో నుంచి తొలగింపబడగలరన్న వాస్తవికమైన అవకాశం ఉన్నప్పుడే ప్రభుత్వం ప్రజల మాటలని తగిన గాంభీర్యంతో వింటుంది.

## ప్రత్యక్ష నియంత్రణ - పరోక్ష నియంత్రణ

ప్రాతినిధ్య పద్ధతిలో ప్రజా నియంత్రణ ప్రభుత్వ విధానాలూ, ఎన్నికలలోని ఉద్యోగుల తీరుపై వారి ప్రభావం, ప్రజా ప్రతినిధుల సభల ద్వారానూ అనేక మార్గాలలో ప్రజాభిప్రాయాన్ని రూపొందించడం వల్లనూ, ప్రజాప్రతినిధులు కార్యక్రమాలను పర్యవేక్షించడం వల్లనూ, ప్రజా ప్రభుత్వాలపై ప్రజానియంత్రణ ఉంటుంది.

## రాజకీయ సమానత్వం

ఇక ప్రజాస్వామ్య నియమాలలో రెండవదైన (మొదటి ప్రశ్న చూడండి)రాజకీయ సమానత్వం మాట ఏమిటి?

ప్రాతినిధ్య పద్ధతిలో ఒక విషయంలో అసమానత ఉంది. ప్రజానీకంలో కొద్దిమందికి మిగిలినవారందరి తరఫున రాజకీయ నిర్ణయాలు తీసుకొనే అధికారం ఇవ్వడంలో కాని ఈ పరిధులలో ప్రజాధికారానికి పోటీ చేయడానికి పౌరులందరికి సమానహక్కు ఉండడంద్వారా, ప్రజా విషయాలద్వారా ప్రచారం చేయడం, సరియైన పాలన కొరవడినప్పుడు ఇబ్బందులను చక్కదిద్దుకోవడం వలన ఆ మేరకు రాజకీయ సమానత్వం సాధించవచ్చును. ఎన్నికల పద్ధతి ప్రతి ఒక వ్యక్తి ఓటుకి సమానమైన విలువనిస్తుంది ఆచరణలో ప్రాతినిధ్య పద్ధతిలోని చాలా ప్రజాస్వామ్యాలు ఈ షరతులన్నింటినీ పూర్తిగా సంతృప్తిపరచవు. ఎందుచేతనంటే రాజకీయ సమానత్వం వరుసగా ధనం, కాలం అందుబాటు ఇతర వనరులు కలిగి ఉండడంలో బృందాల మధ్య వైవిధ్యం కలిగి ఉండడం. వీటివలన రాజకీయ సమానత్వం రాశిలో పరిమితమై ఉంటుంది. అలాగే ప్రభుత్వంపై ప్రజానియంత్రణకు కార్యసాధకాలైన వ్యవస్థా యంత్రాంగాన్ని రూపొందించడంతోపాటు అంతరాల రాజకీయ ప్రభావాన్ని తగ్గించడానికి మార్గాలని చూడడం ప్రాతినిధ్య పద్ధతిలోని ప్రజాస్వామికులందరికి ఒక అతి ముఖ్యమైన కార్యక్రమం.

## 5. ప్రజాస్వామ్యంలో రాజకీయపక్షాలు ఎలాంటి పాత్రను నిర్వహిస్తాయి?

పెద్ద సమాజంలో ప్రజలు వ్యక్తులుగా కొద్దిపాటి పౌర ప్రభావం చూపగలిగినా సమీకృతమైనపుడు ఎక్కువ ప్రభావాన్ని చూపగలరు. రాజకీయ అధికారాన్ని, పలుకుబడిని సాధించడానికి, ప్రచారం చేయడానికి ఒక ఆలోచనా విధానం పంచుకొనే పలువురిని రాజకీయ పక్షాలు కూడగడతాయి. అంతేకాక, పలు విధాలైన ఇతర విధులను నిర్వహిస్తాయి. **నియోజకులకు** ఎన్నికలలో పలువురి విశాల విధాన స్థితులను వారి వారి ప్రణాళికలను తెలిపి ఎంపికను సులభతరం చేస్తాయి. **ప్రభుత్వాలకు** వారి వారి ప్రణాళికలను సాధించుకోడానికి స్థిరమైన రాజకీయ మద్దతుదార్లను ఇస్తాయి. **రాజకీయాలకు కట్టుబడినవారికి** ప్రజా వ్యవహారాలలో గట్టిగా కలుగజేసుకోవడానికి రాజకీయ విద్యకి అవకాశాలను ప్రజావిధానాలను ప్రభావితం చేయడానికి మార్గాలని అందిస్తాయి.

## స్వచ్ఛమైన పోటీ

స్వేచ్ఛాయుత స్వచ్ఛ ఎన్నికల విధానంలో రాజకీయపక్షాల విజయం అవి పొందే నియోజకుల మద్దతుయొక్క అంశంపై ఆధారపడి ఉంటుంది. అంటే వారు వారి ప్రణాళికలను ఏర్పరచుకోవడంలోను పదవులకు వ్యక్తులను ఎంపిక చేయడంలోను ఎప్పటికప్పుడు ప్రజాభిప్రాయం తెలుసుకుంటూ ఉండాలని అర్థం. వారు అలా చేయకపోతే ఇతర పార్టీలకు లబ్ధి కలిగించే వారవుతారు. లేదా ఏర్పడిన ఆ శూన్యాన్ని కొత్త పక్షాలవారు ఆక్రమించుకోవడానికి వీలు కల్పించినట్టవుతుంది. ఈవిధంగా రాజకీయ పక్షాలు ప్రజాభిప్రాయాలను ప్రభుత్వంలో కార్యసాధకంగా చేసే కీలక విధానాన్ని ఏర్పరుస్తాయి. కాని వారి ఈ పాత్ర ఆటస్థలం చదునుగా ఉంటేనే నిర్వహించగలరు. ఒక్కొక్కసారి కొన్ని రాజకీయపక్షాలకు ప్రభుత్వ వనరులు అందుబాటులో ఉండవు. నియోజకులతో ఉద్దేశాలు పంచుకొనే అవకాశం ఉండదు. అధికారంలో ఉన్న పార్టీలు వారి ప్రభుత్వ విధులను, పార్టీ విధులను, వ్యవస్థలను స్పష్టంగా వేర్పరచవలసిన ప్రత్యేక అవసరం వుంది.

### సామాజిక విభజన

ప్రాతినిధ్య ప్రజాస్వామ్యంలో రాజకీయ పక్షాల మధ్య నియోజకుల పోటీ తప్పనిసరి అయితే అది వారి ముఖ్యమైన బలహీనత కూడా. పదవికొరకు స్వేచ్ఛాయుత పోటీలో సామాజికంగా, రాజకీయంగా విభజించే లక్షణం ఉంది. ఆ పోటీలో పాల్గొనేవారి పణాలు చాలా పెద్దవి కాబట్టి ప్రజాస్వామ్య మనుగడకు షరతేమిటంటే ఓడిన పక్షాలకు పదవుల నుంచి దూరంగా ఉంచబడిన వారి మద్దతుదార్లకు ఆ ఓటమి వెల భరించరానిదిగా ఉండరాదు. ప్రత్యేకంగా వారు మళ్లీ పోటీలో విజయవంతంగా పాల్గొనగలమన్న విశ్వాసం ఉండాలి. అంతేకాక ఓడిన తరువాత కూడా మళ్లీ సంఘటన చేయడానికి, ప్రచారం చేయడానికి, ప్రభుత్వాన్ని విమర్శించడానికి తమ విధులను, కార్యక్రమాలను కొనసాగించగలమన్న ధైర్యమూ కావాలి.

## 6. ప్రచార సాధనాలు ప్రజాస్వామ్యానికి ఎందుకు ముఖ్యమైనవి?

ఏ విధమైన రాజకీయ వ్యవస్థలోనైనా అన్ని ప్రభుత్వాలు వారి వారి విధానాలకు ప్రజలయొక్క అంగీకారం, మద్దతు కావాలని కోరుకుంటాయి. ప్రజానీకానికి దగ్గరవడానికి అవి సమకాలీన సమాజంలో ప్రెస్, రేడియో, టి.వి. మొదలగు ప్రసార

సాధనాలపై ఆధారపడతాయి. కాబట్టి ఈ సాధనాలు కీలకమైన రాజకీయపాత్రను నిర్వహిస్తాయి. ఏ ప్రజాస్వామ్యంలో అయినా ఈ సాధనాలు ప్రభుత్వ ప్రచారానికి మాత్రమేకాక అనేక ఇతర విధులనుకూడ నిర్వహించాలి. ప్రభుత్వాన్ని దర్యాప్తు చేయడం, ప్రజలకి సమచారాన్ని అందించడం రాజకీయ చర్చకు ఒక వేదికను అందించడం ప్రజాభిప్రాయం కూడగట్టడానికి ఒక మార్గాన్ని ఇవ్వడం ప్రభుత్వంపై ఒత్తిడిని తీసుకురావడం ఆ విధులలో కొన్ని.

## కావలికాచే కుక్కలాగా పత్రికారుడు ఉండాలి

దర్యాప్తు సమాచారం అందించే ప్రచార సాధనాల విధులు ప్రభుత్వంయొక్క గోపనీయతను ప్రతిఘటించడానికి అవసరం. అలాగే ప్రభుత్వపు ప్రజాసంబంధాల యంత్రాంగం బరువు తగ్గించడానికి ప్రచార సాధనాలు కృషి చెయ్యాలి. ప్రభుత్వ విధానాలపై అధికారిక ప్రకటనలు ప్రచురించే స్వతంత్ర మార్గాలున్నప్పుడే, ప్రజలకు వారు ఏమి చేస్తున్నారో తెలిసినపుడే ఏ ప్రభుత్వం అయినా బహిరంగంగా జవాబుదారీ కాగలదు. ప్రచర సాధనాలు గోపనీయ పరిధులను అధిగమించకుండా ప్రజలకు ఉపయోగించే విధంగా సమాచారాన్ని అందించడం వారి పని, వాటిని అందుకోవడం ప్రజల విధి. ఇది మరోలా అయితే ప్రచారసాధనాలు వారి ముఖ్యమైన కావలికుక్క పాత్రని నిర్వహించలేవు.

## బహిరంగ చర్చ

స్వతంత్ర సమాచారం ఇవ్వడమే కాకుండా ప్రచార సాధనాలు చర్చకు ప్రజావేదికలను సమకూర్చాలి. సామూహికంగా ప్రేక్షకులు చూడటానికి వీలైనట్లు మంత్రులు, ముఖ్య వ్యక్తులతో ముఖాముఖి కార్యక్రమాలు సామాన్య పౌరుల భావాలను ప్రతిబింబించడానికి వీలుగా ఏర్పాటు చేయాలి. వీటిద్వారా ప్రజాభిప్రాయం ప్రభుత్వం వరకు చేరే ఒక వీలు కలుగుతుంది. ప్రజాబాహుళ్యం అంతటిని ఆకట్టుకోడంవల్ల పార్లమెంట్‌యొక్క పరీక్షా విధులు, చర్చా విధులను బలపరచడానికి ఈ విషయాలన్నింటిలోను ప్రచార సాధనాలు ఉపయోగిస్తాయి.

## ప్రచార సాధనాల స్వేచ్ఛ

ప్రచార సాధనాలు ఉచితమైన స్వేచ్ఛ గలిగినపుడు మాత్రమే కీలకమైన తమ విధులను నిర్వహించగలవు. ప్రభుత్వంద్వారా గాని ఇతర లబ్ధిదారులు కాగలిగే వారి వల్ల గాని




ప్రభుత్వ గోపనీయతా ప్రయత్నాలను ఎదుర్కొనటానికి ప్రచార సాధనాల భావుక విధులు అవసరం.

అధికారం చెలాయింపబడనపుడే వారు విధులను నిర్వహించగలరు. బహిరంగంగా వ్యక్తులే మదుపు పెట్టబడిన సాధనాలు ఒక స్వతంత్ర కమిషన్‌కు లేదా పౌరబృందాల ప్రతినిధులకు జవాబుదారీ చేయబడడంవల్ల ప్రభుత్వ చలాయింపును నియమితం చేయవచ్చును. అలాగే లబ్ధిగలిగేవారి చలాయింపును అదుపుచేయడం ఈ సాధనాల స్వంతదారులను నియమితం చేయడంద్వారా వీలవుతుంది. కాని ఇవేవి ప్రచార సాధనాలు తమ ప్రజాస్వామిక పాత్రను నిష్పాక్షికంగా కార్యసాధకంగా పనిచేస్తాయన్న హామీని ఇవ్వలేవు. చివరకు ఆ పాత్ర పత్రికా రచయితలలో, సంపాదకులలో, ప్రకాశకులలో వృత్తి బాధ్యతలో సేవానిరతికి కట్టుబడే లక్షణంపై ఆధారపడి ఉంటుంది.

## 7. ప్రాతినిధ్య ప్రజాస్వామ్యాలని ఉదార ప్రజాస్వామ్యాలని ఎందుకంటారు?

మొదట దీనికి ఒక చారిత్రక కారణం ఉంది. చాలా పాశ్చాత్య రాజ్యాలు ముందు ఉదారాలు తరువాత ప్రజాస్వామ్యాలు అయ్యాయి. అంటే సార్వజనీన ఓటు హక్కు ఈయడం, సామూహిక రాజకీయ పక్షాలు పెంపొందడంకంటె ముందే అవి ఉదార రాజ్యాంగ వ్యవస్థను సాధించాయి. ఈ వ్యవస్థ అతి ముఖ్యమైన లక్షణాలు : ఎన్నుకోబడిన పార్లమెంటు సభ్యులు ఆమోదించిన చట్టాలకు ప్రభుత్వము, కార్య నిర్వహణాధికారులు లోబడి ఉండడం, వ్యక్తికి హామి ఇవ్వబడిన వాక్ స్వాతంత్ర్యం, సంఘంగా ఏర్పడే హక్కు, పర్యటనకి సంబంధించే హక్కులు, తగినంత స్వేచ్ఛగలిగిన న్యాయశాఖ ఇవి అతి ముఖ్యమైనవి. చారిత్రకంగా ఈ ఉదారీకరింపబడిన రాజ్యాంగ లక్షణాలు సంఘటింపబడక ముందే ఎక్కడ ఓటుహక్కు విస్తరింపబడిందో, ఎక్కడ ప్రజాసమూహాల రాజకీయ పార్టీలు అభివృద్ధి చెందింప బడ్డాయో, ఆ ప్రజాస్వామ్యాలు రక్షణలేనివిగా ధృవీకరింపబడ్డాయి.

### సమనయ పాలన

ఉదార రాజ్యాంగతా లక్షణం, ప్రజాస్వామ్యం ఒక దానికొకటి కలిసి ఉండటానికి రెండవ కారణానికి మనని తీసుకువస్తుంది. ఒక ఆధునిక రాజ్యంలోని ప్రభుత్వంవద్ద విపరీతమైన అధికారాలున్నాయి. అట్టి ప్రభుత్వానికి ఎలాంటి ప్రజాదరణ ఉన్నా దానిని న్యాయపరిధిలో ఉంచకపోతే, ఆమోదింపబడిన పద్ధతులలో అవిచేసిన చట్టాలకు పార్లమెంటు ఆమోదం పొందాలన్న నియమం లేకపోతే అవి పౌరుల హక్కులను,

స్వేచ్ఛలను గౌరవించకపోతే ప్రజలు ఆ ప్రభుత్వాన్ని నియంత్రణ చేసే సామర్థ్యాన్ని కోల్పోతారు. ప్రజాస్వామ్యం ఒక క్షణంలో ప్రజలు కోరినవన్నీ ఇచ్చే వ్యవస్థకాదు. కాని ప్రజల ప్రభావానికి నియంత్రణకి లోనై కొనసాగే ప్రాతిపదికపై ఉండే వ్యవస్థ. రేఖా మాత్రంగా చెప్పాలంటే సమనయపాలన, పాలన, శాసన, న్యాయశాఖ అధికారాల విభజన, వ్యక్తిగత హక్కుల స్వేచ్ఛలకు హామీ, ఉదారీకరింపబడిన రాజ్యాంగ పద్ధతిలోని మౌలిక లక్షణాలుగా నిరూపింపబడ్డాయి.

### రాజ్యాంగతావాదం - ప్రజాస్వామ్యం

రాజ్యంగతావాదం అనే పదంలో ఈ లక్షణాలు ఇమిడి ఉండడంవల్ల హక్కులు విధులు, రాజ్యంయొక్క వివిధ శాఖలు అంతర్భాగాలు స్పష్టంగా నిర్వచించబడి బహిరంగంగా తెలియబరచబడిన లిఖిత రాజ్యంలోనే ఉత్తమంగా రక్షింపబడతాయి. ప్రజా అధికారులు వారి పార్టీకి కాని వర్గాల శ్రేయస్సుకి కాని అతీతంగా తమ విధేయతను ప్రమాణపూర్తిగా అందజేయడంలో రాజ్యాంగంయొక్క ప్రత్యేకస్థాయి గుర్తింపబడుతుంది. రాజ్యాంగాన్ని మార్చడానికి ప్రజాభిప్రాయ సేకరణ వంటి ప్రత్యేక చర్యలు అవసరమవుతాయి. కాని ఆచరణలో ఈ లిఖిత రాజ్యాంగాన్ని అమలుచేయడానికి స్వతంత్ర న్యాయశాఖకి అధికారం ఉండి ప్రజలు దానిని కాపాడటానికి నిరంతర జాగరూకత కలిగి ఉన్నంత మేరకే భద్రంగా ఉండగలదు.

## 8. ఉదారీకరింపబడిన ప్రజాస్వామ్యం ఒక్కటే సాధ్యమైన ప్రజాస్వామ్య రూపమా?

ఉదార వారసత్వం లేకుండానే, సాధారణంగా ఏక రాజకీయ పక్షపాలనలో రాజ్యస్థాయిలో ప్రజాస్వామ్యాన్ని నిర్మించడానికి పలు ప్రయత్నాలు జరగడం 20వ శతాబ్దం చూసింది. అతి విస్తృతమైనది కమ్యూనిస్టు వ్యవస్థలు. ఏకపక్షవాదానికి మూలం విప్లవం యొక్క లాభాలను వెనక్కి తిప్పకుండా నివారణ, ప్రయివేటు ధనం, వర్గ ప్రయోజనాలు, రాజకీయ ప్రవృత్తిపై ప్రభావాన్ని తొలగించడం. ప్రజాభిప్రాయాన్ని క్రింద నుంచి చేరవేసేదిగాను, పై నుంచి ప్రజలను ప్రభుత్వ విధానాలకి మద్దతు ఇచ్చేటట్టుచూసే పరికరంగాను అధికారపార్టీ ఉద్దేశింపబడినది.

### జవాబుదారీ బాధ్యత నష్టమవడం

అలా చెప్పడం ఇప్పుడు నాగరిక లక్షణం కాకపోయినా దీనంతటివెనక ఒక ప్రజాస్వామిక

గతిశక్తి వుంది. వాక్ స్వాతంత్ర్యం, సంఘంగా ఏర్పడడానికి హక్కు లేకపోవడమంటే పార్టీ క్రమానుగత శ్రేణి ఆమోదించే ఉద్దేశ్యాలే వ్యక్తపరచాలి అన్న నియమం ఆ శ్రేణి ఆమోదించే వ్యవస్థలు మాత్రమే స్థాపించాలన్న నియమం, ఈ కారణంచేత ప్రభుత్వ విధానం, ప్రజాధికారుల జవాబుదారీ తీవ్రంగా పరిమితమవుతుంది. గణనీయమైన ఆర్థిక విజయాల్నుప్పటికి కమ్యూనిస్టు విధానాలు నిరంకుశత్వం, విస్తృతమైన అణచివేత, న్యాయరాహిత్యం అనే లక్షణాలతో కూడుకున్నవి. కమ్యూనిస్టు విధానాలు చాలావరకు పోలీసురాజ్య పరికరాల ప్రయోగంద్వారానే కొనసాగగలిగాయి

## ఏకపక్ష పరిపాలన

ఆఫ్రికాలో ఏకపక్ష ప్రజాస్వామ్యాలను నిర్మించే ప్రయత్నాలకు అంత తీవ్రంగా కాకపోయినా అలాంటి గతే పట్టింది. ఇక్కడ కూడా ఉద్దేశాలు పొగడదగినవే. ముఖ్యంగా అనేక జాతులుగా విభజింపబడిన సమాజంలో బహుపక్షపోటీ యొక్క విభజన తత్వాన్ని ఏకపక్ష పద్ధతి నివారిస్తుందనీ వాదం. దీనికి విధేయత కలిగిన ప్రతిపక్షం అనే ఆలోచన స్పష్టంగా భిన్నమైనది. అంతేకాక పోటీ పార్టీకి అతీతంగా, దాని అంగీకృత ప్రణాళికకు అతీతంగా కాకపోయినా ఓటర్లకు ఎన్నికల సమయంలో అభ్యర్థులను ఎన్నుకొనే అవకాశం, ప్రజాదరణలేని మంత్రులను తొలగించే అవకాశం ఉంటాయి. అంతేకాక ప్రజలు పాలకపక్షాలతో నిమిత్తం లేకుండా స్వతంత్రంగా సంఘటితమవడానికి ఎన్నికలలో ఎదిరించడానికి ప్రజలలో సామర్థ్యం ఉండకపోవడం వల్ల ప్రభుత్వం నియంతై, నిరంకుశమై, స్పందనారహితం అవుతుంది. కార్యసాధకమైన అధికారుల విభజన లేకపోవడంవల్ల సమనయన్యాయం, పౌరహక్కుల రక్షణ, పార్లమెంట్ద్వారా ప్రజలకు ప్రభుత్వం జవాబుదారీ కావడం ఈ హామీలేవీ ఉండవు.

## ఉదారతావాదం, ప్రజాస్వామ్యం

ఈ చరిత్రవల్ల ఉదారతలేని ప్రజాస్వామ్యాన్ని నిర్మించడమంటె అపజయం పాలవడమేనని నిర్ధారణకి రావచ్చును. సంఘంగా ఏర్పడే హక్కు బహిరంగ నియోజకపోటీ విధానాలలో ఏ నష్టాలున్నా ప్రభుత్వాలపై కొనసాగే నియంత్రణ ఉండటానికి అవి తప్పనిసరి అని ఋజువైనది. సమనయ న్యాయం, అధికార విభజన ప్రభుత్వంపై నియంత్రణ కార్యసాధకమవడానికి అనేక ప్రవృత్తిపరమైన హామీలు ఉన్నాయి. వీటివలన ప్రభుత్వంపై కొన్ని పద్ధతికి సంబంధించిన అవసరమైన కట్టడులు ఉంటాయి. ప్రయోగాలు చేయడానికీ స్థానిక పరిస్థితులకు అనుకూలంగా మార్పులు

చేసుకోవడానికీ ఈ ఉదార ప్రజాస్వామ్యం చట్రంలోనే చాలా అవకాశం ఉంది. కాని కొద్దిపాటిగా పనిచేసేవి లేదా సాంప్రదాయిక సమాజాలలోనివైన ప్రజాస్వామ్య రూపాలను ప్రమాదం లేకుండా రాజ్యస్థాయికి తీసుకుపోవచ్చునని భావించడం పొరపాటు. ఆధునిక రాజ్యం ఒక విపరీతమైన శక్తిగల నిర్మితి. ఆధునికయుగం తొలిదశలో నిరంకుశ రాజ్యాలను కొంత అంశలో ప్రజా నియంత్రణకు, జవాబుదారీకి లోబరచడానికి పశ్చిమ రాజ్యాల ఉదారులు రాజ్యాంగవాదుల యొక్క చారిత్రక పోరాటాలు సమకాలీన ప్రజాస్వామికులకు ఒక ముఖ్యమైన పాఠంగా నిలుస్తాయి.

## 9. స్వేచ్ఛా విపణి ఆర్థిక వ్యవస్థ ప్రజాస్వామ్యానికి అవసరమా?

నిస్సందేహంగా ఇది స్పష్టమైన సమాధానంలేని జటిలమైన ప్రశ్న. స్వేచ్ఛా వినిమయ విధానంపై ఆధారపడిన ఉత్పత్తి పంపిణీ వ్యవస్థ ప్రజాస్వామ్యానికి దోహదకారిగా పరిగణించవచ్చును. ప్రజాస్వామ్యంలానే విపణికూడా వ్యక్తులను అపితృస్వామికంగాను, వారి ఎంపికలకు వారే బాధ్యులుగాను, వారి శ్రేయస్సుని చూసుకోవలసిన వారిగాను చూస్తుంది. ప్రజాస్వామ్యం ఓటరుని చూపే విధంగా విపణి వినియోగదారుణ్ణి సార్వభౌమికుడిగా పరిగణిస్తుంది. రాజకీయపక్షాలు నియోజకాల నుంచి వచ్చే మద్దతు అంశపై ఆధారపడినట్టు వ్యాపార వ్యవస్థయొక్క విజయం ఖాతాదారుల మద్దతుపై ఆధారపడి ఉంటుంది. అంతేకాక విపణి ఆర్థిక నిర్ణయాలను వికేంద్రీకరణ చేయడం వల్లనూ, అవకాశమూ, సమాచారమూ, వనరులూ పౌరసమాజంలో పంచడంద్వారానూ ప్రభుత్వ అధికారులకి అవధులు ఏర్పరుస్తుంది. ప్రజలు వారి ఆర్థిక గతికిగాని స్వతంత్రంగా రాజకీయ సాంస్కృతిక కార్యక్రమాలలో మదుపు పెట్టడానికికాని ప్రభుత్వానికి ఋణపడడాన్ని నిరోధిస్తుంది. ఇలా అనేక విధానాలుగా విపణి ప్రజాస్వామ్యాలకి మద్దతునిస్తుంది.

### విపణిలో అననుకూలాలు

కాని మరొకవంక విపణిని దాని మానాన్ని దాన్ని వదిలేస్తే అది విపరీతమైన ఆర్థిక ఇబ్బందిని కలిగించే ఉత్పత్తిలో హెచ్చు తగ్గులని కలిగిస్తుంది. దేశం ఆర్థిక విధానంలో స్వేచ్ఛాయుత నిర్ణయాన్ని పోగొట్టి అంతర్జాతీయ వెలలోని మార్పులచేత నష్టపోయే స్థితిని తెస్తుంది. గృహరంగంలో వివిధ కార్యకర్తలు ఆర్థిక వ్యవస్థలో తెచ్చే సమర్థత వనరులలోని అంతరాలను గాఢం చేస్తుంది. దానివలన ప్రజాస్వామ్యానికి కావలసిన రాజకీయ సమానత్వానికి హాని కలుగుతుంది. శ్రామికుల శ్రమశక్తిని- అక్కరలేదంటే




బహు రాజకీయ పక్ష పద్ధతి.

మానుకోగల డిమాండు - సప్లయిల న్యాయాలకు లోబడే - ఒక సరుకుగా, వ్యక్తికి పౌరసత్వం ఇచ్చే హక్కుల విలువతో పొసగనట్టిదిగా పరిగణిస్తుంది. పాశ్చాత్య యూరప్‌లోని తొలి పారిశ్రామిక రాజ్యాలు స్వేచ్ఛావిపణి - ప్రజాస్వామ్య ఓటు హక్కు పరస్పరం పొసిగేవి కావనుకొనడంలో పెద్ద ఆశ్చర్యం లేదు. పంథొమ్మిదవ శతాబ్దం వరకు దీనిని వారు ప్రతిఘటిస్తూనే ఉన్నారు. ఆ తరువాత కూడ స్వేచ్ఛా విధానాల వలన ప్రజాబాహుళ్యంలో ఏర్పడే అసంతృప్తిని అదుపుచేయడానికి నియంతృత్వ ప్రభుత్వాలు కావలసి వచ్చాయి. సత్తాగలిగిన విపణి నియంత్రణ, జోక్యం, ఆర్థికమైన పునఃపంపిణీ విపణిలో ఏర్పడే కష్టాల నుంచి రక్షించే అనేక సంక్షేమం వ్యవస్థల ఏర్పాటువల్ల రెండవ ప్రపంచయుద్ధకాలం నుంచి పాశ్చాత్య ప్రభుత్వాలు ప్రజాస్వామ్యాన్ని, విపణిని సమాధానపరచడానికి ప్రయత్నించాయి.

## సందేహాత్మకమైన సంబంధం

స్వేచ్ఛా విధానంయొక్క సరళతలచే ఆకర్షింపబడిన వారందరూ ప్రజాస్వామ్యం విపణులమధ్య ఉండే సంబంధంలోని సందేహాత్మక అంశాలను గమనించడం మంచిది. అదే విధంగా సమాజవాద దేశాలలోని కేంద్రీకృతంగా ప్రణాళికరచన చేయబడిన ఆర్థిక వ్యవస్థలు, విధానాలు అమలు చేయడానికినియంత్రణ చేయడానికి వీలులేని అధికారిక పరికరాలు అవసరమని తెలుసుకొన్నాయి. సమాజంలోని శక్తిని, ఉత్సాహాన్ని ఇగిర్చి ప్రజాస్వామ్యంతో పొసగని చాలా పెద్దవైన రాజకీయ అసమానతలకు ప్రత్యేక హక్కులకు దారి తీశాయి. విపణి విధానంలో కేంద్రీకృతమైన సమాజమే స్వంతదారునిగా ఉండే వ్యాపారాలు ఆర్థికంగా పనిచేసేవిగాను, బహుళపక్ష ప్రజాస్వామ్యంతో పొసిగేటట్టుగాను ఉండగలవా అన్నది పరిష్కరించబడకుండా ప్రశ్నగా మిగిలిపోయిన విషయం. ఆచరణలో సాధ్యంగా కనబడిన సామాజిక ప్రజాస్వామ్యాలు 1945సం॥ తరువాత పశ్చిమ, ఉత్తర యూరప్‌లలో వచ్చిన సామాజిక ప్రజాస్వామ్యాలే. అది పెట్టుబడిదారీ విధానంలోని ఒక మార్పుతో కూడిన విధానమే కాని పెట్టుబడిదారీ విధానాన్ని తొలగించేదికాదు.

## 10. అధిక సంఖ్యాకుల నిర్ణయం ఎల్లప్పుడూ ప్రజాస్వామిక నిర్ణయమేనా?

ప్రజాస్వామ్యం అధిక సంఖ్యాకపాలన ఒకటే ననుకోవడం తరచుగా జరిగే పొరపాటు.

ప్రజాస్వామ్యం అనే పదానికి ప్రజలచే పాలన అని అర్థంచెబితే ప్రజలలో ఒక భాగం మరొక భాగంపై చేసేది కాకుండా ప్రజలందరిచే చేయబడే పాలన అని అర్థం. మరోలా చెప్పాలంటే నిర్ణయంచేసే అధికారాన్ని అందరూ సమానంగా పంచుకోవడం ప్రజాస్వామిక లక్షణంలో కీలకమైన అంశం. అధిక సంఖ్యాకుల నిర్ణయం చర్చ మార్పులు, రాజీ, ఇతర పద్ధతులన్నీ దాటిన తరువాత అనంగీకారాన్ని పరిష్కరించే విధానం మాత్రమే. అధిక సంఖ్యాక నిర్ణయం అల్పసంఖ్యాకుల ఇచ్ఛను నిర్ణయించడం లేదా అర్థగించటం కంటె ఎక్కువ ప్రజాస్వామికం కావాలి. కాని అది అల్పసంఖ్యాకులను పరిణామం మీద ఏ ప్రభావమూ లేనంతగా నిర్వీర్యం చేస్తే ప్రజాస్వామ్య పరిపూర్ణతకి శిఖరంగా కాక నిర్ణయాలు తీసుకోడానికి నాగరికంకాని వెంటనే వాడటానికి పనికి వచ్చే పరికరంగా భావించాలి.

## పరస్పరతా నియమం

అధికసంఖ్యాక పాలనకు రక్షణనిచ్చే వారు ఒక సందర్భంలో అల్ప సంఖ్యాకులే. మరో సందర్భంలో అధిక సంఖ్యాకులు కాగలరని చెపుతారు. ఒక నిర్ణయంలోగాని, ఒక ఎన్నికలోగాని అల్ప సంఖ్యాకుల ప్రభావం లేకపోయినా తరువాతి విజయం ద్వారా నష్టం భర్తీ కాగలదని అంటారు. మరోలా చెప్పాలంటే అధిక సంఖ్యాక అభిప్రాయానికి, అల్ప సంఖ్యాకుల అగీకారం పరస్పరతా నియమంపై ఆధారపడి వుంటుంది అధిక సంఖ్యాకులలో ఉండే వంతు అల్పసంఖ్యాకులకే వస్తుంది. వారు చేసినవి ఇతరులు అలాగే గౌరవించాల్సి ఉంటుంది. అధిక సంఖ్యాకుల నిర్ణయం అల్ప సంఖ్యాకులు వారి అభిప్రాయాలను ప్రచారం చేసుకొనే సామర్థ్యాన్ని భంగపరిచినా అల్పసంఖ్యాకుల స్థితి శాశ్వతమైనదైనా, తీసుకొనబడే నిర్ణయాలు అల్పసంఖ్యాకులకి గెలిచిన తరువాతైనా భరింతచలేనంత నష్టకరమైనంత ముఖ్యమైనదైనా, పరస్పరతా నియమం కూలిపోతుంది. ఇందలి విషయాలని ఒక్కొక్క దానిని ప్రత్యేకంగా పరీక్షించడం అవసరం.

## అధిక సంఖ్యాక హక్కులు - వ్యక్తి హక్కులు

అధిక సంఖ్యాక నిర్ణయం (ప్రభుత్వం అధిక సంఖ్యకు మద్దతుతో వ్యవహరిస్తున్నప్పుడు) వ్యక్తియొక్కగాని, బృందంయొక్కగాని ప్రజాస్వామిక హక్కులను భంగపరిస్తే నిర్వచన సిద్ధంగా అది అప్రజాస్వామికం. ప్రజలకు రాజకీయ జీవితానికి తమవంతు ఇవ్వగలగడానికి అవసరమైనవే మౌలిక హక్కులు. ఇవి: వాక్స్వాతంత్ర్యం, పర్యటన, సంఘంగా ఏర్పడడానికి హక్కులు, ఓటు చేసే హక్కు, ప్రజాపదవికి పోటీ చేసే హక్కు.

ప్రజలందరికీ ఈ హక్కులకి హామీని ఇవ్వడం ప్రజాస్వామ్యవ్యవస్థకి పునాది. ఆదర్శ వంతంగా వీటన్నింటికీ రాజ్యాంగంలో అధిక సంఖ్యాకులు వీటిని భంగపరచడానికి వీలులేకుండా వుండే రక్షణ ఇవ్వబడాలి. ఈ హక్కులు నిలుపుదల చేయడానికి కాని తీసివేయబడడానికిగాని సమర్థనీయమైన పరిస్థితులు ఏవన్నది కఠినమైన ప్రశ్న ! (ఈ ప్రశ్నలు 59-61లో తరువాత చర్చించబడ్డాయి).

## శాశ్వత అల్పసంఖ్యాకులు

పరస్పరతా నియమం కూలిపోయే రెండవ పరిస్థితి : అల్పసంఖ్యాకుల జాతి, మతం, భాష, తెగ లేక అలాంటి ఇతర శాశ్వత లక్షణంతో నిర్వచించబడినపుడు. పార్టీ పోటీ ఈ సమాజాలతో దానికి విరుద్ధంగా కాకుండా ఒకటైనప్పుడు అలాంటి అల్పసంఖ్యాకులు ప్రభుత్వ పదవుల నుంచి, రాజకీయ ప్రభావం చూపే అవకాశాల నుంచి శాశ్వతంగా దూరంగా ఉంచబడవచ్చును. అట్టి స్థితిని అదుపుచేసే రాజ్యాగ పరికరాలు అనేకం అందుబాటులో వున్నాయి. అధికారాన్ని పంచుకోవడం, వారి సంఖ్య ప్రకారం ప్రభుత్వంలో పదవులలో స్థానాలు పొందడం వారి ప్రయోజనాలకు భంగకరమైన చట్టాలను (వీటో) త్రోసిపుచ్చగలగడం, వారి వ్యవహారాలను నిర్వహించుకోడానికి సత్తాగలిగిన స్వయం ప్రతిపత్తి మొదలైనవి ఈ పరికరాలు, ఎప్పుడు ఉచితమైనది అన్నది ఆయా పరిస్థితులపై ఆధారపడి వుంటుంది. ఏ పరికరమైనా వారివారి సంస్కృతిని అవలంబించే హక్కు ప్రజలకివ్వాలని, దానికి రాజ్యాంగపరమైన రక్షణ అవసరమని ఇప్పుడు గుర్తింపబడింది. (ప్రశ్న 63 చూడండి).

## గాఢ అల్పసంఖ్యాకత

చివరిది గాఢ అసంఖ్యాకులు. ఇతర విషయాలలో అల్పసంఖ్యాకులు అధిక సంఖ్యాకులలో భాగమైన అతి ప్రాముఖ్యమైన ప్రత్యేక విషయంలో అల్పసంఖ్యాకులు వారి నిర్వీర్యతకు పరిహారాన్ని పొందే అవకాశాన్ని లేదని భావించవచ్చును. అట్టి పరిస్థితులకోసం చట్టాలు చేయలేము. కాని బుద్ధివంతమైన అధిక సంఖ్యాకులు సాధ్యమైనంత వరకు వారి స్థానం నుంచి వారిని తోసిపుచ్చడానికి గాని, కాదనడానికి గాని తమ అధికారాన్ని ఉపయోగించకుండా వారితో చేరడానికి కొంతవరకు ముందుకు వస్తారు. ప్రజలంతా కలసికట్టుగా జీవించడానికి అంగీకారం ప్రజాస్వామ్యం కొనసాగడానికి అతిముఖ్యం. దీనికి అధిక సంఖ్యాకులు వారి ప్రాతినిధ్యంతో కూడిన ప్రభుత్వము

తన అభిప్రాయాల సాధనకి మాత్రమే ప్రయోగించకుండా సంయమనం పాటించడానికి సిద్ధపడాలి.

## 11. ప్రజాస్వామ్యంలో వ్యక్తి చట్టబద్ధంగా చట్టాన్ని ఉల్లంఘించగలడా?

శాసనోల్లంఘన-ఒక ముఖ్యమైన లేదా జీవకారకమైన ప్రయోజనం కొరకు బహిరంగంగా అహింసాత్మకంగా చట్టాన్ని ఉల్లంఘించడం. దీనికి ప్రజాస్వామ్య చరిత్రలో ఒక గౌరవప్రదమైన స్థానం వుంది. నేరపూరితమైన ఉల్లంఘనకి దీనికి ఉన్న భేదాన్ని మనం గమనించాలి. శాసనోల్లంఘనకి ఒక రాజకీయ లక్ష్యం వుంది. ఉల్లంఘన చేసినవారు వారిపై తీసుకోబడగలిగే చర్యలనుండి తప్పించుకోవాలనుకోరు. ఇతర పద్ధతులైన ప్రచారం, ఒప్పించడానికి ప్రయత్నాలూ విఫలమై, ఒక అన్యాయాన్ని లేక అమానుష కృత్యాన్ని అధికారుల ఇతర సంస్థల దృష్టికి తీసుకురావడం, తద్వారా ఒక సమస్యపై పునరాలోచనకోసం ఒత్తిడి తేవడం శాసనోల్లంఘనానికి లక్ష్యం. ఇంకా తరచుగా ప్రజాబాహుళ్యపు అభ్యంతరాన్ని సంఘటితం చేసి తప్పుడు విధానాలను అమలు చేయకుండా చేయడం కూడా దానికి లక్ష్యమే. ప్రజాస్వామ్యం చట్టానికి అంగీకారంపై ఆధారపడి వుండడంవల్ల శాసనోల్లంఘనం పరస్పరతా నియమాన్ని కూలదోస్తుంది గనక దానిని ప్రత్యేకమైన పరిస్థితులలో కేవలం చివరి ప్రయత్నంగానే అవలంబించాలి.

### చట్ట సమగ్రత

శాసనోల్లంఘనను విమర్శించే వారు అది ఎప్పుడూ సమర్థనీయమైనదికాదని వాదిస్తారు. నాగరిక సమాజం యొక్క పునాది చట్టం. దానిని ఒక వ్యక్తి లేదా బృందం అలక్ష్యం చేస్తే ఇతరులు అలా చేసేటట్టు ప్రోత్సహించబడవచ్చు. ఎవరికి నచ్చిన చట్టాలకు వారు విధేయులైతే మనమంతా ఆధారం చేసుకొనే చట్టమనే చట్రం తొందరగా తునకలైపోతుంది. అంతేకాక ప్రజాస్వామ్యసమాజాలలో ప్రజలకు చట్టాలలో మార్పులు తీసుకురావడానికి రాజ్యాంగబద్ధమైన ఎన్నో మార్గాలున్నాయి : ఎన్నికలలో ఓటు చేయడం, ప్రతినిధులతో లోపాయికారి చర్చలు, ఒప్పింపులు, ప్రజలని ప్రభుత్వాన్ని కూడగట్టుకొని చట్టంలో మార్పుకి న్యాయబద్ధమైన ప్రచారం చేయడం ఇవి కొన్ని మార్గాలు. ఎన్నికలలో పాల్గొనడమనే చర్యలోనే గెలిచిన పక్షాల విధానాలకు లోబడి వుంచామన్న అంగీకారం ఇమిడివుంది. శాసనోల్లంఘనం ఈ విధంగా ప్రజాస్వామ్యానికి, సమనయి న్యాయానికి కూడా విరుద్ధమైన చర్యే.

### చట్టము-న్యాయము

శాసనోల్లంఘన హక్కు తరపున వాదించేవారు ఎన్నికల ఫలితానికి కట్టుబడటానికి అంగీకరించినంత మాత్రాన్న ఒక వ్యక్తి ప్రతిచట్టానికి విధేయుడై ఎంత అన్యాయంతోనైనా సహకరించాలన్న నియమానికి కట్టి వుంచలేదని చెవుతారు. ఒక్కొక్కసారి రాజ్యాంగబద్ధమైన ప్రచారం, అభ్యంతరాలు తెలిపేమార్గాలు పనిచేయడానికి చాలాకాలం అవసరమై వచ్చే నష్టం వారించబడనిదికావచ్చు. ఆచరణలో సామాన్య ప్రజల గొంతు స్వంత ప్రయోజనదారుల, ప్రభుత్వ ప్రచార సాధనాల శబ్దంలో మునిగి వినబడకపోవచ్చును. ఈ సందర్భాలలో శాసనోల్లంఘన ఉపయోగిస్తుంది. అణగదొక్కే చట్టాలను నియమబద్ధమైన ఉల్లంఘన చర్య లేకుండా ఒప్పుకోవడంవలనే ఎక్కువనష్టం వాటిల్లడాన్ని చరిత్రే సూచించింది.

### వ్యక్తి అంతరాత్మ

సాధారణ విచారణ వలన చర్చ వలన అభిప్రాయభేదాలు కొన్ని సులువుగా పరిష్కరింపబడలేవు. ప్రతి ఒక సందర్భంలో పరిస్థితులమీద చాలా భాగం ఆధారపడి వుంటుంది. అందున్న పరస్పర విరుద్ధమైన నియమాల సమతౌల్యంమీద వాటి వాటి పరిణామాల పరిగణనమీద ఆధారపడి వుంటాయి. చివరకు కొన్ని అంశాలను తనంతతానుగా వ్యక్తి మాత్రమే పరిష్కరించుకోగలడు. వ్యక్తి అంతరాత్మ ప్రాముఖ్యాన్ని అధికారికంగా గుర్తించబడిన ఒక ఉదంతం సైనికసేవలో చేరడానికి మనఃపూర్వక అభ్యంతరం మాత్రమే. ఇతర విపర్యసేవలకు అవకాశం కల్పించడంతో అభ్యంతరం యొక్క నైతికశక్తిని ఆమోదించినట్టయినది.

## 12. జాతీయతావాదానికి ప్రజాస్వామ్యానికి ఏమైనా సంబంధం వుందా?

సమకాలీన ప్రపంచంలో జాతీయతావాదం ప్రజాస్వామ్యం ముఖ్యంగా పోటీపడే భావసిద్ధాంతాలుగా తరచు ప్రతిపాదించబడుతోంది. ఈ ప్రతిపాదన గమనించబడినది. రాజకీయ అధికారం అంతా ప్రజలనుంచే ఆవిర్భవిస్తుందన్న ఫ్రెంచి విప్లవం యొక్క సిద్ధాంతం నుంచే పుట్టుకను ఈ రెండు భావ సిద్ధాంతాలు చారిత్రకంగా పంచుకుంటాయి. జాతీయతావాదంలోని స్వీయనిర్ణయంలో విశ్వాసానికి ప్రతీ ప్రజా వారి వ్యవహారాలలో స్వయం నిర్ణయం చేసుకోవాలనే ప్రజాస్వామిక సిద్ధాంతానికి దగ్గర సంబంధం వుంది. ప్రజలే పరిపాలించాలని ఒప్పుకుంటే ప్రజలంటే ఎవరని ఒత్తిడి చేసే రాజకీయ ప్రశ్న

ఎదురవుతుంది.

### జాతీయతావాదం - మినహాయింపు చేసే లక్షణం

దీనితో విషయం ముగియలేదు. ప్రజాస్వామ్యం (వారిలో అభిప్రాయ భేదాలున్నా) సామాన్య ప్రజల స్వీయనిర్ణయ సమర్థతను వక్కాణించే సార్వజనీనమైన సిద్ధాంతంకాగా ప్రజలలో తేడాలను ప్రత్యేక సంస్కృతిని, సంప్రదాయాన్ని, జీవన విధానాన్ని వక్కాణించేది ప్రత్యేకతావాదం. జాతీయతావాదం మినహాయింపు వంక ప్రజాస్వామ్యం కలుపుకోవడం వంక మొగ్గుతాయి. ఈ మినహాయింపు - ప్రజలలో ఒక ప్రాంతంలో స్థిరపడిన కొంతమంది భాష, మతము, జాతి, మూలము పంచుకోకపోవడం వల్ల వారికి పౌరహక్కులను నిరాకరించడం గాఢమైన అప్రజాస్వామికత. రాజ్యంలో ఉన్న ప్రజలందరూ సజాతీయులు అయితే సమస్య వుండదు. కాని ఆచరణలో శతాబ్దాల వలసలు యుద్ధ విజయాలు ప్రపంచ ప్రజలని సమ్మిశ్రమం చేసి రాజ్యం, ప్రభుత్వం అనే భావం లేకుండా ఒకే జాతి, ఒకేచోట నివాసం లేకుండా చేశాయి.

### జాతీయతావాదం - ప్రజాస్వామిక హక్కులు

స్వీయనిర్ణయాలకు జాతీయస్థాయిలో కోరిక ప్రజాస్వామిక నియమంలో పాసిగేదిగా చూడబడినా ఒకచోట నివసించే అల్పసంఖ్యాకులకు స్వయం ప్రతిపత్తిని నిరాకరించడం అప్రజాస్వామికంగా నిర్ణయించబడాలి. అంతేకాక ఈ నిరాకరణ వలన రాజ్యాంలోను రాజ్యాలమధ్యను రాగలిగే శాంతికి భంగకరమైన అవకాశాల దృష్ట్యా వాటిని ఆ దేశం పరిష్కరించుకోగలిగిన అంతరంగిక విషయంగా పరిగణించలేము.

## 13. ఏ దేశమైనా ప్రజాస్వామిక ప్రభుత్వాన్ని సాధించగలదా?

19వ శతాబ్దపు ఉదారవాది జె.ఎస్.మిల్ ప్రజాస్వామ్య ప్రభుత్వానికి దేశం అభివృద్ధి పొందిన స్థాయిగల నాగరికత కలిగినదై వుండాలని వాదించాడు. పశ్చిమేతర దేశాలు స్వీయ ప్రభుత్వానికి అసమర్థులని వారిని పరిపాలించడానికి దయాళులైన నిరంకుశత్వం, అవకాశం వుంటే పాశ్చాత్య పరిపాలనో కావాలని నమ్మాడు. ఇది ఒక జాతివాద తీర్పు. విద్యావంతులైన ప్రజ ప్రజాస్వామ్యానికి ఒక అనుకూల కారణమైనప్పటికి అది పరిపాలకులకి పాలితులకి మధ్య అగాధాన్ని తగ్గిస్తుంది కాబట్టి నియతవిద్య లేకపోవడం, ప్రజల అవగాహనా సామార్థ్యమూ చర్చాసామర్థ్యమూ వారి వ్యవహారాలపై బాధ్యత వహించే సామర్థ్యమూ వుండవనడానికి ఋజువుకాదు. నిరంకుశ చరిత్ర-అది

సామ్రాజ్యవాదపుదైనా, అంతరంగికమైనదైనా దయాళువులైనది మాత్రం కానిది.

### ప్రజాపోరాటం

విస్తృతంగా ప్రజని సన్నద్ధం చేయడం, పోరాటం, లేకుండా ప్రజాస్వామ్యం అరుదుగా స్థాపించబడినట్టు చరిత్ర చెపుతోంది. ఒక్కొక్కసారి ఈ పోరాటం దీర్ఘమైనది ఎంతో వెలతో కూడుకున్నది. సామాన్య ప్రజలు వారివారి ఆశయసిద్ధకి ప్రజాస్వామ్య ప్రభుత్వ అవసరాన్ని గుర్తించి దానిని కోరడానికి, సాధించుకోవడానికి సంఘటన అవసరం. మరోలా చెప్పాలంటే ప్రజాస్వామ్యం ఎక్కడో పైనుంచి ఇవ్వబడేదికాదు. సాంప్రదాయక పరిపాలకులు, సైనిక కమ్యూనిస్టు నియంతలు, జీవితకాలం వుండే అధ్యక్షులు, విదేశీ ఆక్రమణదారులు ఎవరూ అధికారాన్ని ఇచ్ఛాపూర్వకంగా వదలివేయరు. వారివారి పాలనలలో విస్తృతంగా నమ్మకం పోయినపుడు వారు అధికారంలో కొనసాగడం అస్థవ్యస్థ స్థితికి దారితీసి ప్రభుత్వం అసాధ్యం అయినప్పుడు మాత్రమే వారు అధికారాన్ని వదులుకుంటారు.

### అంతర్జాతీయ అసరా

ప్రజాస్వామిక శక్తులు రాజ్యాంగసిద్ధిని పొందడానికి విదేశాల ఆసరా బాగా పనిచేస్తుంది. కాని ప్రచ్ఛన్నయుద్ధ సమయంలో పాశ్చాత్య దేశాలు ప్రజాస్వామ్యాన్ని ప్రోత్సహించడం కంటె కమ్యూనిజాన్ని నియమితం చేయడంలో ఎక్కువ ఆసక్తి చూపారు. దీనికోసం వారు అధికారంలో వున్న చాలా అప్రజాస్వామిక పాలనలకు కూడా సహాయాన్నిచ్చారు. ప్రచ్ఛన్నయుద్ధం తరువాత అంతర్జాతీయ కార్యశీలత యొక్క సమతౌల్యం ప్రజాస్వామిక ఉద్యమాలకు ప్రభుత్వాలకు మద్దతునీయడం వంక స్పష్టంగా మారింది. ఇలాంటి మద్దతు ముఖ్యమే అయినా నియంతృత్వపాలనకు ప్రతిగా ప్రజలయొక్క పోరాటానికి ఇది సరియైన ప్రత్యామ్నాయం కాదు. ఒక దేశపు స్వీయపరిపాలన పై దేశం నుండి విధింపబడడంలో వైవిధ్యం స్వప్రఖ్యానం వుంది. ఏమైనా అట్టిపాలన చాలా రోజులు కొనసాగడం అసంభవం.

## 14. ఒకసారి స్థాపింపబడిన తరువాత ప్రజాస్వామ్యాన్ని పోషించి కొనసాగించడం ఎలా?

దీనికి సరళమైన పాకశాస్త్ర విధానమేమీలేదు. పాశ్చాత్య ప్రజాస్వామ్యాలు సుస్థిరతని దీర్ఘకాలంలో మాత్రమే సాధించగలిగాయి. సైనిక నిరంకుశత్వము, ఫాసిజం, కులీన

రాజ్యపు ప్రతిక్రియల వలన అనేక ఓటములను అనుభవించిన తరువాత మాత్రమే ఇది సాధ్యమైనది. సామాజిక విభాగాలు స్వేచ్ఛాయుత రాజకీయ వ్యవస్థలో ఉంచడానికి వీలులేనంత లోతుగా వుండి ఈ మధ్య ఏర్పడిన ప్రజాస్వామ్యాలలో ప్రజాస్వామ్యం కొనసాగడానికి పరిస్థితులు అనుకూలించకపోవచ్చు. లేదా ఆర్థిక వ్యవస్థ ప్రజల యొక్క న్యాయబద్ధమైన ఆశలు నెరవేర్చడానికి అవకాశం లేనంతగా నిర్ధనమైపోవచ్చును. లేదా సైన్యం శక్తివంతమై రాజకీయాలకు అతీతమైన పాత్రకి ఒప్పుకోకపోవచ్చును.

## ప్రజాస్వామిక సంఘటన

అయినా అననుకూల పరిస్థితుల ఎదుట ప్రజలు అశక్తులని భావించడం పొరపాటు. అనేక వత్తిడులకు లొంగవలసి పరిస్థితులను కూడ తట్టుకొనే ప్రజాస్వామిక సంస్థలను సంఘటితం చేయడానికి తగిన చర్యలు తీసుకోవచ్చును. ఇవి చాలావరకు కీలకస్థాయిలోని వృత్తులను నిర్వహించేవారి యొక్క నాణ్యత శిక్షణలమీద ఆధారపడి ఉంటుంది. న్యాయశాఖలోని అధికారులు, రాజ్యంగ విషయాల న్యాయవాదులు, పార్లమెంట్‌లోని గుమస్తాలు, ఎన్నికల అధికారులు ఇంకా విస్తృతంగా ప్రజా ప్రభుత్వంలోని అధికారులు రాజకీయ పక్షాలను ఏర్పరిచి పెంపుచేయవలసి ఉంటుంది. వారివారి అనుయాయుల శ్రేణులలో శిక్షణకి అవకాశం అందుబాటు ఉండాలి. ప్రచార సాధనాలు, వ్యాపారులు, ట్రేడ్ యూనియన్లు, ప్రభుత్వేతర సంస్థలు రాజ్యంలోగాని దాని నీడనున్న వారితోగాని సంబంధం లేకుండా స్వతంత్రంగా కలుగజేసుకొని పనిచేసే సామర్థ్యం ప్రజలలో పెంపొందేటట్టు చేయాలి. అనుభవజ్ఞులైన రాజకీయ నాయకులు ప్రజాస్వామ్యానికి రాజ్యాంగ బద్ధమైన విధానాలకు వారు కట్టుబడి ఉండే లక్షణం వారి యొక్క సామర్థ్యం, చిత్తశుద్ధి వీటిమీద కూడా ప్రజా సంఘటన చాలావరకు ఆధారపడి ఉంటుంది. వారి అత్యంత సమస్యలను పరిష్కరించే తీరు వారు అధికారంలో కొనసాగడంమీద కూడ ప్రజాసంఘటన ఆధారపడి ఉంటుంది.

## రెండు వంకల పోరాటం

ప్రజాస్వామ్యాన్ని పోషించి కొనసాగించడం ఏక కాలంలో రెండు రంగాలలో యుద్ధం చేయడం వంటిది. ఒక వంక స్వేచ్ఛాయుత వ్యవస్థతోగాని, రాజకీయ ప్రవృత్తిలో సామాన్య ప్రజల ప్రభావంలోగాని రాజీపడలేని ప్రజాస్వామ్య వ్యతిరేక శక్తులతో పోరాటం. మరొకవంక ప్రజాస్వామ్య రాజకీయాలలో స్వయం సిద్ధమైన విభజించే లక్షణాలతో పోరాటం. ప్రజాస్వామ్యంలో ప్రభుత్వ పదవుల కొరకు పోటీ గెలిచినవారే అన్ని

బహుమానాలు పొందే అవకాశంవల్ల వచ్చే పోటీకూడా ఉంటాయి. వీటివల్ల ప్రజలలో విభజన ఉంటుంది. మొదటి పోరాటం సమాజంలో సంస్థల లేక బృందాల వైశాల్యంపై ఆధారపడి ఉంటుంది. వీటికి ప్రజాస్వామ్యంలో నిలవాలన్న కోరిక పరిరక్షించడానికి సంసిద్ధత ఉంటాయి. రెండవది అధికార వినియోగంలో కొంత సంయమనము రాజకీయ ప్రతిపక్షాలతో సంభాషణలు సాగించడానికి అంగీకారమూ ప్రజల యెడల ఇతరుల హక్కుల యెడల గౌరవమూ ఉండాలి.

## 15. పనిచేసే ప్రజాస్వామ్యంలో ముఖ్య భాగాలేమిటి?

పనిచేసే ప్రజాస్వామ్యానికి నాలుగు ముఖ్యభాగాలు లేక నిర్మాణానికి ఉపయోగించే దిమ్మలు ఉన్నాయి. ఇవి స్వేచ్ఛాయుత స్వచ్ఛమైన ఎన్నికలు, బహిరంగ జవాబుదారి ప్రభుత్వం, పౌర రాజకీయ హక్కులు, ప్రజాస్వామ్య లేక పౌరసమాజం. అవి వచ్చే ప్రశ్నలకు ఒక చట్రాన్ని ఇస్తాయి కాబట్టి ఈ భాగాలను ముందిచ్చిన జవాబులలో స్పృశించడం జరిగింది. ఈ చట్రాన్ని ప్రజాస్వామ్యంలోని ప్రతిభాగమూ మొత్తానికంతటికీ అవసరమయ్యే సూచ్యాకార చిత్రంగా చూడవచ్చును (చిత్రం 1).




చిత్రం 1 : ప్రజాస్వామ్య సూచ్యాకారం

## స్వేచ్ఛాయుత స్వచ్ఛమైన ఎన్నికలు

ప్రజాధికారులను జవాబుదారి చేయడానికి వారు ప్రజా నియంత్రణకు లోబడేవారిగా చేసే ముఖ్య పరికరం పోటీ ఎన్నికలు. అవి పౌరుల మధ్య పదవుల అందుబాటును వారి ఓటు విలువ ఒకేలా ఉంచే రాజకీయ సమానతను నిలుపుతుంది. రాజకీయ సమానతకు కార్యరంగాన్ని ఎన్నికలు ఇస్తాయి. నియోజక విధానం స్వేచ్ఛాయుత స్వచ్ఛమైన ఎన్నికలకు మొదటిసూత్రం. అంటే ఏఏ పదవులు ఎన్నుకోబడేవి, ఎవరు వాటికి పోటీ చేయవచ్చును, ఎన్నికలు ఎపుడు జరగాలి, ఓటు హక్కు ఎవరికి ఉంటుంది, నియోజకవర్గాన్ని ఎలా నిర్ణయించాలి, గెలుపు నిర్ణయించడానికి ఓట్లు ఎలా లెక్కబెట్టాలి-ఇవన్నీ నియోజక విధానానికి సంబంధించిన చట్టాలలో వివరించబడి ఉంటాయి. రెండవది నియోజక ప్రవృత్తి (Electoral Process) అంటే ఆచరణలో వివిధ ఎన్నికలని ఎలా నిర్వహించాలి, ఓటర్లుగా నమోదు మొదలు ప్రచారంద్వారా, ఓట్లు లెక్కింపు కొరకు చట్టం పటిష్టంగా నిష్పాక్షికంగా పాటించబడిందా, ఎక్కడైనా ఫలితాలను సందిగ్ధం చేసే దురాచారాలు ఉన్నవా అని నిర్ధారించడానికి నియోజక ప్రవృత్తి అవసరం.

## బహిరంగ - జవాబుదారి ప్రభుత్వం

ప్రజాస్వామ్యంలో ప్రజలకు ప్రభుత్వం యొక్క జవాబుదారి ఒక వంక న్యాయ సంబద్ధమైనది. ప్రజాధికారులు న్యాయబద్ధంగా పాలన చేసేటట్లు న్యాయస్థానాలకి జవాబుదారీ (సమనయ న్యాయం), మరొకవంక పార్లమెంటుకి, ప్రజలకి ప్రభుత్వం యొక్క విధానాలు, చర్యలు వీటి సమర్థనీయత కొరకు రాజకీయ జవాబుదారీ ఈ రెండవ జవాబుదారీ ప్రభుత్వంమీద ఆధారపడని న్యాయస్థానం స్వతంత్రత మీద ఆధారపడి ఉంటుంది. వారి జవాబుదారీ రాజ్యాన్ని రక్షించగల అధికారాలే నేరాన్ని, శిక్షని నిర్ణయించే అధికారంపైనా, పార్లమెంటు యొక్క చట్ట నిర్మాణం, పన్ను విధింపు ప్రభుత్వాన్ని పరీక్షించే అధికారాలమీద ఆధారపడి ఉంటుంది. జవాబుదారీ కావడమే కాకుండా ప్రజాస్వామ్య ప్రభుత్వం ఔపచారిక సంప్రదింపులు, అభిప్రాయ సేకరణల ద్వారాను అనేక విధాలుగా ప్రజాభిప్రాయానికి బహిరంగతద్వారా స్పందించేదిగా కూడా ఉండాలి.

## పౌర-రాజకీయ హక్కులు

వాక్ స్వాతంత్ర్యము, సంఘంగా ఏర్పడడం, ఉద్యమాలలో చేరడానికి మొదలుగా

హక్కులు ప్రజలు రాజకీయంగా పనిచేయడానికి అవసరమైన స్థితి ఈ స్వేచ్ఛలను ఆవరించి ఉంటాయి. పౌర సమాజాలలో స్వీయ వ్యవస్థీకరణలో ప్రభుత్వంపై ఒత్తిడి తెచ్చే ప్రభావం ఈ హక్కుల వలన సాధ్యమవుతుంది. వ్యక్తులందరికీ ఈ హక్కులన్నీ ఉచితంగా హామీ ఇవ్వబడినవైనా మానవ హక్కులలో భాగంగా సాధారణంగా సమాన ప్రయోజనాల కొరకు ఇతరులలో సంఘటితమవడం ప్రచారం ప్రజాభిప్రాయాన్ని ప్రభావితం చేయడం మొదలైన వాటి విలువ సామూహిక చర్య సందర్భంలో ఉంటుంది. వ్యక్తి హక్కులు సామాన్య ప్రయోజనానికి సామూహిక నిర్ణయంచేసే ప్రవృత్తులకి వాటికి పునాది అయిన ప్రజానియంత్రణకి వ్యతిరేకంగా చూడడం పొరపాటు.

## ప్రజాస్వామ్య సమాజం - 'పౌర'సమాజం

పౌరసమాజ భావన రాజ్యంతో నిమిత్తం లేకుండా ఏర్పాటు చేయబడిన అనేక రకాల సంఘాలు ప్రజాస్వామ్యానికి కావాలని సూచిస్తుంది. ఈ మార్గం ద్వారానే ప్రభుత్వ అధికారాన్ని నియమితం చేయడం, పై నుంచికాక అట్టడుగు నుంచి ప్రజాభిప్రాయాన్ని స్పష్టం చేయడం సాధ్యమవుతాయి. దీని వలనే సమాజం స్వైరపాలనను ప్రతిఘటించడానికి కావలసిన ఆత్మస్థైర్యాన్ని పొందుతుంది. అట్టి సంఘాలు స్వతంత్రమైనవి మాత్రమే కాకుండా అంతరంగికంగా కూడా ప్రజాస్వామికమై ఉండాలనడంలో మిగిలిన సమాజం అస్తవ్యస్తంగా నడపబడితే రాజ్యస్థాయిలోని ప్రజాస్వామ్యం వేళ్ళు ఊననదిగా ఉంటుందన్న ఆలోచన ఉంది. కుటుంబంలో, బడిలో, ఆలయంలో ప్రజలు నిరంకుశత్వానికి ప్రభావితులైతే స్వయంగా వ్యవస్థ చేసుకోవడానికి, పని స్థలాన్ని ఇరుగుపొరుగులని స్వచ్ఛంద సంఘాలని సంఘటితం చేసే అనుభవం లేకపోతే వారు కార్యసాధకులైన పౌరులవడానికి అంతగా అవకాశం ఉండదు. అంతేకాక వారు సమాజ స్థూల స్థితికి అంతగా బాధ్యులు కాలేరు కూడా.

2

# స్వచ్ఛ స్వేచ్ఛాయుత ఎన్నికలు

## 16. ఎన్నికల ప్రాముఖ్యం ఏమిటి?

రాజ్యస్థాయిలో ఎన్నికల ఉద్దేశ్యాలు రెండు. మొదటిది ప్రభుత్వ అధినేతను లేక ప్రధాన కార్యనిర్వహణాధికారిని ఎన్నుకోవడం, ప్రభుత్వం అనుసరించే స్థూల విధానాన్ని నిర్ణయించడం. రెండవది చట్టాలని చేయడానికి, పన్నులను విధించడానికి ప్రజల తరపున ప్రభుత్వంయొక్క పనితీరును పర్యవేక్షించడానికి శాసనసభ, పార్లమెంటు మొదలైన ప్రాతినిధ్య సభలలో సభ్యులను ఎన్నుకోవడం. అధ్యక్షుడు ప్రభుత్వ అధినేత అయిన అధ్యక్ష విధానంలో ఈ రెండు ఉద్దేశ్యాలు చక్కడా వేర్పరచబడి ఉన్నాయి. అధ్యక్షునికి వేరుగా, శాసనసభా సభ్యులకి వేరుగా ఈ విధానంలో ఎన్నికలు ఉంటాయి. అవి ఏకకాలంలో జరగాలని లేదు. ప్రధానమంత్రి లేక పార్లమెంటరీ విధానంలో రెండు ప్రయోజనాలను ఒకే ఎన్నికద్వారా సాధించవచ్చును. ఎన్నికైన పార్లమెంటు సభ్యులు పార్లమెంటులో అధిక సంఖ్యాక పక్షం నాయకుని ఆధారంగా ఎవరు దేశాధిపత్యం వహించాలో నిర్ణయిస్తారు.

### ఎన్నికలు - ప్రజానియంత్రణ

ప్రాతినిధ్య ప్రజాస్వామ్యంలో బహిరంగపోటీ ద్వారా ఈ ప్రజాధికారుల సమనయబద్ధ ఎన్నిక ప్రజానియంత్రణకు అతి ముఖ్య పరికరం. రాజకీయ అధికారం ప్రజలనుంచే వస్తుందని, వారి విశ్వాసంపై ఆధారపడి ఉంటుందని ఎన్నికలు ప్రత్యక్షంగా చూపిస్తాయి. రాజకీయ నాయకులు వారి వారి చర్యలకు ప్రజలకు జవాబుదారులై ఉండాలి. చివరి ప్రయత్నంగా మాత్రమే వారిని పదవి నుంచి తొలగించడమ్మన్నది. వారు వారి మీద ఉంచబడిన విశ్వాసంతో పదవీ నిర్వహణలో ప్రమాణాలను నిలిపి ప్రభుత్వ విధానాలలో

ఉద్యోగులలో మారే పరిస్థితులకు అవసరమయ్యే మార్పులు తీసుకురావడానికి హామీ ఇస్తుంది.

## 17. రాజ్య అధిపతి ప్రజలచేతనే ఎన్నుకోబడాలా?

రాజ్యాధిపతి పదవి చాలా వరకు ప్రతీక వంటిదీ, లాంఛన ప్రాయమైనదీ. పార్టీలకు అతీతంగా రాజ్యఐక్యతకు ప్రభుత్వాలలో మార్పులకు అతీతంగా కొనసాగే లక్షణానికి ఒక ప్రత్యేక చట్టం యొక్క స్వల్పకాలికతను మించి రాజ్యాంగత యొక్క శాశ్వతత్వానికి ప్రాతినిధ్యం వహించేది ఈ పదవి. ఈ పదవియొక్క విధులు జాతియొక్క క్లిష్ట పరిస్థితి లేదా రాజ్యాంగపరమైన భిన్నాభిప్రాయం వచ్చిన తరుణంలో, రాజ్యాధిపతి ముఖ్యమైన విచక్షణాశీలక అధికారాన్ని ప్రయోగించవలసిన సమయంలో ప్రాముఖ్యతను వహిస్తుంది.

### వివిధ విధానాలు

అధ్యక్ష విధానంలో ఎన్నికైన అధ్యక్షుడు రాజ్యాధిపతి యొక్క లాంఛన విధిని ప్రభుత్వ అధినేత అయిన కార్యనిర్వహణాధికారి విధులను (రష్యా, అమెరికా సంయుక్త రాష్ట్రాలు, చాలా వాటినే, అమెరికా దేశాలలోలా) తనలో కలుపుకుంటాడు. పార్లమెంటరీ గణతంత్రంలో రాజ్యాధిపతి నేరుగాగాని, పార్లమెంటుచే ఎన్నుకోబడినగాని కార్య నిర్వహణేతర అధ్యక్షుడు (జర్మనీ, ఐర్లండ్, భారతదేశాలలోలా) రాజ్యాంగ రాజరికంలో రాజ్యాధిపతి వంశానుక్రమణీతమై నిర్ణయించబడి జీవితకాలం పదవిలో ఉంటాడు. (బెల్జియమ్, స్పెయిన్, యునైటెడ్‌కింగ్‌డమ్‌లలోలాగ)

### అత్యుత్తమమైనది లేదు

వీటన్నింటిలో అత్యుత్తమమైనది ఏది? ప్రతీదానిని ఆయా రాజ్యాంగ విధానం సందర్భంలో మొత్తం మీద పరీక్షించవలసి ఉంది. కాబట్టి దీనికి సరళమైన సమాధానం లేదు. కార్య నిర్వహణా అధ్యక్షత్వంలో ఒక అసానుకూలత ఉంది. రాజ్యాధిపతి దైనందిన రాజకీయాల నుంచీ ప్రజాదరణ పొందనవి, విఫలమైన విధానాలవల్ల వచ్చే అసంతృప్తి నుంచీ, అసహ్యం నుంచీ అంటకుండా వేర్పరచుకొని దూరంగా ఉండడానికి అవకాశం లేదు. అంతేకాక అతి ప్రత్యేకంగా అది భూ సంపద, కులీన హోదాల విధానాలలో ఇది శిఖరంగా ఉంటుంది కాబట్టి ఎన్నుకోబడని రాజరికం ప్రజాస్వామికం కానేకాదు. కనీస పక్షంలో రాజరికం ప్రజాభిప్రాయ సేకరణ యొక్క ఆమోదాన్ని పొందడం అనే అవసరానికైనా లోబడేటట్లు దాని ప్రత్యేక హక్కులు రాజ్యాంగంలో శ్రద్ధాపూర్వకంగా

మితుల నుంచి మినహాయించ బడవలసినది.

## 18. ఇంకా ఇతర పదవులు ప్రజలచే ఎన్నుకోబడినవై ఉండాలా?

ఎన్నుకోబడిన ప్రధాన కార్యనిర్వహణాధికారి ప్రభుత్వంలోని అధికారుల యొక్క నడవడికి చాకచక్యానికి బాధ్యుడు కాబట్టి ఆయా ఉద్యోగాలలో నియామకం (మొదటి నియామకం సమాజంలోని అర్హతలున్న ఏ పౌరుడికైనా అందుబాటులో ఉండే షరతులకి లోబడి) క్రింద నుంచి ఎన్నికద్వారా కాక మీదనుండి నియామకం జరగాలని ఒక బలమైన వాదం ఉంది. కాని ప్రజాస్వామ్యానికి స్థానిక అవసరాలకు పరిస్థితుల మార్పులకు స్పందించగలిగే ప్రజాసేవలూ అవసరం. ఆరోగ్యం, విద్య, పోలీసు, స్థానిక సేవలను పర్యవేక్షించి పాలించడానికి స్థానిక ప్రభుత్వపు బాధ్యతను సాధారణంగా వహించడానికి ఎన్నికైన సంస్థలు కావాలనడానికి సమర్ధనీయత ఇక్కడే ఉంది.

### ఎన్నికలు - న్యాయశాఖ

న్యాయశాఖ కూడా ఎన్నుకోబడాలా? సంగతత్వం కోసం మొదట అది అవసరమని పిస్తుంది. శాసనసభ ప్రధానకార్య నిర్వహణాధికారి ఎలా ప్రజలచే ఎన్నుకోబడ్డారో అలాగే న్యాయశాఖ కూడా. కానీ న్యాయశాఖ చట్టసంబద్ధమైన విధిని నిర్వహిస్తుంది గాని, రాజకీయ విధినికాదు. ప్రజాదరణ కంటె ఆ శాఖకు సంగతత్వంలో నిష్పాక్షితలలో సుగుణం ఉంటుంది. వారి పదవీకాలం ప్రజా ఆక్షేపణ ప్రమాదం లేనిది దానికి లొంగనిదిగా సమాజంలో ఒక ప్రత్యేకవర్గంతో తాదాత్మ్యాన్ని పొంది ఒకటయ్యే ప్రమాదం లేకుండా ఉండాలి. చట్టనిర్మాణం, శిక్షలస్థాయి మొదలైనవి కేవలం న్యాయశాఖకే కాక ప్రజాభిప్రాయంలో సంపర్కం కలిగి ఉండేటట్టు చూడడం పార్లమెంటు విధి. అలాగే ఏకకాలంలో న్యాయశాఖను నియామకంచేసే విధానం న్యాయబద్ధమైన ప్రజాస్వామ్య బాధ్యత లేక చింత. ముఖ్యంగా సమాజంలో కొన్ని వర్గాలు -స్త్రీలు లేక జాతిపరమైన ఇతర అల్పసంఖ్యాక వర్గాలు పరిగణింపబడినంత అసానుకూలంగా వ్యవహరించేటపుడు ఈ బాధ్యత ఇంకా ఎక్కువ అవుతుంది (40వ ప్రశ్నలో న్యాయ నియామకాల గురించి ఇవ్వబడింది).

## 19. ఒకటి కంటె ఎక్కువ పార్లమెంటు సభలు ఉండాలా?

పార్లమెంటుకు మొదటి సభ కంటె భిన్నంగా ఎన్నుకోబడిన రెండవసభ ఉండాలన్నదానికి

కారణం చట్ట నిర్మాణానికి సమగ్రమైన విచారణ, పరిపూర్ణమైన మద్దతుని పొందాలనుకోవడం మంచిదన్న ఆలోచన సమాఖ్య వ్యవస్థలో అది ప్రత్యేకంగా ముఖ్యమైనది. ప్రాదేశికమైన వాటికంటే ఇందులో రెండవ సభ సభ్యరాష్ట్రాల ప్రయోజనాలకు ప్రాతినిధ్యం వహిస్తుంది. వ్యక్తి హక్కులకు రాజ్యంగబద్ధమైన హామీ లేనప్పుడు ఇది చట్టనిర్మాణంపై ఉపయోగించే అదుపుగా పనిచేయగలదు.

## వివిధ ఎన్నికలు

సామాన్యంగా రెండు సభల ఎన్నికల విధానాల మధ్య తేడా ఉంటుంది. ఎగువ సభ పరోక్ష ఎన్నికలద్వారానూ లేదా వివిధ నియోజకవర్గాల ఆధారంగాగానీ లేక ఏ ఒక్కసారైనా కొంతమంది మాత్రమే ఎన్నికయ్యేటట్టు వివిధ కాల నియతిలోగాని ఉంటుంది. పార్లమెంటరీ వ్యవస్థలో దేశమంతటా ఏక కాలంలో దిగువసభకీ ప్రత్యక్ష ఎన్నికలు ప్రభుత్వ ప్రజా న్యాయబద్ధతకు ముఖ్యమూలగా ఉండి దానికి చట్టనిర్మాణంలో ప్రాథమికత ఇస్తుంది. ఎగువసభకు మహాఅయితే పరిమితంగా ఆలస్యం చేయడానికి గానీ, తిరస్కరించడానికి గానీ అధికారం ఉంటుంది. ప్రజాస్వామ్యంలో ఎన్నిక కాబడిన రెండవ సభ ఉనికికి చెప్పవలసిందేమీలేదు.

## 20. ఎన్నికలు ఎంత తరచుగా జరగాలి?

పంథొమ్మిదవ శతాబ్దంలో అతివాద ప్రజాస్వామ్య వాదులు ప్రతినిధులపై కార్యసాధకమైన నియంత్రణ ఉండటానికిగాను పార్లమెంటుకు ప్రతి సంవత్సరమూ ఎన్నికలు కావాలని డిమాండు చేశారు. కాని ఆధునిక ప్రభుత్వం ఆర్థిక వ్యవస్థలను నిర్వహించడానికి విధానాల అమలు చూసుకోవడానికి సంవత్సరంకంటె ఎక్కువ వ్యవధి కావాలి. నాలుగు సంవత్సరాల వ్యవధి[1] సాధారణంగా అంగీకరింపబడింది. ప్రభుత్వానికి కొనసాగుదల అవకాశాన్ని ఈయడానికి జవాబుదారీల అవసరానికి, స్పందనా సామర్థ్యం ఒక రాజీ మార్గంగా ఆమోదింపబడింది.

## ఎన్నికల సమయ నిర్ణయం

ఎన్నిక చేసుకొనబడే పదవీ పరిమితి ఎంతైనప్పటికీ, ఎన్నిక సమయ నిర్ణయాధికారం మాత్రం అధికారంలో ఉన్న ప్రభుత్వం వద్ద ఉండకూడదు. క్రింద చర్చించ బడినట్లు (చూ.ప్ర.31) స్వేచ్ఛాయుత స్వచ్ఛ ఎన్నికలకు మూల సూత్రమేమంటే అధికారంలో

---

1. భారత రాజ్యాంగం ఐదేళ్ళక్రమాన్ని నిర్దేశించింది.

ఉన్న పక్షానికిగాని, పక్షాలకుగాని నియోజక ప్రవృత్తిపై నియంత్రణ ఉండకూడదు. లేదా అస్వచ్ఛమైన అనుకూలతను ఈయకూడదు. ఈ అవసరం ఎన్నికల నిర్వహణ, సమయ నిర్ణయానికి విస్తరించాలి.

## 21. ఎవరినైనా ఓటుచేసే హక్కు నుంచి మినహాయించాలా?

చాలా ప్రజాస్వామ్యాలలో అమలులో ఉన్న మినహాయింపులు పిల్లలు, నేరస్థులు, విదేశీయులు. ఇది ఒక కలగూరగంప. తరగతి తరగతికీ కారణాలు వివిధంగా వర్తిస్తాయి. పిల్లలను మినహాయించడాన్ని సామాన్య బుద్ధి, పెరిగే మనస్తత్వమూ సమర్థిస్తాయి. కొంత వయసుకి తక్కువ ఉన్న పిల్లలకు అనుభవంగానీ వారి క్రియవలన దీర్ఘకాలిక పరిణామాలను గురించిన అవగాహనకానీ ఉండదు. అందుచేత వారిని అపితృస్వామికంగా పరిగణించడానికి వీలు లేదు. చాలా సమాజాలలో పిల్లలందరూ కలిసి పొందే వయోజనతను నిర్వహించే హక్కుల సమూహం ఉంటుంది. వివాహం చేసుకొనే హక్కు, ఆస్తిని కలిగి ఉండే హక్కు, తనంతతానుగా చట్టరీత్యా చర్యలను ప్రారంభించే హక్కు, ఓటు చేసే హక్కు షుమారు సెకండరీ స్కూలు వదిలే, సైనిక నిర్బంధసేవా బాధ్యతను తీసుకొనే పద్దెనిమిది సంవత్సరాల వయస్సు.

### నిర్ణయింపబడిన వయోపరిమితి

నిర్ణయింపబడిన వయస్సు ఏదైనా కొంతవరకు నిర్ణయం స్వైరంగానే కనిపిస్తుంది. ఈ రోజుల్లో పిల్లలు పూర్వంకంటే వేగంగా పక్వానికి వస్తున్నారనడానికి ఆధారం ఉంది. ఉదాహరణకు పద్దెనిమిదేళ్ళ కంటే ముందే పూర్తికాల ఉద్యోగంలో జీతం పొందే హక్కు వారు పొందుతున్నారు. కొంతమంది పిల్లలకు వారి బాధ్యత కలిగిన పెద్దవారి నుంచి రక్షణ ఉండాలనే వాదనలో విచారించదగిన సత్యం ఉంది. అందుచేతనే ఇంకా ముందుగానే వారి మాటకు చెల్లుబడి ఇవ్వాలనే వాదన. ఎలాగైనా పరిపక్వతను పొందడం లేక కొనసాగడం ఉండే ప్రవృత్తి. ప్రజాస్వామిక పౌరసత్వానికి కొంత సన్నద్ధత అవసరం. ఇది కుటుంబంలో బడిలో చిన్నవయస్సు నుండి సామూహిక నిర్ణయాలు చేసే అనుభవం పంచుకోవడం వలననే వస్తుంది. ఓటింగు వయస్సుని పద్దెనిమిది సం॥లకు దిగువకి తగ్గించడానికి కావలసిన బలమైన కారణాలు పై అంశాలలో లేవు.

### నేరస్థులు - ఓటు

నేరస్థులను ఓటు చేయనివ్వక పోవడానికి వాదన ఏమంటే చట్టవిరుద్ధంగా తీవ్రమైన నేరాలను చేసేవారు చట్టాలను చేయడంలో వారివంతు 'మాటని కోల్పోవాలి.' మరొక

వంక స్వేచ్ఛని పోగొట్టుకోవడమంటే పౌర హక్కులన్నింటినీ నష్టపోవడం కాకూడదని వాదన. ఖైదీలు ప్రత్యేకంగా వారిని చట్ట విరుద్ధంగా అమానుషంగా వ్యవహరించకుండా పరిస్థితుల నుంచి రక్షణనిచ్చి సహాయపడే ఎన్నికైన ప్రజాప్రతినిధుల అందుబాటు ఉండాలి.

## దేశంలో నివసిస్తున్న విదేశీయులు

చివరగా వివాదాత్మకమైన దేశంలో నివసిస్తున్న విదేశీయుల మినహాయింపు. ఇక్కడ ఓటు హక్కులో మరో సమస్య ఉంది. పౌరసత్వానికి అర్హత. ప్రజాస్వామ్యం పద్ధెనిమిదవ శతాబ్దపు రాజవంశ నియమమైన పుట్టుక లేదా పౌరవారసత్వమే రాజకీయ హక్కుల ప్రాతిపదిక అనే నియమాన్ని ఎదిరించడానికే వచ్చిందని ఒప్పుకుంటే, సంగతత్వంలో అదొక్కటే పౌరసత్వ లక్షణం. న్యాయబద్ధంగా ఒకదేశంలో స్థిరనివాసమేర్పరుచుకున్న వారిని మినహాయించే హక్కుకి సూత్రంగా చేయలేము. స్థిర నివాసకాలం ఎంత ఉండాలన్నది వివాదాంశమేకాని ఐదు సంవత్సరాలకాలం హేతుబద్ధమైనది.

## 22. ఓటరుగా నమోదవడానికి ప్రవృత్తులు ఏమై ఉండాలి?

ఓటరుగా నమోదు ఒక సాంకేతిక విషయంగా అనిపించవచ్చు. కాని ఆచరణలో అవలంబించబడిన ప్రవృత్తులు ఓటుహక్కుపై తగినంత అర్థాన్ని కలిగి ఉంటాయి. ఎన్నికలకు ముందుగా ఓటరుల జాబితా తయారుచేయడం సామాన్యమైన విషయమే. వ్యక్తిగతంగా ఓటర్లు గుర్తింపబడాలి. మరొక ఓటు వేయకుండా వారు ఓటు వేయడం నమోదు కావాలి. ఒకరి ఓటు మరొకరు వేయడానికి వీలుండకూడదు. కాని నమోదు పద్ధతులు వారి హక్కులను నమోదు చేయడానికి కాని, ఆచరణలో వినియోగించడానికి గాని నిరుత్సాహపరిచే ప్రవృత్తులలో అనేక మార్గాలున్నాయి. నమోదు స్వచ్ఛందం కావచ్చును, లేదా ఉచితంగా పనిచేసే పార్టీ కార్యకర్తల కృషి మీద ఆధారపడవచ్చును, లేదా జాబితా నిజానికి విడిగా ధృవీకరించాల్సిన పన్ను విషయాలు, వివాహవృత్తి స్థాయిల ధృవీకరణకు మరికొన్ని ప్రభుత్వ ప్రయోజనాలకు ఉపయోగించబడవచ్చును. జాబితా ఎన్నికల సమయంకంటె ముందుగానే తయారుచేయబడితే ఎన్నికల సమయానికి పనికిరానంత పాతదైపోవచ్చును. నిర్బంధ నమోదు అత్యుత్తమ ప్రజాస్వామ్య ఆచారంగా గుర్తింపు పొందింది. ఓటర్ల జాబితాల కూర్పు శిక్షితులైన, జీతాలివ్వబడిన ఉద్యోగులు ఎన్నికలకు సాధ్యమైనంత దగ్గరలో చేయాలి. జాబితాలు ఇతర ప్రభుత్వ పత్రాలలో, చిట్టాలలోకాక వ్యవస్థాయుతంగా వేరుగా ఉంచబడాలి.

## 23. ఓటు వేయడం తప్పని సరా?

ఓటు వేయడం నిర్బంధమని అనడానికి వాదం, ఉదా : ఆస్ట్రేలియాలో ప్రభుత్వాన్ని ఎంచుకోవడం, ప్రతినిధులను ఎన్నుకోవడం కేవలం ఒక హక్కేకాక ఒక పౌరవిధి కావడం. ఈ హక్కుని పొందడానికి పూర్వతరాలు పోరాడాయి. ఓటు వేయకపోవడం కేవలం ఆసక్తిలేని, రాని, చనిపోయినవారిలా కాకుండా ఓటుపై వ్రాసి ఇవ్వాలి. ఇందులో స్వేచ్ఛాయుత ఎన్నికకి నిర్బంధం అనే స్వవచన వ్యాఘతం ఉంది. వివిధ వర్గాలలో మానివేసే వారి సంఖ్య ప్రజాస్వామిక ప్రవృత్తిలోని లోపాలను సూచిస్తుంది.

### నిర్బంధ నమోదు

చాలా ప్రజాస్వామ్యాలు తరువాతి వాదులకు ఇష్టత చూపి ఓటరు ఓటింగు చేయడం ఐచ్ఛికంగా పరిగణిస్తాయి. కాని నమోదుని నిర్బంధం చేయడంలో చాలా వాటిలాగ ఇది పొసగ గలదా? అలా అని లేదు. ఓటు వేయాలా, మానాలా అన్నదానికి ఓటరు జాబితాలో ఉండి ఉండడం మొదటి నియమం. నమోదు జాబితా ఓటర్ల సంఖ్యను నియోజక వర్గాలలో సమానంగా పంచడం వంటి న్యాయబద్ధమైన ప్రయోజనాలకొరకే వాడాలి.

## 24. ఓటుకి గోపనీయత ఎందుకు?

ఓ ఆంగ్ల ఉదార తత్వవేత్త జె.ఎస్.మిల్ ఓటు వేసేవారు తోటి పౌరులకు వారు అలా ఓటు చేసినందుకు జవాబుదారులు కావడానికి వీలుగా ఓటింగ్ బహిరంగంగా జరగాలని నమ్మాడు. సంకుచితమైన వ్యక్తిగత ప్రయోజనమే కాక దానివలన విశాలమైన ప్రజా ప్రయోజనం కూడా ఉంది. ఈ ఉన్నతమైన భావాన్ని తరువాతివారు అంగీకరించలేదు. ఆచరణలో బహిరంగ ఓటింగు ఎన్నుకొనేవారిని శక్తివంతమైన యజమానుల, భూస్వాముల, మత గురువుల, ఉన్నతులందరి శక్తివంతమైన ఒత్తిడులకు గురిచేస్తాయి. లేదా చాలా విధానాత్మకమైన పోటీదారుల అవినీతిని ఎక్కువచేస్తాయి. ప్రజాస్వామ్య విధానాలన్నింటిలోను గోపనీయత గల ఓటింగు విధానం ముఖ్య లక్షణంగా ఇప్పుడు స్థిరమైనది.

## 25. పదవులకు పోటీ చేయడానికి ఎవరికి హక్కుంది?

నియమ సిద్ధంగా ఓటు చేసే ఎవరైనా పోటీచేయవచ్చును. కొన్ని దేశాలలో ప్రజా

వ్యవహారాలతో కొంత అనుభవం సంపాదించకుండానే వ్యక్తి ఉన్నత పదవికి నమ్మదగిన అభ్యర్థి[2] కాలేడు కాబట్టి అభ్యర్థులకు ఎక్కువ వయస్సు ఉండాలని నిర్ణయించాలన్న అవసరం అనే భావం ఉంది.

## నామ నిర్దేశానికి నియమాలు

అభ్యర్థుల నామనిర్దేశానికి నమోదు ప్రవృత్తులకు సంబంధించిన విషయంలో మరొక ప్రశ్న. చాలా నియోజక విధానాలలో నిరర్థక అభ్యర్థులను దూరంగా ఉంచడానికి కొన్ని పద్ధతులు ఉపయోగించబడ్డాయి. ఆయా నియోజకవర్గం జాబితాలో ఉన్న కొందరి సంతకాలు అవసరం.[3] నిర్ణీత శాతం ఓట్లకంటె ఓట్లు తక్కువ వచ్చినపుడు కోల్పోయే ధరావత్తుగా కొంత డబ్బు హామీగా ఉంచడంకూడా అవసరంగా పరిగణించబడింది. గంభీరమైన నిరర్థకమైన రెండురకాల వారు పాల్గొనకుండా ఉండే అవకాశం ఈ ఆచారంలోని ప్రమాదం - ముఖ్యంగా అభ్యర్థులు క్రొత్త పార్టీలకు లేదా రాజకీయశక్తులకు ప్రాతినిధ్యం వహించేవారైతే. కొన్ని దేశాలలో అభ్యర్థులు కేవలం అంతకుముందే నమోదైన పార్టీలవారే అయి ఉండాలన్న నియమం ఉంది. ఇది కూడా నిరర్థకమైన వారిని తొలగించే ప్రయత్నమే. కాని ఇది పార్టీల మీద, అభ్యర్థులమీద కొంత అదుపుకి అవకాశాన్నిచ్చేది. ఆ మేరకు నియోజకుల న్యాయబద్ధమైన అభిప్రాయ వ్యక్తీకరణని నియమితం చేసేదే.

## ప్రాథమిక ఎన్నికలు

అమెరికా సంయుక్త రాష్ట్రాలలో ప్రతీ పార్టీయొక్క అభ్యర్థులు వారి వారి పార్టీలో నమోదైన ఓటర్లకు నియమితం చేయబడిన ప్రాథమిక ఎన్నికద్వారా ఎంపిక చేయబడతారు. ఈ ఆచారం ఓటర్లలో ఎవరు పోటీచేయాలి, ఎవరు ఎన్నుకోబడాలి అన్న విషయాలపై

---

2 భారతీయ పౌరులు ఓటుహక్కుని పద్ధెనిమిదేళ్ళ వయస్సుకే పొందుతారు. కాని లోక్‌సభ ఎన్నికలకు పోటీలో అభ్యర్థులు కాలేరు. వారు లోక్‌సభ, ప్రజాసభ లేదా విధానసభ (రాష్ట్ర శాసనసభ)కూ ఇరవై ఐదేళ్ళు వచ్చేవరకూ పోటీచేయడానికి అర్హులు కారు. అధ్యక్షుడిగా, ఉపాధ్యక్షుడిగా లేదా రాజ్యసభలోకాని, విధాన పరిషత్తులోగాని అభ్యర్థిగా పోటీచేయడానికి లేదా ఒక రాష్ట్ర గవర్నర్ (రాజ్యపాల్) పదవికి నియామకం కావడానికి విధించబడిన కనిష్ఠ వయోపరిమితి ముప్పైఐదు సంవత్సరాలు.

3. భారతదేశంలో అవసరంలేదు. కాని పోలయిన ఓట్లలో ఒక పదిశాతం పొందకపోతే అతను/ ఆమె ధరావత్తుని కోల్పోతారు.

కొంత భావప్రకటనకి అవకాశం ఇస్తుంది. కాని అది ఎన్నికల ఖర్చుని విపరీతంగా పెంచుతుంది. ధనవంతులైన పక్షంలో పక్షపాతమూ చూపుతుంది. ఈ లోపాన్ని దృష్టిలో ఉంచుకొని పార్టీల మెంబర్లు అందరి ఓటులతో ఆయా నియోజక వర్గాలలో అభ్యర్థులను ఎంపికచేస్తారు. కాని అభ్యర్థుల ఎంపికలో ఈ ప్రజాస్వామికత అంశ కూడా సార్వజనీనం కాదు.

## 26. ప్రజా పదవులకు అంత కొద్దిమంది స్త్రీలు మాత్రమే ఎందుకు ఎన్నుకోబడతారు?

పాశ్చాత్య ప్రజాస్వామ్యాలలో స్త్రీ నియోజకుల సంఖ్యలో స్త్రీ ప్రతినిధుల అనుపాతం తక్కువ.[4] చిరకాల ప్రజాస్వామ్యాలలో అది 15శాతం కంటె తక్కువ. నార్డిక్ దేశాలలో 35%కి మిగిలినవాటిలో 10శాతంకి ఫ్రాన్స్‌లోని అతితక్కువ 6 శాతం మధ్యమం. దీనికి కారణాలు కొంతవరకు చారిత్రకమైనవి. కొంతవరకు అంతర్దేశీయమైనవి. కొంతవరకు రాజకీయమైనవి. మానవ చరిత్రలో చాలా భాగం స్త్రీలు స్వతఃసిద్ధంగా రాజకీయ కార్యకలాపాలలో ఔపచారికంగాను, అనౌపచారికంగాను అనువైనవారు కాదని మినహాయింపబడ్డారు. ఇది క్రమేణా వారు అనువైనవారు కాదన్న భావాన్ని బలపరిచింది కూడా. ఈ పూర్వ నమ్మకాల వారసత్వమే అసమాన గృహాశ్రమ విభజనలో ఇంకా గట్టిపడింది. పిల్లల పెంపకం, ఇంటిపనులలో స్త్రీ ఎక్కువ బాధ్యతను తీసుకోవడం ఆమె రాజకీయ పదవిని కోరడానికి అడ్డంకి అయింది. రాజకీయాలు విపరీతంగా కాలాన్ని హరించే లక్షణాన్ని కలిగినవి. ప్రభుత్వంకానీ, పార్లమెంటుకానీ పనిచేసే గంటలు తరచూ సామాజికతా విరుద్ధమైనవి. పోటీ కార్యక్రమాలు, పార్టీలో ప్రత్యర్థత వ్యక్తిగత యొక్క స్వాధికారాన్ని పెంపుచేసే లక్షణాలు రాజకీయాలలో ఎక్కువగా ఉండడం వలన అట్టివాటికే అక్కడ విలువ ఉండడంవల్ల స్త్రీలు ఆయా వాతావరణం తమకి అనువైనది కాదని భావిస్తారు.

---

4. భారత రాజ్యాంగం ప్రత్యక్ష ఎన్నికలలో ప్రతి నగరపాలక సంస్థ లేక పంచాయతీ ఎన్నికలలో మొత్తం స్థానాలలో మూడింట ఒకవంతు తక్కువ కాకుండా స్థానాలను స్త్రీలకు కేటాయించాలని నిర్దేశించింది. అట్టి కేటాయింపు (ఆ రక్షణ) రాష్ట్ర లేదా కేంద్ర శాసనసభకు విస్తరింపబడలేదు.

### సమానత ఎందుకు ముఖ్యమైనది?

ఇది ముఖ్యమైనదా? రాజకీయ సమానతా దృక్కోణం నుంచి ఇది ముఖ్యమైనదే. ఎన్నికైనగాని మరోలాగాని పదవి అందుబాటుకి సమాజంలో ఏ వర్గానికైనా స్పష్టంగా ఎక్కువ హక్కు ఉంటే ఇది ప్రముఖమైనదే. స్త్రీలకి సంబంధించిన సమస్యలు పురుషులు గంభీరంగా పరిగణించరని అనుకోడానికి తగినంత కారణం ఉంది. ప్రజానిధుల కేటాయింపు పోటీలో తగిన ప్రాధాన్యం ఇవ్వరు. ఏ విధంగాను అవే భావాలు ప్రయోజనాలు కలిగినవారు కాకపోయినా చాలామంది స్త్రీలకు ఎక్కువగా పురుషులే ఉన్న పార్లమెంటులో గర్భనిరోధం, గర్భస్రావం, మానభంగంలాంటి విషయాలలో చట్ట నిర్ణయాలు చేయడం అక్రమశీలంగా కనిపిస్తుంది. ఏది ఏమైనా స్త్రీలు వారి అభివృద్ధి చేసే ప్రత్యేక లక్షణాలకు ప్రజాజీవితంలో తగిన అవకాశం ఇవ్వబడకపోతే ఆ మేరకు సమాజమే బీదదౌతుంది.

### సమతౌల్యాన్ని మార్చడం

ఏం చేయాలి? రాజకీయ అసమానత యొక్క చారిత్రక వారసత్వాన్ని అధిగమించే టందుకు అనేక స్థాయిలలో తగిన చర్యలు అవసరం. బడులలో ప్రజా విద్యా కేంద్రాలలో దృక్పథాలు మార్చాలి. పిల్లల పెంపకానికి సౌకర్యాలు పెంచాలి. పార్లమెంటులోని ప్రణాళికలను, సౌకర్యాలను సమీక్షించాలి. ఇంకా కోటాల పద్ధతివల్లగాని నార్డిక్ దేశాలలోలా ఆ రక్షణ వలనగాని, స్త్రీ సభ్యులను ఉత్సాహపరచడం, వారిని ప్రతిపాదించడం, ప్రత్యేకబాధ్యత, నాయకత్వం వహించే రాజకీయపక్షంపై ఉంది.

## 27. ఏ అర్థంలో పార్లమెంటులో ప్రతినిధులు నియోజకులకు ప్రాతినిధ్యం వహిస్తారు?

రాజకీయ ప్రాతినిధ్యకి రెండు మౌలికమైన అర్థాలున్నాయి. మొదటిది ప్రాతినిధ్యం (ఏజెన్సీ భావం) ఇందులో ప్రతినిధికి ఒకరిచే అధికారం ఇవ్వబడి ఒకరి తరపున పనిచేస్తాడు. ఆ ఒకరు తన నియోజకవర్గ ప్రజలు. కొన్ని విధానాలలో తన నియోజకవర్గ ప్రజలందరి కొరకు అందరి తరపున పనిచేస్తాడు. ఉదాహరణకు : స్థానిక ప్రయోజనాల కొరకు, స్థానిక అభిప్రాయ ప్రకటన కొరకు లేదా వ్యక్తిగత వ్యథా నివారణ కొరకు. కొన్ని ఇతర విషయాలలో ప్రతినిధి తనకు ఓటువేసిన వారికే ప్రాతినిధ్యం వహిస్తాడు. ఎన్నికల రంగంలో ప్రణాళికలను, విధానాలను అనుసరిస్తాడు. పార్లమెంటులోని ప్రతినిధులు

వారి వారి నియోజకులందరి తరపున అన్నివిధాల మాట్లాడి పని చేస్తారన్నది కల్పన. అలా పనిచేయడం వారి ప్రణాళికలతో వారి యొక్క కార్యసాధకతతో జవాబుదారి వహించడంలో అసంగతం.

## సూక్ష్మరూపపు ప్రాతినిధ్యం

రాజకీయ ప్రాతినిధ్యంలో రెండవభావం సూక్ష్మరూపమైనది. ఇందులో వ్యక్తిగత ప్రాతినిధ్యానికికాక అంతటికీ ప్రాతినిధ్యం ఉంటుంది. శాసనసభ ప్రాతినిధ్యం ఎంతవరకంటె అది నియోజకుల లక్షణాలని కొన్ని సంబంధిత విధాలలో ప్రతిబింబించేంత వరకే, నైసర్గిక పంపిణీ వివిధ పార్టీలకు వారి వారి ఓట్ల పంపిణీ ఈ విధాలలో ఏది అతి ముఖ్యమైనది? అన్నీ ముఖ్యమే. నియోజక ఎంపికలో గెలిచి పోటీపడే చట్ట నిర్మాణ ప్రణాళికలనిచ్చు జాతీయ పార్టీల మధ్యనే ఉండే పద్ధతిలో ఆ సభా నిర్మాణం వివిధ పార్టీలను జాతీయ ఓటు ప్రతిబింబించడం అతి ముఖ్యం. అనుపాత నియోజక పద్ధతితో ఇది పూర్తిగా ఏకీభవిస్తుంది (చూ.పు. 28).

## రెండు ప్రజాస్వామిక నియమాలు

ప్రాతినిధ్యంలో ఈరెండు భావాలు (ఏజెన్సీ, సూక్ష్మరూపపు) మొదటిప్రశ్నలో వివరింపబడినట్లు ప్రజాస్వామిక మౌలిక నియమాలను వహించేవిగా చూడవచ్చును. ప్రజా సార్వభౌమత్వం ప్రజాధికారం అంతా ప్రజలనుంచే ఆవిర్భవిస్తుందని పార్లమెంటు ప్రభుత్వము ప్రజానియంత్రణకి లోబడి ఉండాలని నియోజకుల ప్రతినిధి అనే భావంలో ఇమిడి ఉంది. ఆ ప్రతినిధి వారిచే అధికారం ఇవ్వబడి వారి కోసం పనిచేసి, వారికి జవాబుదారి చేయబడి, వారిచేత తొలగింపబడినపుడు సూక్ష్మరూపపు ప్రాతినిధ్యం - ప్రాతినిధ్య భావన రాజకీయ సమానత నియమానికి అనువర్తిస్తుంది. ఓటరు ఎక్కడ నివసించేవాడైనా ఎవరికి ఓటు చేసినా ప్రతీ ఓటుకి ఒకే విలువ ప్రతిష్ట ఉండాలి. ఈ మేరకు ఈ నియమం సంతృప్తి పరచబడినది. సభ నియోజకుల సూక్ష్మరూపపు ప్రతినిధిగా నైసర్గిక పంపిణీని వివిధ పార్టీలమధ్య ప్రజా ఓటు పంపిణీని ప్రతిబింబిస్తుంది.

## 28. వివిధ నియోజక పద్ధతుల మధ్య తేడాలేమిటి?

ప్రపంచమంతటా అనేకమైన నియోజక విధానాలు వాడుకలో ఉన్నాయి. కానీ అందులోని ముఖ్యమైన అయిదింటిని మాత్రమే రేఖామాత్రంగా పేర్కొంటాము. వీటిలోని సుగుణాలు తరువాతి ప్రశ్నలో వివరింపబడతాయి.

## అనేకత్వ విధానం

అమెరికా సంయుక్త రాష్ట్రాలలోను, చాలా లాటిన్ అమెరికా దేశాలలోను, యునైటెడ్ కింగ్‌డమ్ దాని వలస రాజ్యాలలోను శాసనసభా ఎన్నికలలో అనేకత్వ లేక 'ఫాస్ట్ పాస్ట్ ది పోస్ట్' విధానం ఉపయోగించబడినది. ఈ విధానంలో దేశం ఒకే పరిమాణంగల అనేక ఏకసభ్య సమాజాలుగా విభజింపబడుతుంది. ఓటర్లు బ్యాలెట్ పత్రంపై ఒకే ఒక అభ్యర్థికి ఓటు చెయ్యాలి. అధిక సంఖ్యాకత లేకపోయినా అత్యధిక ఓట్లు వచ్చిన వ్యక్తి ఎన్నకవుతాడు

## పర్యాయ ఓటు

పర్యాయ ఓటు ఆస్ట్రేలియాలోని దిగువసభ ఉపయోగిస్తుంది. ఇక్కడ నియోజక విధానంలో లాగానే ఉన్న ఓటరు అభ్యర్థుల పేరుకెదురుగా తన ఎంపిక వరుస సంఖ్యను వేస్తాడు. మొదటి ప్రిఫరెన్స్‌లో ఏ అభ్యర్థీ స్పష్టమైన ఆధిక్యతను పొందకపోతే అతి తక్కువ ఓట్లు వచ్చిన అభ్యర్థి తొలగింపబడి అతని బ్యాలెట్లు రెండవ ప్రిఫరెన్స్ ఆధారంగా పంచబడతాయి. ఒక అభ్యర్థి అధికసంఖ్యాక ఓట్లు ఈ ప్రవృత్తి కొనసాగింపబడుతుంది. రెండవ బ్యాలెట్ నిర్వహించబడడం ద్వారా మొదటి విడతలో మీదనున్న ఇద్దరు అభ్యర్థులు ఫ్రాన్స్‌లోలా రెండవదానిలోకి వెళతారు.

## బదలాయించగల ఏక ఓటు

బదలాయించగలిగే ఏక ఓటును ఐర్లాండ్, మాల్టా, ఆస్ట్రేలియన్ సెనేట్లలో ఉపయోగిస్తారు. ఇక్కడ నియోజకవర్గాలు జనాభా ఆధారంగా మూడు నుంచి ఏడు వరకు సభ్యులని ఎన్నుకొంటాయి. ఎన్ని స్థానాలుంటే ఓటర్లకు అన్ని ఓట్లు ఉంటాయి. వారు ఆ ఓట్లని ఎంపిక క్రమంతో వేస్తారు. ఎన్నికవడానికి ప్రతి అభ్యర్థీ పోల్ అయిన ఓట్లకు కొంత అనుపాతంలో కొంత కోటాని పొందాలి. మొదటి ప్రిఫరెన్స్‌లో తగినన్ని ఓట్లు రాకపోతే తరువాతి ప్రిఫరెన్స్‌లో ఒక నిర్ణీతమైన సూత్రం ఆధారంగా మళ్ళీ పంపిణీ చేయబడతాయి.

## పార్టీ జాబితా

పశ్చిమ యూరప్‌లోను, ఇజ్రాయిల్‌లోను పార్టీ జాబితా విధానం ఉపయోగింపబడుతుంది. ఒకస్థాయి ప్రకారం పార్టీలు స్థానిక లేదా రాష్ట్రీయ అభ్యర్థుల జాబితాలను తయారుచేస్తాయి. ఓటరు తనకు నచ్చిన పార్టీకి ఓటు చేస్తాడు. ఆ తరువాత




న్యాయపద్ధతిని పక్కన పెట్టే ప్రయత్నంలో చుట్టు తిరిగి రావడాన్ని
అప్రజాస్వామికంగా ఎంచాలి

వారి వారి పార్టీలకు వచ్చిన మొత్తం ఓట్ల నిష్పత్తిని అనుసరించి అభ్యర్థులు ఎంపిక చేయబడతారు. ఒక పార్టీ కనీస నిష్పత్తిని పొందడం ప్రాతినిధ్యాన్ని వహించడానికి కనీస అవసరం.

### మిశ్రిత సభ్య విధానం

మిశ్రిత సభ్య లేదా అదనపు సభ్య విధానం జర్మనీ, హంగేరీ దేశాలలో ఉపయోగింప బడుతుంది. దానినే న్యూజిలాండులో ఉపయోగించే ప్రతిపాదన ఉంది. ఈ విధానంలో ప్రతినిధులకు ఒక నిష్పత్తి (50 శాతం వరకు) ఏకసభ్య నియోజకాల వర్గం నుంచి పైన చెప్పబడిన మొదటి రెండు విధానాలలో వలె ఎన్నుకోబడతారు. మిగిలిన వారి ప్రతినిధులు పార్టీ జాబితా పద్ధతిలో ఎన్నుకోబడతారు. కానీ మొత్తం ఫలితం పార్టీ ఓటు పంపిణీలో ఒక నిష్పత్తిలో ఉండేటట్లు చూస్తారు. నియోజకులకు ఒకటి, పార్టీకి మరొకటి, అభ్యర్థికి రెండేసి ఓట్లు ఉంటాయి. అంతేకాక పార్టీలు ప్రాతినిధ్య అర్హత పొందడానికి ఒక కనీస స్థాయి నియమం ఉంటుంది.

## 29. ఈ విధానాలలో అనుకూల - అననుకూల అంశాలు ఏమిటి ?

ఒక దేశం నైజం, జనాభా, వివిధ పార్టీల నియోజక మద్దతుకి దూరంగా వివిధ ఎన్నికల విధానాలలో స్పష్టమైన సుగుణాలను సరిగా అంచనా వేయలేము. ఉదాహరణకు : ఒక దేశంలో స్థిరమైన రాజకీయ పక్షాలే లేకపోతే నిష్పత్తితో కూడిన నియోజక విధానానికి అర్థం ఉండదు. ఎందుచేతనంటే పార్టీల మధ్య ప్రజా ఓటు యొక్క పంపిణీ, నిష్పత్తి లక్షణం యొక్క కేంద్రం కాబట్టి. దీని వెనుక వచ్చే అంచనా వివిధ విధాలలోని పోకడలను చూపేదే కాని తప్పనిసరి పరిణామాలను చర్చించేది కాదు.

### సామాన్యత (Simplicity)

బహు ప్రాతినిధ్య (ఫస్ట్ పాస్ట్ ది పోస్ట్) విధానం యొక్క సుగుణం సామాన్యత. అది ఇతర విధానాలకంటె పార్లమెంటులో ఏక పార్టీ అధిక సంఖ్యాకతను, అంతేకాక పార్టీ ప్రభుత్వాన్ని పెంపుచేసే అవకాశం కలది. అది అతి పెద్ద పార్టీ నియోజక పద్ధతులను అతిశయింపజేస్తుంది. ప్రభుత్వాన్ని మార్చేటందుకు నియోజక అభిప్రాయాలలో చిన్న మార్పులను నమోదు చేయగలదు. పరిణామం మార్చిన నియోజక వర్గాల సంఖ్య మీద ఆధారపడినా మార్పులను నమోదు చేయగలదు. ఈ విధానంలోని అసానుకూలం ఏమంటే పార్టీల మధ్య నియోజకవర్గాలలోను, జాతీయ ఓటు యొక్క పంపిణీ వలన

అది మరీ అసమనిష్పత్తితో కూడిన ఫలితాలను కలిగించగలదు. ఉదాహరణకు : ఈ విధంగా ప్రతీ నియోజక వర్గమూ సరిగ్గా నాలుగు పార్టీల మధ్య 40 : 30 : 20 : 10 నిష్పత్తిలో ఉంటే 60 శాతం ఉండే ఒక పార్టీ ఓటర్లకి ప్రాతినిధ్యం ఇవ్వకుండానే మరొక పార్టీ అన్ని స్థానాలను గెలవగలదు. కాని ఇలా జరగడం ఎప్పుడూ సాధ్యం కాదు. కానీ ఈ విధానం వివిధ ప్రాంతాలలో పలచగా ఉన్నవాటికంటే కొన్ని ప్రాంతాలలో మాత్రమే సాంద్రంగా ఉన్న పార్టీలనే ఇష్టపడుతుంది. నియోజకవర్గ సరిహద్దులు ఎలా విభజించాలా అన్న విషయం మీద పెద్ద వెల ఉంచుతుంది. ఓటర్లు చాకచక్యంతో, గడుసుతనంతో ఓటు వెయ్యడాన్ని ప్రోత్సహిస్తుంది. మొదటి ఎంపిక ఓటు ద్వారాకాక స్వైర ఫలితాల ద్వారా ఇది సాధ్యం. ఎందువలనంటే ఓటర్లు ఇతర ఓటర్లు ఎలా నడుస్తున్నారో తెలియనివారు కాబట్టి.

## అధిక సంఖ్యాక మద్దతు

పర్యాయ ఓటు విధానం బహుదా విధానంపై ఎక్కువ సానుకూలత కలిగినది. కారణమేమంటే ఆ విధానంలో ఒక అభ్యర్థి ఎన్నిక కావడానికి ఒక నియోజకవర్గంలో అత్యధిక ఓట్లను పొందవలసి ఉంటుంది. కానీ బహుతా విధానంలో అలా కాదు. ఒక నియోజకవర్గానికి ప్రాతినిధ్యం వహించడానికి అలాంటి ఆధిక్యతను పొందడం కనీస అర్హతగా పరిగణించవచ్చును. దాని విశాల ఫలితం బహుతా విధానంకంటే ఎక్కువ అనుపాతంలో ఉండే అవకాశం కలిగించడంకానీ అది తగినంత శక్తి కలిగిన మూడవ, నాల్గవ పార్టీలు (సమానంగా పంచబడిన ఓట్ల మద్దతుతో) పార్లమెంటులో ప్రాతినిధ్యం వహించడాన్ని నివారించగలదు.

## ఓటరు ఎంపిక

బదలాయించగల ఏక ఓటు ఎంత నిష్పత్తిలో ఉన్నదీ నియోజకవర్గం ప్రమాణంపై ఆధారపడినా - ఎంత పెద్దవైతే అంత ఎక్కువ నిష్పత్తిలో చిన్న పార్టీలు ప్రాతినిధ్యాన్ని సాధించడానికి వీలుకలిగిస్తుంది. ఒక పార్టీ మద్దతుదారులు అభ్యర్థులలో వారి వారికి ఎవరు ఇష్టులో వ్యక్తీకరించగలరు. కాని నియోజకవర్గాల పెద్ద పరిమాణం నియోజకులకి ప్రతినిధికి ఏక సభ్య నియోజకవర్గంలో ఉండే బంధాన్ని తెంచే లక్షణం ఉంది. తక్కువ ప్రిఫరెన్స్ ఓట్లని అభ్యర్థుల మధ్య పంపకం చేసే పద్ధతి అతి క్లిష్టమైనది.

## నిష్పత్తి లక్షణం

పార్టీ జాబితా విధానం చాలా వరకు ఓట్లన్నింటికీ సమాన విలువనిచ్చేదానిగా

చెప్పుకోవచ్చును. ఈ విధంగా స్థానాలకి ఓట్ల నిష్పత్తి ప్రకారం అది ఆయా పార్టీలకు పంపిణీ చేయగలదు. ప్రతినిధులు నియోజకులకు నేరుగా జవాబుదారీ కాకపోవడం నియోజకులకు, పార్టీ సభ్యులకు కూడా జాబితా పార్టీలోని అభ్యర్థుల క్రమంమీద ప్రభావం లేకపోవడం అందులోని అసానుకూలతలు. ఈ విధంగా ప్రతినిధులు నియోజకులకంటె పార్టీ కేంద్ర వ్యవస్థకే కృతజ్ఞులై ఉంటారు. జాబితా విధానం విభిన్న పోకడల యెడల, విభిన్న సామాజిక వర్గాల యెడల అభ్యర్థుల సమతౌల్యమైన నమూనాని తయారుచేయడానికి అవకాశాన్ని ప్రోత్సాహాన్ని పార్టీలకి ఇస్తుంది.

## అవకలన ప్రాతినిధ్యం

మిశ్ర సభ్య విధానం ఏక సభ్య నియోజకవర్గాలలో ఏ నిష్పత్తిలో ప్రతినిధులు ఎన్నుకోబడ్డారన్న ఆధారంగా సుమారు అనుపాత ఫలితాలనివ్వగలదు. ప్రజా ఓటు ఇంకా సమానంగా పంపిణీ కాబడితే సంకీర్ణ ప్రభుత్వం ఏర్పరచవలసిన అవసరం ఉన్నా అది ఎప్పుడైనా ఏక పార్టీకి బలమైన మద్దతుకి అవకాశం ఉంటే దానిని నేర్పరిచేదిగా రూపొందించవచ్చును. జాబితా విధానం యొక్క అసానుకూలతలతోపాటు దానికి నియోజకవర్గాలు అవసరమయినా - అవసరం కాకపోయినా రెండు విధాల ప్రతినిధులు కావాలి. ఈ విధానానికి మద్దతు చేసేవారు పార్టీ జాబితాలను నియోజక పోటీలో ఓడినవారిలో మంచివారితో ఏర్పరచడంవల్లనూ ఈ సభ్యులకు కొన్ని నియోజకవర్గాలతో నియోజకవర్గ బాధ్యతలనుకేటాయించడంవల్లనూ అధిగమించవచ్చని వాదిస్తారు.

## 30. సంకీర్ణ ప్రభుత్వం అప్రజాస్వామికమా?

నిష్పత్తి ప్రకారం ప్రాతినిధ్య విధానాన్ని బలపరిచేవారు బహు ప్రాతినిధ్య పర్యాయ ఓటు విధానాలు పౌరుల ఓట్లను అసమానంగా పరిగణిస్తాయని, అందుచే అప్రజాస్వామికమైనవని వాదిస్తారు. ఆ విధంగా అవి మౌలిక ప్రజాస్వామ్య నియమమైన సమానతను భంగపరుస్తాయి. అలా చేయడంలో ఒక్కొక్కప్పుడు చాలా చిన్న అల్ప సంఖ్యాకతకాని లేదా అల్ప సంఖ్యాక మద్దతు ఉన్న నియోజకులు ప్రభుత్వాలను ఏర్పరచడాన్ని అనుమతిస్తాయి. మరొకవంక నిష్పత్తి ప్రాతినిధ్యం యొక్క విమర్శకులు - ఆ పద్ధతిలో ఏ ఒక్క పార్టీ ప్రజా ఓటులో ఆధిక్యత పొందడం అరుదు కాబట్టి - ఆ పద్ధతిలో సంకీర్ణ ప్రభుత్వమే అవసరమవుతుందని వాదిస్తారు. సంకీర్ణ ప్రభుత్వాలు

ప్రభుత్వాలను నిర్ణయించడాన్ని నియోజకుల చేతిలోనుంచి తీసి పార్టీ నేతలకు ఇస్తాయి. ఈ విధంగా ప్రజా నియంత్రణను, జవాబుదారీని తగ్గిస్తాయి. వారు ముఖ్యంగా దక్షిణ వామపక్షాల మధ్య కీలక స్థానాన్ని ఆక్రమించినపుడు అల్ప సంఖ్యాకులైన పార్టీకి అసమ నిష్పత్తిలో అధికారాన్ని ఇస్తాయి. పార్టీలు తమ తమ నియోజకులకు వారు చేసే సంకీర్ణ నిర్ణయాలకు జవాబుదారీ కావాలని అభ్యంతరం చెప్పవచ్చును. ఇరుపక్షాల మధ్య ఉండే మధ్య పార్టీవారు ఒక ఎన్నికల తరువాత మరొక ఎన్నికలో పార్టీలు కుడివంక, ఎడమవంక సాపేక్షికంగా మారుతూ ఉండడాన్ని విస్మరించలేరు.

### విశిష్ట పరిస్థితులు

అంతేకాక ఒక ప్రత్యేక దేశం దాని పరిస్థితుల ఆధారంతో ఒక అమూర్తభావనతో వాదన యొక్క సమతౌల్యాన్ని నిర్ణయించడం కష్టం. యునైటెడ్ కింగ్‌డమ్ ఇటీవలి చరిత్ర సామాన్య బహు ప్రాతినిధ్య విధానంలోని లోపాలను బయటపెట్టింది. అలాగే ఇటీవలి ఇటలీ చరిత్ర పూర్తిగా నిష్పత్తి ప్రధానమైన విధానంలోని లోపాలను బయటపెట్టింది. నిష్పత్తి ప్రాతినిధ్య విధాల మధ్య సుస్పష్టమైన సంబంధం పార్టీ అభివృద్ధి దాని విస్తృత ఏర్పాటు సందర్భంపై ఆధారపడినా నియోజక ప్రాతినిధ్యాన్ని బలపరచే ఏదైనా విధానం కొంత నిష్పత్తి ప్రాతినిధ్య విధానంతో సమతౌల్యస్థితిని సాధిస్తే ఎక్కువ ఉపయోగకరంగా ఉండవచ్చు.

## 31. ఎన్నికల ప్రవృత్తిలో స్వచ్ఛతని ఎలా గ్యారంటీ చేయవచ్చు ?

ఎన్నికల ప్రవృత్తి స్వచ్ఛతను భంగపరచగలిగిన అవకాశాలు మూడు ఉన్నాయి. మొదటిది అధికారంలో ఉండడం ద్వారా ఒక పార్టీ పొందే సానుకూలత. దీనిని పూర్తిగా తొలగించడం ఎప్పుడైనా అసంభవమే. కాని దీనిని అనేక మార్గాలలో అత్యల్పం చేయవచ్చు. ముఖ్యమైనది ఎన్నికల ప్రవృత్తిని మొత్తాన్ని - నియోజకవర్గాలను ఏర్పరచడం మొదలు, ఓటర్ల నమోదు, ప్రచారం, ఎన్నిక, ఓట్ల లెక్కింపు వరకు అన్ని పార్టీల యొక్క ఆమోదం పొందిన ఒక స్వతంత్ర ఎన్నికల కమిషన్‌చే పర్యవేక్షింపబడడం. ఆ సంఘం విధులలో ఒకటి అన్ని పార్టీలకు ప్రజా యాజమాన్యంలోని ప్రచార సాధనాల అందుబాటు సమానంగా ఉండేటట్లు చూడడం. పార్టీ వ్యవస్థ, ప్రభుత్వ వ్యవస్థ భిన్నంగా ఉండాలి. ఎన్నికల ప్రచార సమయంలో మంత్రులు శాంతి భద్రతల హామీకొరకు తప్ప మిగిలిన అధికారిక విధులను పూర్తిగా వదలివేయాలి.




న్యాయపద్ధతికి, స్వేచ్ఛకి ప్రమాదం - లంచగొండితనం,భయపెట్టడం,
ఒకరి ఓటు మరొకరు వెయ్యడం

## ఎన్నికల సంబంధమైన దురాచారాలు

రెండవ ప్రమాదం ఎదిరింపు. నియోజక ప్రవృత్తిలో పార్టీ సభ్యుల యొక్క, వారి మద్దతుదారుల యొక్క అవినీతి, భయపెట్టడం, ఒకరి ఓటు వేరొకరు వేయడం, రెండుసార్లు ఓటు వేయడం మొదలైన దురాచారాలు అవినీతివల్ల వస్తాయి. వీటిని అరికట్టడానికి అభ్యర్థుల యొక్క రక్షణకు తగినంత సిబ్బంది - పోలీసు, ఎన్నికల అధికారులు, ఎన్నికల ప్రవృత్తిలో స్వచ్ఛతకై ఏర్పాటు చేయబడాలి. ఇందులో అతి ముఖ్యమైనది ఎన్నికల అధికారుల యొక్క స్థాయి వారి నియామకం, శిక్షణ స్వతంత్రం కలిగిన జాతీయ ఎన్నికల కమిషన్ చేతిలో ఉండాలి అనుభవజ్ఞులైన అంతర్జాతీయ పరిశీలకులు ఉండడం స్వచ్ఛతకు ప్రత్యేకంగా దోహదం చేస్తుంది నిజంగా ప్రజాస్వామ్య దేశాల జాతీయ ఎన్నికలలో వారినొక భాగంగా చేయాలని ఒక గట్టి వాదన ఉంది. వారు స్వచ్ఛంగా ఎన్నికలు జరపడానికి హామీ నివ్వగలరు అత్యుత్తమమైన ఎన్నికల ఆచారాలని, పద్ధతులని పంచగలరు

## ధనం యొక్క ప్రభావం

చివరి ముఖ్య ప్రమాదం పార్టీకికాని, ఒక అభ్యర్థికికాని ధనం లేదా ధనవంతుల మద్దతు అధికంగా అందుబాటు. దీనిని నివారించడానికి ఎన్నికల ఖర్చుపై కఠినమైన మితిని నిర్ణయించడం అభ్యర్థులకు పార్టీలకు దేశమంతటా స్థానికంగా కూడా అందరికీ ప్రజా యాజమాన్యంలోని ప్రచార సాధనాల అందుబాటును కలిగించడం అవసరం. దీనికి ఎన్నికల సంఘం లేదా అటువంటి ప్రతిపత్తి కలిగిన సంస్థయొక్క సూచనలు ఆధారం కావాలి.

## అభిప్రాయ సేకరణ

చాలా దేశాలలో ఎన్నికల స్వచ్ఛతకు అభిప్రాయ సేకరణ యొక్క అవసరం చర్చించబడుతోంది కొన్ని దేశాలలో అభిప్రాయ సేకరణ వివరాలను, ఫలితాలను ఎన్నికకు వారం ముందుగాని లేక ఎన్నికల సమయంలోగాని ప్రచురణ చేయకూడదన్న చట్టం చేయబడింది. ఈ ఫలితాలు నియోజకుల మనసు మార్చవచ్చునన్న ఉద్దేశ్యం ఈ చట్ట నిర్మాణానికి కారణం. దీనివల్ల 'బ్యాండ్ వేగన్' లేదా 'కౌంటర్ బ్యాండ్ వేగన్' అనే పరిణామాలు రావచ్చు సమస్యల ఆధారంగాకాక వస్తుందనుకోబడే ఫలితం ఊహ ఆధారంగా అనారోగ్యకారకమైన, కేంద్రీకృతమైన సాంద్రతను ఈ అభిప్రాయ

సేకరణలు ప్రోత్సహిస్తాయి. కాని చాలామంది నిపుణులు ఓటింగుపై అభిప్రాయ సేకరణ ప్రభావాన్ని గురించి సందేహాలను వ్యక్తం చేస్తున్నారు. నిజానికి ప్రజలకు అంతర్జాతీయ ప్రచార సాధనాలు అందుబాటులో ఉన్నప్పుడు దేశంలోని అభిప్రాయ సేకరణను అణగద్రొక్కి ఉపయోగం లేదని అంటున్నారు.

## 32. రాజకీయ పార్టీలకు ప్రజలే నిధులు సమకూర్చాలా ?

ప్రజలే రాజకీయ పార్టీలకు నిధులు సమకూర్చాలనడంలో ముఖ్య వాదన ఏమంటే పార్టీలు ప్రజాస్వామ్య విధానంలో ముఖ్య రాజకీయ పాత్రని నిర్వహిస్తున్నాయన్నది. దీనిని ఆర్థిక మద్దతుతో గుర్తించాలని రాజకీయ ప్రవృత్తితో స్వార్థ ప్రయోజనాలకొరకు చేసే శక్తివంతమైన శక్తుల ప్రభావాన్ని తగ్గించడానికి ప్రజలే పార్టీలకు నిధులను సమకూర్చాలని ఒక వాదం. పార్టీలకు వారు వారు సాధించిన ఓట్ల నిష్పత్తిలో నిధులు ఇవ్వాలి. ఏ పార్టీ అయినా ఒక వర్గానికి పౌర, రాజకీయ హక్కులను లేకుండా చేస్తే, లేదా చేయడానికి ప్రయత్నిస్తే, లేదా ఎన్నికల దురాచారాలకు పాల్పడితే అట్టి పార్టీలకు నిధులు నిరాకరించాలి.

### పార్టీ స్వయంప్రతిపత్తి

ప్రజలు నిధులు సమకూర్చడానికి ప్రతిగా - రాజకీయ పార్టీలు క్రింద నుంచి ప్రజాభిప్రాయానికి కార్యసాధకమైన మార్గంగా ప్రభుత్వానికి దూరంగా స్వయంప్రతిపత్తి కలిగి ఉన్నప్పుడేనన్నది ముఖ్య వాదన. స్వయంప్రతిపత్తికి స్వచ్ఛందంగా ప్రజలే నిధులు సమకూర్చాలన్నది అవసరమైన షరతు. పార్టీలు స్వచ్ఛంద విరాళాలవల్ల వారి కార్యకలాపాలకు మద్దతుని పొందలేకపోతే వారిని ప్రజాపదవులకు గంభీరంగా పరిగణించనక్కరలేదు. అలాగే ప్రత్యేక ప్రయోజనాల తగని ప్రభావాన్ని పార్టీలకిచ్చే విరాళాలపై బహిరంగంగా ఒక మితిని విధించాలి. అంతేకాక సంస్థాపరమైన మద్దతుదారులు సమకూర్చే నిధులకు వారి వారి సభ్యుల షేర్‌హోల్డర్‌ల స్పష్టమైన అంగీకారాన్ని పొంది ఉండాలి.

### నియమిత ప్రజామద్దతు

సుస్థిరమైన చాలా ప్రజాస్వామ్యాలు స్వచ్ఛంద వనరుల వలనే వారి పార్టీలు నడపబడటాన్ని ఆశిస్తాయి కాని ఇది జాగ్రత్తగా నిర్వచింపబడిన పార్టీ శ్రేణులలో శిక్షణ, ఎన్నికల సమయంలో ప్రజాయాజమాన్యంలోని ప్రచార సాధనాలను స్వేచ్ఛాయుతమైన

అందుబాటు మొదలైన వాటికి నియమితంగా ప్రజాధనాన్ని ఇవ్వడం మినహాయించనక్కరలేదు పార్టీలు క్రొత్తగా స్థాపించబడుతున్నప్పుడు, పోటీలో అనుభవం లేనివయినప్పుడు ప్రజాస్వామ్యంపట్ల మార్పుకు సంధి సమయం అయినప్పుడు ఇట్టి ఆర్థిక సహాయం ప్రత్యేకంగా అవసరమౌతుంది.

## 33. ఎన్నికైన ప్రతినిధులు వారి పార్టీ విధేయతను ఎన్నికల మధ్య మార్చుకోవడాన్ని అనుమతించాలా ?

కూడదు ఒక పార్టీ తరఫున ఎన్నికలలో పోటీచేసి నెగ్గిన అభ్యర్థి పదవీకాలంలో కార్యసాధకంగా ఆ పార్టీకి కట్టుబడి ఉండవలసినదే అలాకాకపోతే రెండు విధానాల పోకడల ప్రణాళికల మధ్య ఎవరికి ఓటు చేయాలి అనే ఎంపిక అర్థరహితమౌతుంది. నియోజకవర్గం ఆధారంగా ఉన్న ఏ ఎన్నికల పద్ధతిలో అయినా పార్టీ విధేయత మార్చుకొంటే అలా చేయడం పదవికి రాజీనామా చేసిన తరువాతే చేయాలి. రాజీనామా చేసి మరొక పార్టీ సభ్యునిగా ఉప ఎన్నికలలో పోటీ చేయాలి.[5] జాబితా విధానంలో అతడు/ ఆమె రాజీనామా చేసి ఆ జాబితాలో తరువాత అభ్యర్థికి స్థానాన్ని ఇవ్వాలి

## 34. ఓటర్లకు ఎన్నికల మధ్య ఏమైనా అధికారం ఉంటుందా ?

నాలుగు, అయిదు ఏళ్ళకొకసారి మాత్రమే ఓటువేసే రాజకీయ హక్కు ఉంటుంది కాబట్టి ఎన్నికలకి, ఎన్నికలకి మధ్య ఓటర్లు శక్తి లేనివారని భావించడం పొరపాటు. పాలించే పక్షాలలో భవిష్యత్తులో నియోజకులను మళ్ళీ ఎదుర్కోవాలన్న భావన ఒక ముఖ్యమైన క్రమశిక్షణను ఏర్పరుస్తుంది. సదా వారు ప్రజాభిప్రాయాన్ని సంప్రదించాలని నిర్బంధిస్తుంది మరొకలా చెప్పాలంటే ఎన్నికలు వాటి పొడిగాటి నీడలని ముందుగానే ప్రసరింపజేస్తాయి. అధికారంలో ఉన్న పార్టీ ఉప ఎన్నికలో ఓడిపోతే విధానంలోను, నాయకత్వంలోను నాటకీయమైన మార్పులకి దారితీయవచ్చు అంతేకాక ఎన్నికల మధ్య ప్రభుత్వంపై ప్రత్యేక సమస్యలను గురించి వత్తిడి తీసుకురావచ్చును ఒత్తిడితెచ్చే

---

5 భారతదేశంలో పార్టీలో ఎన్నికైన సభ్యులలో మూడింట ఒక వంతు కంటె తక్కువమంది పార్టీ మార్పిడి చేస్తే దానిని పార్టీ ఫిరాయింపుగా పరిగణిస్తారు ఫిరాయింపు వ్యతిరేక చట్టప్రకారం ఆ సభ్యులు వారి శాసనసభలో సభ్యత్వాన్ని కోల్పోతారు కాని అంతకంటె ఎక్కువ సంఖ్యలో సభ్యులు అలా కోరితే వారు వేరే పార్టీని ఏర్పరచుకోవడంకాని, మరొక పార్టీలో చేరడంకాని చేయవచ్చు

వర్గాలలో సభ్యత్వం, స్వచ్ఛంద సంఘాలలో సభ్యత్వం ప్రజా ప్రచారానికి దోహదం చేయడం, ప్రతినిధులతో, ప్రభుత్వ సభ్యులతో సంపర్కం, బహిరంగ ప్రదర్శనలలో పాల్గొనడం మొదలైన వివిధమైన అవకాశాలు ఓటర్లకి ఉన్నాయి. ప్రజాభిప్రాయాన్ని సదా వ్యవస్థీకరించి వ్యక్తీకరించడానికి ప్రచార సాధనాలు నిర్ణయాత్మకమైన పరికరాలు.

## 35. ప్రజాభిప్రాయ సేకరణ (రిఫరెండమ్) ప్రజాస్వామ్యంలో ఎప్పుడు నిర్వహించాలి ?

రాజ్యాంగంలో ఒక మార్పును తీసుకురావడానికి[6] లేక రాజ్యాంగపరమైన ప్రత్యేకమైన ప్రయోజనం ఉన్న చట్టాన్ని చేయడానికి చాలా ప్రజాస్వామ్యాలు, కొన్ని సందర్భాలలో విశేష అధిక సంఖ్యాకతతో - రిఫరెండమ్‌ని నిర్వహించాలి. కారణమేమిటంటే రాజ్యాంగం ఆనాటి ప్రభుత్వానికి పార్లమెంటు సభ్యులకి మాత్రమే కాక ప్రజలందరిదీ కావడమే. అందుచేతనే మార్పుకి ప్రజలందరి ప్రత్యేక ఆమోదం కావాలి.

### ఇతర చట్టాలపై ప్రజాభిప్రాయ సేకరణలు (రిఫరెండం)

ఇతర విధానాల సమస్యల లేదా చట్టాలపై రిఫరెండం ఇంకా చర్చించదగినదే. ప్రజలకు ముఖ్యాంశాలపై వేరుగా అభిప్రాయాన్ని వ్యక్తీకరించడానికి రిఫరెండమ్ ఒక ముఖ్యమైన ప్రజాస్వామిక పరికరమని, అది లేకపోతే పార్టీ యొక్క సాధారణ ఎన్నికల ప్రణాళికలో ప్రజాభిప్రాయం గుర్తింపబడకుండా పోతుందని రిఫరెండమ్ ఉపయోగానికి ఊనికనిచ్చేవారు వాదిస్తారు. దీనికి ప్రతిగా రాజకీయ నిర్ణయాలలో చాలా విషయాలలో ఒకదానికొకటి పరస్పర సంబంధాన్ని కలిగి ఉండేవి గనుక (ఉదా : పన్నుల విధింపు - ప్రజాధన వినియోగం) సందర్భంలో నుండి తొలగించి ఒక విషయాన్ని తీసుకొని దాని కొరకై నిర్ణయం తీసుకోమని ప్రజల ముందుంచడం స్వైరమని వాదించవచ్చు. రిఫరెండమ్ నిర్వహించడమంటే ఆచరణలో ఎన్నికైన ప్రతినిధుల జవాబుదారీని హెచ్చించడం కాక తగ్గించడం. అంతేకాక అది ప్రాతినిధ్య ప్రవృత్తిపై అవిశ్వాసాన్ని ప్రకటించడం.

### సరి అయిన సమాధానం లేదు

సరి అయినకాని, సరికాని సమాధానంకాని లేని సమస్యలలో ఇది ఒకటి. వారి వారి సంప్రదాయాలను అనుసరించి ప్రజాస్వామ్యాలు వివిధ ఆచారాలను అనుసరిస్తాయి.

---

6 పార్లమెంటు రెండు సభలలో మూడింట రెండు వంతుల సభ్యులు సవరణ(ల)ని బలపరిస్తే భారత రాజ్యాంగాన్ని సవరించవచ్చు

3

# బహిరంగ జవాబుదారీ ప్రభుత్వం

## 36. బహిరంగ ప్రభుత్వం ప్రజాస్వామ్యానికి ఎందుచేత ముఖ్యం ?

ప్రజాస్వామ్యానికి బహిరంగ ప్రభుత్వం అత్యంత అవసరమైంది. ప్రభుత్వం యొక్క కార్యకలాపాలు వారి విధానాలు వాటివలన వచ్చే పరిణామాలు గురించి సరైన సమాచారం లేకపోతే అధికారులు జవాబుదారీ కావడానికి, పౌరులు సమాచారం పొంది నియోజక ఎంపిక చేయడానికి అవకాశం ఉండదు. కాబట్టి బహిరంగ ప్రభుత్వానికి ప్రజాస్వామ్యం అత్యవసరమైంది. అట్టి సమాచారం యొక్క అందుబాటు పౌరులకి పౌరుల తరపున ప్రచార సాధనాలకి కావాలి. ప్రభుత్వం నడవడానికి అయ్యే ఖర్చుని నియోజకులు భరిస్తారు కాబట్టి సమాచారం పొందడం ప్రభుత్వ దయగా భావించకూడదు. ప్రజలు తమ ధనం ప్రభుత్వంచే ఎలా ఖర్చు చేయబడుతోందో తెలుసుకోవాలి. ఈ విధమైన అందుబాటుని కలిగించడం అనవసర ఖర్చని విమర్శింపబడినా, అనవసర ఖర్చులను బయటపెట్టడం ద్వారా, అవినీతిని తగ్గించడం ద్వారా విధానలోపాలు విషమించకుండా వాటిని గమనించి సవరించడానికి సమాచారం దాని వంతు పని అది చేస్తుంది. పౌర హక్కుల రక్షణకు వ్యక్తులు తమపై ప్రభుత్వంగాని, అనుబంధ సంస్థలవద్దగానీ ఉన్న ఫైళ్ళు తాము చూసుకోవడానికి అందుబాటులో ఉండడమూ అవసరమే.

### బహిరంగ ప్రభుత్వ వివిధ కోణాలు

బహిరంగ ప్రభుత్వం అంటే ఏమిటి? బహిరంగ ప్రభుత్వానికి నాలుగు పేరులున్నాయి. మొదటిది, ప్రభుత్వం చేతనే ఇవ్వబడిన దాని విధానాలకు సంబంధించిన వాస్తవ సమాచారం, దానికి ఆధారమైన ఋజువులు, సాక్ష్యాలు, ఆచరణలో వాటి ఫలితాలు, వాటికైన ఖర్చు, వాటి అమలుకి సంబంధించిన నియమాలు మొదలైనవి. రెండవది,

వ్యక్తులకి, పత్రికలకు ప్రభుత్వం యొక్క దస్తావేజుల అందుబాటు ప్రత్యక్షంగా, పరోక్షంగా పార్లమెంటు ద్వారా ఇందులో వ్యక్తులకు సంబంధించిన వ్యక్తిగత ఫైళ్ళు కూడా కలిసి ఉంటాయి. మూడవది, ప్రజలకు పత్రికలకు సభల యొక్క బహిరంగత. పార్లమెంటు నుంచి ఇది ప్రజాధనం సమకూర్చబడిన సంస్థలకి స్థానిక ప్రభుత్వానికి వర్తిస్తుంది నాలుగవది, విధానాల రూపకల్పన, అమలు విషయాలలో సంబంధిత ప్రయోజనాలు పొందేవారితో ప్రభుత్వ సంప్రదింపులు అలా పొందిన సమాచారాన్ని ప్రచురించడం

## న్యాయబద్ధమైన మినహాయింపులు

ఈ బహిరంగ ప్రభుత్వ నియమాలకు మినహాయింపులేమైనా ఉన్నాయా? ఈ తరగతుల సమాచారం న్యాయబద్ధంగా రహస్యంగా ఉంచదగినదని సామాన్యంగా సమర్థింపబడినది మంత్రివర్గ చర్చలూ, మంత్రులకు పౌర అధికారులిచ్చే రాజకీయ సలహాలు దేశం యొక్క రక్షణకు ముప్పు వాటించగల సమాచారమూ, ప్రజాస్వామ్య విధానం లేదా వ్యక్తుల ఆంతరంగిక భద్రతకు సంబంధించిన విషయాలు ప్రైవేటు యాజమాన్యంలోని వ్యాపార సంస్థల రహస్యాలు. (సంబంధించిన వ్యక్తులకు తప్ప) వ్యక్తిగత ఫైళ్ళు

## 37. బహిరంగ ప్రభుత్వాన్ని పొందడం ఎలా ?

20వ శతాబ్దపు ముందున్న నియమిత ప్రభుత్వ యుగంలో పత్రికలకి స్వేచ్ఛ హామీ ఇవ్వబడితే బహిరంగ ప్రభుత్వం సాధ్యపడుతుందని భావించారు. ఈ రోజుల్లో ఇంకా జటిలమైన విస్తృతమైన ప్రభుత్వ కార్యకలాపాల నేపథ్యంలో రక్షణ పొందిన పత్రికల స్వేచ్ఛ అవసరం పత్రికా రచయితల ఆధారాలను రక్షించడానికి ఏర్పరిచిన నియమాలతో సహా అవన్నీ ఇంకా సరిపోనివే ప్రభుత్వానికికాని, తత్సంబంధమైన యంత్రాంగం యొక్కగాని కార్యకలాపాలను రహస్యంగా ఉంచడానికి కారణాలు పార్లమెంటును సభ్యులను తప్పుడు నడవడి నుంచి తమను తాము రక్షించుకోవడం. చిన్నబోవలసిన అవసరాన్ని ఆపడం మొదలైనవి. ఈ పోకడ బహిరంగ ప్రభుత్వంచేత సమాచారాన్ని పొందడానికి స్వేచ్ఛను గురించిన చట్టాలు చేయబడడంవల్ల కార్యసాధకంగా నివారింపబడుతోంది.

## సమాచార స్వేచ్ఛ

సమాచార స్వేచ్ఛకు నమూనా చట్టం ఎలా ఉండాలో అందులో అత్యుత్తమ ఆచారాలను

వివరిస్తూ అమెరికా సంయుక్త రాష్ట్రాలు, స్వీడన్ ఇచ్చాయి. ఇంతవరకు చెప్పబడిన విషయాలన్నీ అందులో ఉన్నాయి. (చూ. ప్ర. 36) ప్రభుత్వ వెల్లడి విధి, పత్రాలకు ప్రజా అందుబాటు హక్కు, ప్రజాసంస్థల, సభల బహిరంగత 'ఈల వేసేవారికి' (పత్రికా రచయితలకు) రక్షణ, కొంతమంది ప్రభుత్వ సేవలో ఉండి చట్ట విరుద్ధతను అవినీతికి సంబంధించిన సాక్ష్యాధారాలను బయటపెడతారు. ఇట్టి చట్ట నిర్మాణం పార్లమెంటు శాసనసభ కార్య నిర్వహణాధికారుల చర్యలను పరీక్షించే హక్కును ఎక్కువ చేసే ప్రక్రియగా గుర్తించాలి. అట్టి చట్ట నిర్మాణానికి లక్షణం ఏమంటే వెల్లడికి మినహాయింపులు (దేశభద్రత ఆంతరంగికతను రక్షించడం వంటివి) న్యాయస్థానాల పరిధిలో తప్ప ప్రభుత్వ పరిధిలో ఉండకూడదు

## ప్రజాసంబంధ ఖర్చులు

మరొక రెండు సమస్యల గురించి చెప్పవలసి ఉంది. మొదటిది ఆధునిక ప్రభుత్వాలు. పౌర సంబంధాలకు చాలా ఎక్కువ బడ్జెట్‌లను (నిధులను) కేటాయిస్తాయి ఇందులో ప్రభుత్వ విధానాల సమాచారమే కాక దాని సమయ నిర్ణయము ప్రభావాన్ని ఎక్కువ చేయగల అందించడంలో విధానం కొంత ఎంచిన సమాచారాన్ని బహిర్గతం చేయడం - ఇవన్నీ ప్రజాభిప్రాయాన్ని మర్దన చేసే ఆయుధశాలలోని పరికరాలే. ఈ ఆచారాలు స్వతంత్రమైన ప్రభుత్వ సమాచారం అందుబాటుకి, పరీక్షకి హామీని ప్రత్యేకంగా కీలకమైనదిగా చేస్తాయి. ఇక్కడ ప్రత్యేక ప్రాముఖ్యం కలది స్వచ్ఛందంగా పనిచేసే ప్రజాగణాంకసేవ, దీనినుంచి ప్రభుత్వమూ, పార్లమెంటూ, ప్రజలూ సమానంగా సమాచారాన్ని తీసుకోగలరు.

## ప్రజా సంప్రదింపు

చివరగా, బహిరంగ ప్రభుత్వమనే భావన సామాన్య సమాచార హక్కు కంటే చాలా విశాలమైనది. వారి వారి విధానాలను బహిరంగంగా సమర్థించడానికి మంత్రుల యొక్క అందుబాటు విధానాల ఏర్పాటు అమలులో ప్రభుత్వం ఎంత అంశతో ప్రజలని సంప్రదించాలని అన్నది ప్రజా సంప్రదింపులు చేరి ఉన్నాయి. ఇందులో రెండవది - కావలసిన మితులు, సంప్రదింపు పద్ధతులు సంబంధిత పార్టీల యొక్క ఋజువుల ప్రచురణ పరిసరాలపై ప్రభావంలాంటి విషయాలలో చట్ట నిర్మాణానికి సంబంధించినది. బహిరంగత అంటే కేవలం వినడానికి సంసిద్ధత మాత్రమే కాక సరియైన సమాచారానికి

అందుబాటు ఏర్పాటు చెయ్యడం కూడా కలిసి ఉంటుంది.

## 38. జవాబుదారీ గల ప్రభుత్వం అంటే ఏమిటి ?

జవాబుదారీ గల ప్రభుత్వం అనే భావనలో మూడు కోణాలున్నాయి.

### న్యాయ సంబంధమైన జవాబుదారీ

మొదటిది **న్యాయసంబంధమైన జవాబుదారీ** : ఎన్నికైన, ఎన్నికకాని ప్రజాధికారులు వారి చర్యల చట్టబద్ధతకు కోర్టులకు జవాబుదారీగా ఉంటారు. ఇక్కడే 'సమనయ న్యాయం' యొక్క మౌలికమైన అర్థం ఉంది. ఎవరు చట్టాన్ని తయారుచేసి అమలుచేస్తారో వారు కూడా రాజ్యాంగం పరిధిలోను - చట్టంలో నిర్వచించి నియమితం చేయబడిన అధికారాల ఆధారంగా మాత్రమే చర్యలు తీసుకోవాలి.

### రాజకీయ జవాబుదారీ

రెండవ కోణం రాజకీయ జవాబుదారీ : ప్రభుత్వం లేదా కార్యనిర్వహణశాఖ పార్లమెంటుకి, ప్రజలకి వారి విధానాల సమర్థనీయతకీ, వారి ప్రాముఖ్యతల క్రమానికీ, అమలుచేసే విధానాలకీ జవాబుదారీ, మొదటిది. న్యాయబద్ధమైన జవాబుదారీ ప్రజాధికారులు కోర్టుల మధ్య సాపేక్షంగా సామాన్య నిర్మితి గలదే. కానీ రాజకీయ జవాబుదారీ చాలా జటిలమైనది. జాతీయ స్థాయిలోని ఎన్నుకోబడని విభాగాలు (పౌర అధికారులు, సాయుధ దళాలు, పోలీసు, భద్రతా సేవలూ) ఎన్నికైన కార్యనిర్వహణాధిపతికి ఆయునచే నియమించబడిన మంత్రుల ద్వారా జవాబుదారులౌతారు. ప్రధాన కార్యనిర్వహణాధికారి మంత్రులు వారి వంతున నేరుగా నియోజక ప్రవృత్తి ద్వారా ప్రజలకు వారి ప్రతినిధులుగా వర్తిస్తున్న పార్లమెంటుకీ శాసనసభకీ జవాబుదారులు. శాసనసభా సభ్యులు వారి నియోజకులకు జవాబుదారులు.

### విత్త సంబంధమైన జవాబుదారీ

**మూడవది ఇరుకైన విత్త సంబంధమైన జవాబుదారీ** : శాసనసభచే ఆమోదింపబడిన పన్నుల విధింపు వలన వచ్చిన ఆదాయాన్ని జాగ్రత్తగా కార్యసాధన వెల విధానంలో ఖర్చు చేయడం విషయంలో జవాబుదారీ ఇక్కడ జవాబుదారీ మార్గం రాజకీయ జవాబుదారీ మార్గం వలెనే ఉంటుంది. కానీ అదనంగా పార్లమెంటరీ జవాబుదారీ

అయిన ఆడిటర్ జనరల్ కార్యాలయానికి కూడా జవాబుదారీగా ఉంటుంది. ఈ కార్యాలయం స్వతంత్రంగా ప్రభుత్వ వ్యయాన్ని వివరంగా వృత్తిపరంగా పరీక్షిస్తుంది.

## జవాబుదారీ ప్రజా నియంత్రణ

ఈ వివిధ జవాబుదారీ మార్గాలు రెండవ చిత్రంలో రేఖా స్వరూపంలో వివరింపబడ్డాయి. ఇందు ప్రతీదీ ప్రభుత్వంపై ప్రజానియంత్రణ నియమానికి దోహదం చేస్తుంది. కాని విత్త సంబంధమైన, న్యాయ సంబంధమైన జవాబుదారీలు వృత్తిపరమైన ఆయా సంస్థల చేతనే అత్యుత్తమంగా అందించబడతాయి. ఇవి ప్రత్యక్షమైన ప్రజా లేక రాజకీయ ప్రభావాలకి తగిన అంశతో నిరోధకాలుగా పనిచేస్తాయి. ఇవి వృత్తిపరమైనవారి ఆచరణాస్మృతికే జవాబుదారీలుగా ఉంటాయి. చివరకు ఎలాగైనా కోర్టుచే అమలుపరిచే చట్టం - ఆడిటర్ జనరల్ పరీక్షించే వ్యయం - ప్రజలచే ఎన్నుకోబడిన పార్లమెంటు మీదే ఆధారపడి, రాజ్యాంగబద్ధంగా పనిచేయాలి కాబట్టి. రాజకీయ జవాబుదారీయే అతి ముఖ్యమైనది.




చిత్రం 2 : జవాబుదారీ మార్గాలు

## 39. అధికార విభజన ఎందుకు ముఖ్యమైనది ?

ప్రజాస్వామ్యాలలో ప్రభుత్వం మూడు శాఖలుగా విభజింపబడింది. విధానాన్ని ఏర్పరిచి అమలుచేసే **కార్య నిర్వహణ శాఖ** (ఒక్కోసారి దీన్ని సరళంగా. ప్రభుత్వం అంటారు) చట్టాన్ని, పన్ను విధింపుని కార్యనిర్వహణను పరిరక్షించడానికి బాధ్యత వహించవలసిన **శాసనశాఖ** (దీనిని పార్లమెంట్ అనీ ప్రాతినిధ్య సభ అనీ లేక జాతీయ సభ అనీ అంటారు) చట్టాన్ని, పాలించడాన్ని, వ్యతిరేకించినవారిని శిక్షించడానికి, చట్టాలకు విధేయతను పరిరక్షించే బాధ్యతగల **న్యాయశాఖ** (లేదా న్యాయస్థానాలు) మీద చెప్పబడిన (చూ.ప్ర. 38) వివిధ జవాబుదారీలను పొందడానికి ఈ మూడు శాఖల విభజన అత్యంత ఆవశ్యకం. న్యాయస్థానాలు శాసనసభకి, కార్యనిర్వహణ శాఖకి స్వతంత్రులు కాకపోతే భయానికి, ఉపకారానికి అతీతంగా ఉండకపోతే ప్రజాధికారులు చట్టపరిధిలోనే వ్యవహరించడానికి కృషి చెయ్యలేదు. పార్లమెంటుకి చట్ట నిర్మాణంలో పన్నుల విధింపులో కార్యనిర్వహణశాఖని పరీక్షించడంలో స్వతంత్ర అధికారాలు లేకపోతే ప్రభుత్వం యొక్క రాజకీయ విత్త సంబంధమైన జవాబుదారీ నియోజకులకు తీవ్రంగా బలహీనమయిపోతుంది.

### వివిధ విధానాలు

కార్యనిర్వహణశాఖ - శాసనశాఖ మధ్యా అధికారాల విభజన అన్ని ప్రజాస్వామ్యాలలోనూ ఉన్నా, వివిధ రాజకీయ విధానాలలో అది వేరు వేరుగా పరిగణించబడుతుంది. అధ్యక్ష విధానంలో - ఇక్కడ ప్రధాన కార్యనిర్వహణాధికారి శాసనసభలో సభ్యునిగా కాక వేరుగా ఎన్నుకోబడతాడు. ఈ విధానంలో రెండు శాఖల మధ్య విభజన స్పష్టంగా నిర్వచించబడింది. ప్రధానమంత్రి విధానంలో పార్లమెంటులో మెజారిటీగలిగిన పార్టీ నాయకుడు ముఖ్య కార్యనిర్వహణాధికారిగా ఎన్నుకోబడతాడు. ఆ వ్యక్తికి అటు కార్యనిర్వహణశాఖకు అధిపతిగా ఇటు పార్లమెంటులో అధిక సంఖ్యాకులకు నాయకుడిగా వ్యవహరిస్తాడు. కనుక ఆ వ్యక్తికి రెండు శాఖలలోను చెరోకాలూ ఉంటుంది.

### అధ్యక్షతా విధానం

ప్రతీ విధానానికి కొన్ని సానుకూలతలూ, కొన్ని అసానుకూలతలూ ఉంటాయి. అధ్యక్ష విధానం రాజకీయ పార్టీలలో వ్యవస్థకు సంబంధించిన అంశాలు రెండు శాఖల మధ్యా

పార్టీ నియంత్రణ యొక్క సమతౌల్యాన్ని అనుసరించి మారుతూ ఉన్నది అయినప్పటికీ శాసనసభకు కార్యనిర్వహణశాఖకు నియంత్రణచేసే ప్రయత్నం ఒక సానుకూలత దీనితోపాటు వచ్చే ఒక అసానుకూలతా ఉంది. కార్యనిర్వహణశాఖ అవసరమైన చట్టాన్ని, పన్ను విధింపునీ ఎన్నుకోబడిన విధానాలను కొనసాగించడానికి వీలులేకుండా అసమర్ధమయిపోవడం. దీనిని 'గ్రిడ్ లాక్' ప్రభుత్వమని అంటారు. తీవ్ర పరిస్థితులలో ఈ విభజన రెండు శాఖల మధ్య ఘర్షణకు దారి తీయవచ్చును. దానివలన అధ్యక్షుడు శాసనసభా వ్యతిరేకంగా ప్లెబిసైటరీ తిరుగుబాటుకి వ్యతిరేకంగా సైన్య నియంత్రణతో పాటు నేరుగా ఎన్నుకోబడిన కారణంగా తన ప్రత్యేక అధికారాలని ఉపయోగించే ప్రలోభానికి లొంగవచ్చును.

### పార్లమెంటు - కార్యనిర్వహణ శాఖ

ప్రధానమంత్రి విధానంలో ఒక సానుకూలత ఉంది. కార్యనిర్వహణా విధానాన్ని అవసరమైన చట్టమూ, పన్ను విధింపులతో సమన్వయం చేయగల సమర్థతలోను. పార్లమెంటుకి వ్యతిరేకంగా కార్యనిర్వహణ శాఖ తిరుగుబాటును అసాధ్యం చేయడంలో (ఈ లక్షణం ప్రజాస్వామ్యానికి ప్రత్యేకంగా సంబంధించినట్లు ఇటీవలే స్థిరమైనది) ఉంది. ఈ సానుకూలత దీనికి ప్రతిగా ఒక అసానుకూలత కూడా ఉంది పార్లమెంటులోని లోపాలను బహిర్గతం చేయడంకంటే (పార్లమెంటు సభ్యులూ, వారి స్థానాలు భవిష్యత్తులో పదవీ ఉన్నత అవకాశాలు పార్లమెంటు మీదే ఆధారపడి ఉంటాయి కాబట్టి) పార్లమెంటు అధిక సంఖ్యాకతా సభ్యులు ప్రభుత్వంపై నమ్మకాన్ని పెంచడానికే ప్రయత్నిస్తారు కాబట్టి, పార్లమెంటరీ ఎజెండాను కార్యనిర్వహణశాఖ అదుపుచేసే సామర్థ్యంలో దాని పరీక్షావిధిని నియమితం చేయుడంలో దీని అసానుకూలత ఉంది.

## 40. సమనయ న్యాయం ఏమిటి ? దీనికి హామీని ఎలా కలిగించవచ్చు ?

ఎన్నికైన లేక ఎన్నికకాబడని ప్రభుత్వ అధికారులందరూ చట్టము, రాజ్యాంగాల పరిధిలో మాత్రమే చట్టబద్ధంగా నిర్వచించబడి నియమితం చేయబడిన ఆధారంతోనే నడచుకొని చర్యలు తీసుకోవాలనే నియమాన్ని సమనయ న్యాయం తనలో ఇముడ్చుకుంటుంది. (చూ. న్యాయబద్ధమైన జవాబుదారీ ప్ర. 38) ఈ నియమం యొక్క పుట్టుక ఉత్తమ

ప్రభుత్వం సమనయ న్యాయంతో మానవ న్యాయంకంటే మీదది కాదన్న అరిస్టాటిల్ ఆలోచనలోనే ఉంది. దాని ఆధునిక రూపంలో ఈ నియమం రాజు యొక్క రాజ్యాధికారుల యొక్క స్వైరబుద్ధిని నియమితం చేసే ఘర్షణ. కార్యనిర్వహణాధికారానికి చట్ట సంబంధమైన అధీకృతం కోరడంవల్ల సంక్రమణం చెందింది.

## ప్రజాస్వామ్యం - సమనయ న్యాయం

సమనయ న్యాయం వ్యక్తిగత స్వేచ్ఛకు ప్రజాస్వామ్యానికి పునాదిరాయి. ఇది లేకుండా కార్యనిర్వహణశాఖ నుండి వ్యక్తిగత హక్కులకు రక్షణ ఉండదు. ప్రజాస్వామ్య రాజ్యాంగం ఎన్నికైన శాసనసభలూ చట్టానికి జన్మస్థానాలు కాబట్టి ప్రజాస్వామ్యాలలో కార్యనిర్వహణశాఖ దానిని పాలించడం అత్యవసరం కావాలి. 'జాతీయ ప్రయోజనమని' తత్కాల ప్రజా ఒత్తిడికాని పద్ధతులను న్యాయపరమైన క్రమబద్ధతను తప్పించుకోబోవడం అప్రజాస్వామికంగా ఎంచాలి.

## న్యాయశాఖ యొక్క స్వతంత్రత

సమనయ న్యాయం - దానిని నిలబెట్టడానికి స్వతంత్రమైన న్యాయశాఖ ఉన్నంత మేరకే కార్యసాధకం కాగలదు. ఐక్యరాజ్య సమితి యొక్క న్యాయశాఖ మౌలిక నియమాలు ఇలా చెబుతాయి. 'న్యాయశాఖ యొక్క స్వతంత్రతకు ప్రభుత్వం హామీ ఇవ్వాలి. అది రాజ్యాంగంలోను దేశంనందలి చట్టాలలోను పొందుపరచబడాలి. ఈ స్వతంత్రత సామూహికమైనదీ, సంస్థాపనమైనదీ. కార్యనిర్వహణాశాఖ కలుగజేసు కోటానికి అతీతంగా వారి వారి విధులను భయాభీష్టాలకు అతీతంగా న్యాయాధిపతుల వైయ్యక్తిక స్వతంత్రం కూడా ఉండాలి. ఈ రెండు రకాల స్వేచ్ఛా రాజ్యాంగం ఇచ్చిన హామీ కంటే ఎక్కువనే కోరుకొంటాయి. వారి నియామకాలు కార్యనిర్వహణశాఖ లేదా ప్రభుత్వం చేతిలో ఉండకూడదు. అవి పార్లమెంటు యొక్క న్యాయశాఖ చేతిలో ఉండాలి. లేదా రాజ్యాంగం ఏర్పాటుచేసిన న్యాయశాఖ కేవల సంఘం చేతిలో ఉండాలి. అలాగే న్యాయమూర్తులు ఆనాటి ప్రభుత్వంచే పదవి నుంచి తొలగించబడకుండా వారికొక పదవీకాలం ఉండాలి. అవినీతి, విధి నిర్వహణలో లోపం లేదా నడవడిలో తీవ్రమైన అభ్యంతరకర విషయాలుంటే ఒక నియమిత సంస్థచే ఒక పద్ధతిలో తొలగింపబడాలి. ఈ నియమాలే న్యాయవాద వృత్తిలోని వారికీ వర్తించాలి. ప్రభుత్వానికీ స్వతంత్రంగా ఉండటానికి సమనయ న్యాయం అవసరమే.

## 41. ప్రభుత్వ జవాబుదారీకి పార్లమెంటుకానీ, శాసనసభకానీ ఎలా దోహదం చేస్తుంది ?

కార్యనిర్వహణశాఖ యొక్క రాజకీయ - విత్త సంబంధమైన జవాబుదారీకి పార్లమెంటు కీలకపాత్రను నిర్వహిస్తుంది. మొదట చట్టాలను అమోదించి పన్నులు విధించే అధికారాల ద్వారా చట్టాలు చేయబడే ముందు వివిధ అంశాలను పరీక్షించే అధికారాలవల్ల ఈ పాత్రను నిర్వహిస్తుంది. ఇక రెండవ విషయం. కార్యనిర్వహణశాఖ పనితీరును పరిశీలించడానికి పార్లమెంటు అధికారాలు : మంత్రులను ప్రశ్నించడం పత్రాల తనిఖీ సంబంధిత ప్రభుత్వ అధికారాలని ఎదురుపరీక్ష చేయడం. ఈ విధులను పార్లమెంటు మొత్తంగాగాని ప్రత్యేక కమిటీలవల్లగాని సాధించవచ్చు.

### పార్లమెంటు సంబంధమైన కార్యసాధకత

ప్రభుత్వ జవాబుదారీని సాధించడంలో పార్లమెంటు పాత్ర కార్యసాధకత సభ్యుల మనస్తత్వాలలో స్వతంత్రతపై ఆధారపడి ఉంటుంది. సంప్రదాయసిద్ధంగా పార్లమెంటులో వారు భయాభీష్టాలకు అతీతంగా మాట్లాడటానికి వీలుగా వారి మాటలకు ప్రాసిక్యూషన్ నుంచి రక్షణ హామీలు చాలుననుకున్నారు. కానీ ఈనాటి ప్రభుత్వ కార్యకలాపాల జటిలతలో ప్రజాప్రతినిధులు కార్యసాధకంగా విమర్శించడానికి చాలినంత పరిశోధనా కార్యాలయ నదుపాయాలు బయటనుంచి విశేషజ్ఞుల సహాయమూ అవసరము. సభ్యులు వారి విమర్శక శక్తులు మొద్దయ్యేటంతగా పార్టీకి కట్టుబడిపోకూడదు. పార్టీ శ్రేణి మీద మొదట వారి ఎన్నికకు కాని తరువాత ప్రత్యేక పార్లమెంటు సంఘాలలో నియామకానికిగాని సభ్యులు ఆధారపడితే వారు పార్టీగీసిన గీత నుంచి జరిగి వరుసలో నుంచి తప్పుకోలేదు.

### ప్రతిపక్షాల పాత్ర

ఎలాగైనా ప్రభుత్వ పనితీరుని పరీక్షించడంలో వ్యవస్థీకరింపబడిన పార్టీల స్థానాన్ని మనం గుర్తించకుండా ఉండలేము. అధికారిక ప్రతిపక్షం "వేచియున్న ప్రభుత్వం" లేక పర్యాయ ప్రభుత్వంగా వ్యవహరించడమే కాకుండా నిరంతర విమర్శతో ప్రభుత్వ పరీక్షని సమన్వయం చేయాలి. ప్రభుత్వం యొక్క మంచి లక్షణాలలో సంబంధం లేకుండా అది ప్రతిపక్షం కోసమే ప్రతిపక్షమనే భావాన్ని కలిగిస్తుంది గనుక, పార్లమెంటు యొక్క పనిలో దీనిని చాలా అనాకర్షక లక్షణంగా చాలామంది పరిగణిస్తారు. ప్రత్యర్థి

బ్రిటిష్ విధానంలోను అందుండి గ్రహించబడిన పార్లమెంటులలోను ఈ భావానికి మంచి ఆధారం ఉంది. అయినా ఆధునిక ప్రభుత్వం ఏ విధంగా వ్యవస్థీకరింపబడాలో అలాగే పరీక్షా విధానాలు కూడా వ్యవస్థీకరింపబడాలి. ఈ బాధ్యత అధికారంలోని ప్రభుత్వాలకు మద్దతు ఇవ్వని అన్ని పార్టీల మీదా ఉంటుంది. వారు వారి దేశభక్తి ప్రశ్నింపబడేది కానట్టుగా నిర్భయంగా ప్రభుత్వాన్ని విమర్శించగలగాలి.

## 42. పార్లమెంటులో సభ్యత్వం ఎవరైనా పొందవచ్చునా ?

మనం ప్రతినిధులను వారి ప్రత్యేక ప్రతిభ కారణంగా కాక నియోజకుల ప్రయోజనాలను కాపాడగలరన్న విశ్వాసంతో ఎన్నుకుంటాం. వారు ప్రభుత్వ ప్రతిపాదనలను కార్యకలాపాలను పరీక్షించి ప్రభుత్వానికి మద్దతునివ్వాలి. ఆ సభ్యుడు ఏ రంగంలో నుంచి వచ్చినా తెలివైన న్యాయబద్ధమైన చిత్తశుద్ధితో కూడిన వ్యవస్థ కలిగిన భావప్రకటన చేయగలిగిన వ్యక్తి అయితే తన విధిని నిర్వర్తించగలడు. ఒకసారి ఎన్నికైతే వారి వారి విధులను కార్యసాధకంగా నిర్వహించడానికి అవసరమైన సమయం వనరులూ సభ్యులకు అందుబాటులో ఉంటాయి. క్రమంగా వారు అనుభవాన్ని సంపాదిస్తారు. నియోజక జవాబుదారీలో ఒక అవసరమైన షరతేమిటంటే ఆ పదవికి జీవితకాల హామీ ఉండకూడదు.

### వ్యక్తిగత పోటీ

కాబట్టి చాలామంది ప్రతినిధిగా పనిచేయగలిగినా చాలా కొద్దిమంది మాత్రమే వాస్తవంలో ప్రతినిధులవుతారు. ప్రాతినిధ్యం వహించడం కష్టంతో కూడుకున్న పని. అంతేకాక దీర్ఘమైనది. సుమారు విధిగా సభ్యుడు ఒక స్థిరమైన రాజకీయ పక్షానికి చెంది ఉండాలి. తరచూ స్థానిక లేదా ప్రాంతీయ స్థానాలలో ఎన్నికైన పదవీ అనుభవం కలిగి ఉండాలి. పార్టీ యొక్క ఎంపిక సంఘానికి తను సమర్థుడని నమ్మించగలగాలి. పార్టీ జాబితాలో గెలుపుకు ముందు ఒకటి రెండుసార్లు నిలిచిన విజయం రాకపోవచ్చును. ప్రజాకార్యకలాపాలూ, సమస్యలూ వీటిలో ఆసక్తి కలిగినవారూ అసామాజికమైన చాలా గంటలు పనిచేయడానికి సంసిద్ధులైనపుడే విజయాన్ని సాధించగలరు.

## 43. ఎన్నికైన ప్రతినిధులు ఆదాయం వచ్చే ఏదైనా ఉద్యోగం చేయడాన్ని అనుమతించవచ్చా ?

దీనికి అనుకూలంగా చేయబడిన వాదం ఏమిటంటే పార్లమెంటు సంవత్సరం పొడుగునా ఉండేది కాదనీ, అందులోని సభ్యత్వం పూర్తి సమయపు ఉద్యోగం కాదనీ, పార్లమెంటు ద్వారా వచ్చే ఆదాయం ప్రతిభావంతులైన వారిని రాజకీయాలలోకి ఆకర్షించలేదనీ, బహిరంగ ఉద్యోగం సభ్యులకు ఇతర సంబంధంతో సంపర్కం ఉండేటట్లు చేస్తుందనీ. ఇందులో ఏ వాదనా నమ్మించేది కాదు. సంవత్సరం పొడుగునా పార్లమెంటు సభ జరగకపోయినా అందలి పని చాలా కష్టమైనది - సదా జరిగేది - పూర్తికాలపు ప్రాతిపదిక మీదే చేయడానికి సాధ్యమైనది. ఓటర్లు ఇది ఇలా ఉంటుందని తెలుసుకొని సభ్యులు నిర్వహించే బాధ్యతలను దృష్టిలో ఉంచుకొని వారి జీతాన్ని అవసరమైన ఇతర సదుపాయాలని నిర్ణయించాలి. అతి కార్యసాధకంగా ప్రజలతో సంపర్కం ఉండడానికి సభ్యులు వారి వారి నియోజకులతో క్రమబద్ధంగా కలిసి వారు చెప్పే విషయాలను వినాలి.

### వర్గాలకు సంబంధించిన ప్రయోజనాలు

పార్లమెంటులో ప్రాతినిధ్యం వహించడానికి ప్రతినిధులకు, బయట సంస్థలు రుసుము ఇవ్వాలా? చాలా పార్లమెంటులలో ఈ ఆచారం ఉన్నా ఇది అభిలషణీయమైనది కాదు.[7] తరచుగా జాతీయ స్థాయిలో ప్రత్యేకవర్గాల వద్ద నుంచీ డబ్బు పుచ్చుకొని నియోజక ప్రయోజనాలను అంతరాత్మసాక్షిగా సభ్యులు ఎలా తీర్చగలరో అర్థం చేసుకోవడం కష్టం. అలాంటి రుసుములని నిషేధించడం కంటే అట్టి చెల్లింపులకు ఒక జాతీయ రిజిష్టర్‌ను ఉంచడం ముఖ్యం.

### పదవి నుండి తొలగింపు

ప్రతినిధి యొక్క స్థితిలో ఒక సామాన్య లక్షణం ఏమంటే నియోజకులు సభ్యుని తొలగించగలగడం. ఇది కేవలం అతని లోపంవలనే కాకపోవచ్చును. పార్టీ నాయకుడు లేదా విధానాలు ఆమోదయోగ్యం కాకపోయినపుడు అలా జరగవచ్చును. నిజానికి

---

7. భారతీయ విధానంలో చెల్లింపు ఇవ్వడం, ఇవ్వచూపడం లేదా పుచ్చుకోవడం అవినీతిగా పరిగణించబడతాయి.

విపణిలో మార్పులవల్ల ఉద్యోగుల అవసరం లేకపోయినపుడు ఇది ప్రైవేటు పరిశ్రమలోని ఉద్యోగుల తొలగింపుకి భిన్నం కాదు. రెండు రకాల పనివారూ వారు పనిచేసిన కాలాన్నిబట్టీ, జీతాన్నిబట్టీ సముచిత 'తొలగింపు జీతం' ఇవ్వబడాలి. వారికి పర్యాయ ఉద్యోగాలు పొందడానికి అవకాశం ఉండాలి. బదలాయింపు చేయబడే పింఛను హక్కులూ ఉండాలి.[8]

## 44. రాజకీయమైన అవినీతిని నిర్మూలించడం ఎలా ?

ఏ రాజకీయ విధానంలోనైనా, ఏ ప్రభుత్వ స్థాయిలో అయినా అవినీతి, స్వప్రయోజనానికి రాజకీయ పదవీ దుర్వినియోగం ఉండవచ్చును. కొన్ని ప్రజాస్వామ్యాలు వాటిని ఊహించిన పదవీ సంబంధమైన సౌకర్యాలుగా పరిగణించాయి. ప్రభుత్వం కాంట్రాక్టులూ, లైసెన్సులకీ ఉన్న పోటీ వలన ప్రజలు ప్రజాస్వామ్యం రక్షింపదగినది కాదని నమ్మే స్థాయి వరకూ అవినీతి ప్రతినిధులకు నియోజకులకి మధ్యనున్న విశ్వాసాన్ని తగ్గించి ప్రజాస్వామ్యంలో నమ్మకాన్ని చులకన చేస్తుంది. ఈ కారణం వలన దీనిని తీవ్రంగా పరిగణించి దానిని ఎప్పటికీ పూర్తిగా నిర్మూలించలేకపోయినా తగ్గించడానికి ప్రయత్నాలు జరగాలి.

### నివారణ చర్యలు

ఈ క్రింది పరిస్థితులలో రాజకీయ అవినీతి వర్ధిల్లుతుంది : ప్రజాపదవి యొక్క జీతం చాలనంతనిది అయినపుడు లేదా, పర్యాయంగా యోగ్యమైన ఆదాయానికి అది ఒకటే సామాజికమార్గం అయినపుడు, ప్రభుత్వ ఇచ్ఛా నిర్ణయాలపై ప్రైవేటురంగంలో ఆర్థిక అవకాశాలు ప్రత్యేకంగా ఆధారపడినపుడు, నేరాలు బయటపెట్టబడి శిక్షింపబడే అవకాశాలు తక్కువ అయినపుడు అవినీతి పెరుగుతుంది. ఈ పరిస్థితులకు వాటి వాటి విరుగుడు పద్ధతులను అవే సూచిస్తాయి. ప్రజా ఉద్యోగులకు ఇతరులతో పోలిస్తే చాలా ఎక్కువ కాకపోయినా సముచితంగా జీతాలివ్వడం ప్రైవేటు ఆర్థిక ఏజెంట్లపై ప్రభావం చూపే అన్ని ప్రభుత్వ నిర్ణయాలను చక్కగా నిర్వచించబడిన నియమాలకు, పద్ధతులకు లోబడి ఉండేటట్లు చూడడం బహిరంగ ప్రభుత్వాన్ని అనుమానించబడిన న్యాయ విరుద్ధతకు నిర్భయమైన న్యాయపరమైన దర్యాప్తులో కలపడం. అవినీతికి

8. భారతీయ పార్లమెంటు సభ్యులు, రాష్ట్ర శాసన సభ్యులూ ఆయా వ్యవస్థలలో పనిచేసిన కాలానుగుణంగా పదవీ విరమణ భృతిని పొందడానికి అర్హులు.

ఇతి ముఖ్య నిరోధకమేమంటే - స్వయం ప్రయోజనాన్ని అత్యధికం చేసేదైన విపణి సిద్ధాంతం తీవ్రంగా వ్యాపించకుండానే, స్వచ్ఛంద సేవా సంస్కృతి సంప్రదాయాన్ని కాలక్రమంలో పెంపుచేయడం. ముఖ్యంగా సమన్వ దీర్ఘకాలికమైనదై లోతుగా జీర్ణించుకుపోయినపుడు మీద మార్గాలేవీ సులువు కాదు. చివరిది అసలే కాదు.

## 45. పౌర సేవలు (సివిల్ సర్వీసెస్) ప్రజాస్వామ్యంలో ఏ పాత్రను నిర్వహిస్తాయి ?

ప్రజాస్వామ్యంలో శాశ్వత పరిపాలనకూ, దైనందిన కార్యకలాపాల నిర్వహణకీ ప్రభుత్వం పౌరసేవలలో ఎన్నిక కాబడని పూర్తి సమయపు అధికారులపై ఆధారపడుతుంది. వారు విధాన నిర్మాణం చట్టనిర్మాణానికి వాటిని కార్యరూపంలో కార్యసాధకంగా చేయడానికి కావలసిన పరిపాలనా నిర్ణితిని నిపుణుల సలహాలను ఇస్తారు. వారు ఏ పార్టీ అధికారంలో వున్నా వారు వ్యక్తిగతంగా ప్రభుత్వ విధానాలతో ఏకీభవించినా లేకపోయినా వారి విధులను ఆత్మసాక్షిగాను, నిష్పాక్షికంగాను చిత్తశుద్ధితో నిర్వహించాలి. వృత్తిపరమైన పౌరసేవలు ప్రతి సమకాలీన ప్రభుత్వ విధానాలలోను సామాన్య లక్షణమే అయినా ప్రజాస్వామ్యంలో పౌరసేవల వ్యవస్థకు ప్రత్యేకమైన - అనుభవజ్ఞులైన పౌర అధికారాలు ఎలా నియమించబడతారు, వారు ఎవరికి జవాబుదారీ కావాలి. వారి నియామక సంబంధమైన విధానం ఎలా వుండాలి, అనే చాలా సమస్యలు ఉత్పన్నమవుతాయి.

### రాజకీయ నియామకాలు

చాలా రాజకీయ పార్టీలలో వారి భయాన్ని రెచ్చగొట్టిన మొదటి సమస్య కొంతమంది ఉన్నత పదవిలో ఉన్న అధికారులు అధికార పార్టీ విధానాలకు కట్టుబడకుండా ప్రవర్తించడం, లేదా సలహాలివ్వడంలో వారి గుత్తాధికారాన్ని ప్రయోగించి మంత్రులకు కలుషిత సలహాలివ్వడం. కాని ఈ భయాలు అతిశయోక్తులే. విధాన విషయంలో ప్రతిపాదనకి అభ్యంతరాలు ఆచరణలో ఇబ్బందుల దృష్టితో పరీక్షించి విధానాలను అమలు చేయడానికి పౌర అధికారులు ప్రయత్నంచేయాలి. ఇది అద్భుతగిలే విధానంగా తరచూ పరిగణింపబడవచ్చును. కానీ పౌరసేవా విధానంపై ఎన్నికకాని పౌరసేవకుల ప్రభావం చాలా శక్తివంతమైనది. దానిని అప్రజాస్వామికంగా ఉపయోగింపబడే అవకాశమూ వుంది. ఈ అవకాశాన్ని అత్యల్పం చేయడానికి స్థిరపడిన ప్రజాస్వామ్యాలు రెండింటిలో ఒక విధానాన్ని ఉపయోగిస్తాయి. ఒకటి ప్రతీ మంత్రిత్వశాఖలోనూ

నియమాత్మకంగా ఎన్నికైన ప్రభుత్వం మారినపుడు మారడానికి వీలుగా అత్యున్నత పరిపాలనా పదవిని రాజకీయ నియామకంగా చేయడం ద్వారా. రెండవది ప్రతి మంత్రిత్వశాఖలోను నిపుణులైన పార్టీ మద్దతుదార్లను నియమించడం. వీరు మంత్రులకు సమాచారాన్ని పర్యాయ సలహాలను అందిస్తారు. వీరు కూడా శాశ్వత పౌరసేవాధికారులు అందించే సలహాలను స్వతంత్రంగా సరిచూడగలిగిన సమర్థులు. ఈ రెండూ ఇబ్బందికి అతీతమైనవికావు. కానీ వీటిలో సానుకూలతలు అసానుకూలతలకంటే ఎక్కువ.

## పౌరసేవాధికారుల జవాబుదారీ

రెండవ సమస్య పౌరసేవాధికారుల జవాబుదారీ. పౌరసేవలలోని అధికారులందరూ క్రమానుగత శ్రేణిలో వ్యవస్థీకరింపబడతారు. ప్రతీ ఒక్కరూ తనమీద వారికి జవాబు దారులు. అందరూ మంత్రి ద్వారా పార్లమెంటుకు జవాబుదారులు. ఒక్కొక్కసారి వారి మీద వారికి జవాబుదారీని మించి నేరుగా న్యాయానికి బాధ్యులు కావాలా? ఒక్కొక్కసారి వారికివ్వబడిన సూచనలు చట్టవ్యతిరేకాలైతే? పార్లమెంటును మోసగించినవే అయితే? వారి సేవలు పొందేవారి హక్కులకు భంగం కలిగించితే? ఇలాంటి ఉదాహరణలు అధికారవర్గ-ప్రజాస్వామిక నియమాలయొక్క జవాబుదారీ మధ్య వుండే సంఘర్షణకు గల అవకాశాలని చూపిస్తాయి. ఆచరణలో చాలా మంది పౌర అధికారులు 'అనధికారికంగా బహిర్గతం చేయడం' ద్వారా పరిష్కరించుకుంటారు. చట్టంలో ఇలాంటి 'ఈలవేసే వారికి' రక్షణ కల్పించవలసిన అవసరానికి తగిన కారణం ఇదే (చూ.పు. 37).

## ప్రజాసేవకుల నియామకం

ప్రజాస్వామ్యంలో పౌరసేవలలో చివరి అంశం వారి నియామక నమూనా. ప్రవేశకాల నాణ్యతను పార్టీలకు స్వతంత్రంగా వారి ఉన్నత విద్య, సంబంధిత వృత్తి శిక్షణ, నైపుణ్యం- ఇవి పోటీ ఎన్నిక ద్వారా పొందబడతాయి. ఈ ఎంపికలో కొంత బుద్ధికి సంబంధించిన మినహాయింపు ఉన్నా సామాజిక మినహాయింపు కూడా వుండకుండా వుండడం ముఖ్యం. ప్రజాస్వామ్యంలో ప్రజాసేవలు ముఖ్యవర్గాలకు స్వచ్ఛమైన ప్రాతినిధ్యం వహించేవిగా వుండాలి. అంతేకాక అలా కనబడాలి కూడా. రాజకీయ సమానత్వ నియమం వారే వర్గానికి చెందిన వారైనా ప్రజానియామకం అందరికీ అందుబాటులో వుండాలని చెప్తుంది. సమాన అవకాశాలు వివక్షా వ్యతిరేక విధానాలు విద్యలోను పౌరసేవల నియామకంలోను కార్యసాధకంగా వుండాలి.

## 46. జవాబుదారీ ప్రభుత్వానికి పౌరులు వ్యక్తులుగా ఇవ్వగలిగినదేమిటి?

వారివారి ప్రయోజనాలకు చట్టవ్యతిరేక నిర్ణయాలు లేక అలక్ష్యం, ఆలస్యం స్వైరం మొదలుగాగల దుష్పరిపాలన చేయబడినపుడు పౌరులు ప్రభుత్వ అధికారులకు విరుద్ధంగా వారికి న్యాయం సమకూర్చేటట్లు చూసుకోవడానికి ప్రజాస్వామ్యంలో ముఖ్యమైన మార్గాలున్నాయి. ప్రభుత్వం చట్టపరంగా నిర్వచించబడిన అధికారానికి అతీతంగా నిర్ణయాలు తీసుకున్నప్పుడు నివారణ న్యాయస్థానాలద్వారా పొందవచ్చును. దుష్పరిపాలనా సందర్భాలలో నియోజకవర్గపు ప్రతినిధికికాని, అంబడ్స్మన్ద్వారా గాని విజ్ఞాపన చేసి సవరించుకొనే అవకాశం వుంది. అంబడ్స్మన్కి కార్యనిర్వహణశాఖ యొక్క నిర్ణయాలకు విరుద్ధంగా వ్యక్తిగత వ్యధను అంచనావేసే ప్రత్యేక బాధ్యత వుంది. ఈ మధ్యనే పౌరుల ఛార్టర్ అనబడే ఒక సంస్థ ఏర్పరచబడింది. దీనిద్వారా పౌరులకు ప్రభుత్వ సేవల వైఫల్యాలకు నష్టపరిహారం పొందడం వీలవుతుంది. ఇవన్నీ వ్యక్తికోసం వినియోగదారుని జవాబుదారీ ఇతర జవాబుదారీలకు భిన్నంగా కనిపిస్తుంది (చూ.ప్ర.38). ఇవి ప్రభుత్వ సేవలకు ముఖ్య ఖాతాదారీలు ప్రజలని గుర్తుచేయడానికి పనికివస్తాయి. చట్ట, రాజకీయ, విత్తపరమైన ప్రభుత్వపు జవాబుదారీ చివరకు పౌరులకొరకే.

## 47. సాయుధ దళాలు పౌర నియంత్రణకి లోబడేటట్లు ఎలా ఉంచబడతాయి?

సుస్థిరమైన ప్రజాస్వామ్యాలలో రాజకీయ సైనిక నిర్ణయాల విభజన జాగ్రత్తగా అర్థం చేసుకోబడి పరిరక్షించబడినపుడు అప్పుడప్పుడు ఆయుధ సేకరణ సాయుధ దళాలను స్థాయి, సేవా నియమాల విషయంలో తప్ప నియంత్రణ పెద్ద సమస్యగా కనబడదు. సైనిక తిరుగుబాటు లేదా సైనిక పాలనను అనుభవించిన లేక ప్రభుత్వ విధానాలపై సైనిక తిరస్కారం ఎదుర్కొన్నప్పుడు ఈ సమస్య అధిగమించలేనిదిగా కనబడవచ్చును. సైన్యం ఎక్కడైనా, ఎన్నికైన రాజకీయ నాయకులను పదవీచ్యుతులను చేయడానికి, ప్రభుత్వాన్ని చేజిక్కించుకోవడానికి, ప్రజలను సైనిక పరిపాలనకు లోబడేటట్లు చేయడానికి చాలా భౌతిక, వ్యవస్థాసంబంధమైన శక్తిగలిగి వుంటుంది. కాబట్టి అలా చేయడానికి సైన్యం యొక్క ఇచ్ఛనీ ఎలా నిరుత్సాహపరచాలీ అన్నది ఇప్పటి ప్రశ్న.

## సైనిక ఘాతాలు

ఎన్నికైన రాజకీయ నాయకులు సైన్యాన్ని తమకు లోబడి వుండేటట్లు చూసుకోవడం సులువైనదికాదు. రాజకీయం లేని శిక్షణ ఇవ్వడం, జీతభత్యాలతో వారిని తృప్తిపరచడం, స్థాయినికాని ఆయుధాలనుకాని ఇవ్వడం సులువేకాని, సాయుధదళాలలో అంతరంగిక అసంతృప్తి సైనిక ఘాతానికి (మిలటరీ "కూ") అనేక కారణాలలో ఒకటి. కానీ అెప్పుడూ ఒకటేకాదు. ప్రజాస్వామ్యంలో రాజకీయ నాయకులు క్లిష్టపరిస్థితిని పరిష్కరించనపుడు అంతర్యుద్ధం, దీర్ఘకాలిక ద్రవ్యోల్బణం తీవ్రమైన శాంతి భద్రతల భంగపాటు, ఘోరమైన రాజకీయ అవినీతి పేర్కొన్నప్పుడు మాత్రమే సైన్యం ప్రభుత్వాన్ని వశపరుచుకొంటుంది. పార్టీలు ఎన్నికలలో గెలుపుద్వారా లేక అధికారం చలాయింపులో తీవ్రవాద ప్రణాళికలు స్థిరమైన వ్యవస్థకి భంగం కలిగించేటప్పుడు కూడా సైనిక ఘాతాలు రావచ్చును. అయినా పనిచేసే ప్రజాస్వామ్య సంస్థల యొక్క సంఘటనా వైఫల్యమే ఈ ఘాతాలకు మూలకారణము. ఈ ఘాతం సైన్యంలోని స్వయం సిద్ధమైన లక్షణంకాదు.

## సైనిక పాలన

సమాజం యొక్క సమస్యలకు సైనిక పాలన ఎప్పుడైనా స్వల్పకాలిక ఉపశమనాన్నే ఇవ్వగలదు. దీర్ఘకాలిక నివారణని ఎప్పుడూ ఇవ్వలేదు. ఇకటి, రెండు దశబ్దాల క్రిందట విభజించే అవినీతి ప్రజాస్వామ్య రాజకీయాలకు విభిన్నంగా సైన్యాన్ని ఆర్థిక ఆధునీకరణకు జాతీయ నిర్మాణానికి ముఖ్యంగా భావించి పొగడడం నాగరికమైన ఆచారంగా ఉంది. కానీ సాయుధ దళాలు న్యాయబద్ధమైన ప్రభుత్వ విధులను నిర్వహించలేవు. అధికారంలో సైన్యాల చరిత్ర వైఫల్యాలమయం. రహస్య ప్రభుత్వం ఈ అవినీతిని కేవలం దాచగలదుకాని తగ్గించలేదు. సైనిక ప్రభుత్వానికి స్థిరమైన ఆర్థిక యజమానిగా ఋజువుకాబడిన ఆధారం ఏదీ లేదు. ఏ బహిరంగ ప్రభుత్వమూ సహించలేనంతగా మానవ హక్కుల దూషణకి సంబంధించిన చరిత్ర సైనిక ప్రభుత్వాలకు ఉంది.

## ప్రజాస్వామిక సంఘటన

ప్రజాస్వామిక సంస్థల రాజ్యాంగ ప్రభుత్వ సమనయ న్యాయ సంఘటన యొక్క దీర్ఘమార్గానికి అవసరమైతే అంతర్జాతీయ మద్దతుతో దీనిని సాధించడానికి గంభీరమైన వికల్పం ఏమీ లేదు. సంప్రదింపులూ, రాజీమార్గాలు, సామాజిక ఘర్షణలను

పరిష్కరించడానికి రాజకీయ మార్గాలు. తీవ్రమైన మానవ హక్కుల భంగాలను వేర్పరిచి ప్రత్యేకంగా ప్రభుత్వ అధికారాలచే విచారణ జరిపించి అలాంటివాటిని అనుమతించిన ప్రభుత్వాలపై శాంక్షన్‌లను విధించడానికి జాతీయ అంతర్జాతీయ స్థాయిలలో కార్యసాధకమైన పద్ధతులను అభివృద్ధి చేయవలసిన అవసరం ఉంది.

## 48. గూఢచారి సేవలకు ప్రజాస్వామ్యంలో ఏమైనా స్థానం ఉందా ?

ప్రజాస్వామ్య ప్రభుత్వంలో ఎక్కడైనా గోపనీయతా రహస్యం వుండడం సిద్ధాంతానికి విరుద్ధం. కానీ ప్రజాస్వామ్య దేశాలు కొన్ని విషయాలలో గోపనీయత అవసరమని భావిస్తాయి. ఈ గోపనీయత సమాజాన్ని బయటనుంచి వచ్చే ప్రమాదం నుంచి రక్షించడానికి రహస్యంగా చర్యలు తీసుకోడానికి అవసరం. అంతర్గతంగా వ్యవస్థీకరింపబడగలిగే నేరాలనీ ప్రజాస్వామ్య ప్రవృత్తిని భంగపరిచే కుట్రలని రహస్యంగానే దర్యాప్తు చేయాలి. కానీ ఈ చర్యలలో సమస్య ఏమంటే అవి ప్రయోగించే పద్ధతులు. నిఘా, పొంచివినడం, టెలిఫోన్ సంభాషణలను అందుబాటులోకి తెచ్చుకోవడం, ఇలాంటి అసహ్యకరమైన పనులు వ్యక్తి పౌరహక్కులకు భంగం కలిగించేవి. రహస్యమైనవి కాబట్టి అవి బహిరంగంగా సమర్థనీయమైన అవధులను దాటి రాజకీయ వ్యవస్థలకీ చట్టబద్ధమైన కార్యకలాపాలకీ ఒక ప్రత్యేక ప్రభుత్వ విభాగానికి సంబంధించిన విధానాలకు విస్తరిస్తుంది.

### రాజకీయ జవాబుదారీ

అందుకే అంతా రాజకీయ నియంత్రణ అనే అంశంమీదనే ఆధారపడి వుంటుంది. పార్లమెంటుకి సంబంధిత మంత్రి లేదా మంత్రుల సామాన్యజవాబుదారీలో రక్షణ చర్యలను కలపడం సరిపోదు. దానికి ప్రత్యేక పార్లమెంటు కమిటీ అవసరం అవసరబద్ధంగా రహస్యంగా కలుసుకుని అట్టి చర్యలను పర్యవేక్షించడానికి బహిరంగంగా సమర్థించదగిన సూచనలను అనుసరించాలి. అంబడ్స్‌మన్‌కు పౌరహక్కులు, నిఘా, చట్ట సంబంధమైన ప్రజల ఫిర్యాదులను దర్యాప్తు చేసే అధికారం వుండాలి.

## 49. స్థానిక ప్రభుత్వం ప్రజాస్వామ్యానికి ఎందుచేత ముఖ్యం?

చాలా కారణాలవల్ల ప్రజాస్వామ్య పద్ధతిలో ఎన్నికైన స్థానిక ప్రభుత్వం వుండడం అతి ముఖ్యం. ప్రజాస్వామ్యకలాపాలలో పాల్గొనడానికి, నిర్ణయాలు తీసుకోవడానికి

అవకాశాలనూ అందలి వ్యక్తుల సంఖ్యను పెంచడానికి స్థానిక ప్రభుత్వం చాలా దోహదం చేస్తుంది. స్థానికమైనది కాబట్టి స్థానిక అవసరాలకు జాతీయ ప్రభుత్వం కంటే అది ఎక్కువగా ప్రతిస్పందించగలదు. దాని విధానాలు విజయవంతం అయితే వాటిని విస్తృతంగా ఉపయోగించడానికి వీలుంటుంది. స్థానిక ప్రభుత్వం చిన్న చిన్న ప్రయోగాలను చేసి వాటి పరిణామాలను పరిశీలించగలదు. జాతీయస్థాయి పదవులకు రాజకీయ నాయకులు ఎదిగే అవకాశాన్నీ, ఓడిపోయిన పార్టీలకు రాజకీయంగా ఒక ఆధారాన్ని కలిగిస్తాయి. చివరగా కేంద్ర ప్రభుత్వం అధికారాల గాఢతను నియమితం చేసి రాజ్యాంగపరమైన అధికార విభజనకు ఒక అదనపు తలాన్ని అందిస్తుంది. ఇందులో ప్రతీ ఒక్కటీ అర్థవంతమైనదే. అన్నీ కలిపి చూస్తే ఎన్నిక కాబడిన స్థానిక ప్రభుత్వాన్ని తిరుగులేనిదిగా బలపరిచేవే.

## కేంద్రీకరించే పోకడలు

ఆధునిక దేశాలలో రాజకీయ నిర్ణయ కార్యకలాపాలలో కేంద్రీకరణను ప్రోత్సహించే చాలా బలమైన శక్తులు పనిచేస్తున్నాయి. జాతీయ విత్త యాజమాన్యానికి జాతీయస్థాయిలో సార్వత్రికంగా ప్రజావ్యయంపై నియంత్రణ కావాలని ట్రెజరీశాఖ నుండి ఒత్తిడి వుంది. జాతీయ రాజకీయ వాదులకు స్థానికస్థాయి రాజకీయ ప్రత్యర్థులు కేంద్ర విధానాల ప్రతిపాదనలను అర్థగించి పలచన చేయడానికి అంగీకరించరు. తరువాత ప్రజల యొక్క ఆశలు, ఆశయాలు వున్నాయి. సామాజిక చలనం విపరీతంగా పెరుగుతున్న సందర్భంలో ఒక ప్రదేశం నుంచి మరొక ప్రదేశంలో సేవలస్థాయిలో మార్పులను సహించరు. పౌరసమానత్వం అంటే సేవల స్థాయిలో సమానత్వం కూడా. వివిధ ప్రదేశాలలో పెద్ద మొత్తాలలో వనరులను జాతీయంగా క్రమబద్ధం చేసి పునఃపంపిణీ చేస్తే పరిగణనీయంగా స్థానిక ప్రభుత్వం స్వయంప్రతిపత్తిని తగ్గిస్తుంది. దానితోపాటు స్థానిక ఎంపికల యొక్క అవకాశం కూడా తగ్గుతుంది.

## పోటీ చేసే (Imperatives) తప్పనిసరులు

ఈ పోటీ చేసే తప్పనిసరులకు సార్వత్రికంగా ఉపయోగించదగిన పరిష్కారం లేదు. కాని ఈనాటి అతి బలమైన ఒత్తిడులు కేంద్రీకరణవలననే వస్తాయి కాబట్టి స్థానిక ప్రభుత్వానికీ, రక్షణకీ అత్యంత ఆవశ్యకం. కనీస పక్షంలో నియోజకులకు అర్థమయ్యేలా కేంద్రానికీ, ప్రాంతానికీ స్పష్టమైన విధుల విభజన వుండాలి. స్థానిక అవసరాలు

పరిస్థితులననుసరించి ఈ విధులను నిర్వహించడానికి సరిపడిన అధికారాలు, నిధులు వుండాలి. జాతీయ విధాన నియమాలను అనుసరించినవే అయినా స్థానిక నియోజకుల జవాబుదారీకి కావలసిన యంత్రాంగమూ స్థానిక అధికారుల విచక్షణలో కేంద్రజోక్యం లేకపోవడం, అవసరమైతే రాజ్యాంగ న్యాయస్థానం ద్వారా అమలు అవసరం. చివరకు కేంద్ర స్థానిక కార్యసాధక సంబంధాలు సహకారంమీద పరస్పర గుర్తింపు మీద ఆధారపడి వుంటాయి కాని కేవలం సంకుచిత న్యాయబద్ధతమీద కాదు.

## 50. సమాఖ్యతా విధానం ఎప్పుడు కోరదగినది?

సమాఖ్య విధానం దేశాన్ని వివిధ రాష్ట్రాలుగా విభజించడంలో సంబంధించినది. ప్రతి రాష్ట్రానికీ ఎన్నికైన సభ కార్యనిర్వహణశాఖ (చట్టం చేయడానికి, పన్నులు విధించడానికి) రాష్ట్ర, జాతీయస్థాయిలో రాజ్యాంగంచే హామీ యివ్వబడిన అధికార విభజనా వుండాలి. చారిత్రకంగా సమాఖ్య రాజ్యాలు చాలా విధాలుగా ఉనికిలోకి వచ్చాయి. ఇంతకు పూర్వం సార్వభౌమదేశాల విలీనం వలన అంతకు ముందు తమ రాజ్యంలో ప్రాంతాలకు లేదా చిన్న రాజ్యాలకు స్వయం ప్రతిపత్తి ఇవ్వడంవల్లనూ, ప్రారంభ స్థాపన నిర్ణయంలో సర్దుబాట్లు వల్లనూ సమాఖ్య రాజ్యాలు ఉత్పన్నమయ్యాయి.

### ప్రాదేశిక విభేదాలు

సమాఖ్య విధానం విస్తీర్ణంలో పెద్ద రాజ్యాలుండి అందులో సంస్కృతీపరమైన విశాలమైన భేదాలు, ప్రదేశాల మధ్య నైసర్గిక భేదాలున్నప్పుడు తరుచుగా అభిలషణీయంగా వుంటుంది. ఒకే నైసర్గిక ప్రదేశంలో వుండే జాతి, సంస్కృతి పరమైన వివిధ వర్గాలకు పూర్తి స్వతంత్రంకాకుండా స్వయంప్రతిపత్తి అనే పరిష్కారాన్ని సమాఖ్య విధానం ఇవ్వగలదు. ఒకే పైకప్పుక్రింద కీచులాడుకుంటూ వుండడంకంటే కొంత దూరంగా వుండడం, కొన్ని పరిస్థితులలో విడిపోవడం కంటే మంచిది. ఎన్నికైన స్థానిక ప్రభుత్వాన్ని బలపరుస్తూ యివ్వబడిన వాదనలు అంతేబలంతో సమాఖ్య విధానాలకు వర్తిస్తాయి (చూ ॥ప్ర॥ 49).

4

# వ్యక్తి హక్కులు - వాటి రక్షణ

## 51. మానవ హక్కులేవి?

మానవ అవసరాలు, సామర్థ్యాలలోనుంచి వ్యక్తిపొందే అర్హత కలిగిన మానవ హక్కులు, ప్రాథమిక స్వేచ్ఛలూ గ్రహించబడ్డాయి. మానవ హక్కుల గుర్తింపు, రక్షణకొరకై అంతర్జాతీయ న్యాయంలో వాటి రక్షణ పద్ధతులు వుండడం ఈ శతాబ్దంలోని అతి ముఖ్యమైన నైతిక ప్రగతి. అంతర్జాతీయ సమాజం, అంతర్జాతీయ ఒప్పందాలని మానవ హక్కులపై సభలనీ ఏర్పాటు చేసింది. అనేక ఒడంబడికలనూ చేసింది. ఈ ఒడంబడికలు మానవ హక్కుల, స్వేచ్ఛల అవకాశాలలో అంగీకరింపబడిన నిర్వచనాలను స్థాపించడానికి ప్రయత్నం చేస్తాయి. ప్రభుత్వాలకు వారి వారి దేశాల చట్టాలలో ఆచరణలో అట్టి హక్కులు రక్షింపబడేటట్లు అవసరమైన చర్యలు తీసుకొనేలా చేస్తాయి.

### సార్వత్రిక ప్రకటన

ఆధునిక ప్రపంచంలో మానవ హక్కుల భావం ఐక్యరాజ్య సమితి సాధారణ సభ డిసెంబరు 10, 1948లో రూపొందించిన మానవ హక్కుల సార్వత్రిక ప్రకటన నుంచీ ఉద్భవించింది. 1966లో ఐక్యరాజ్య సమితి సార్వత్రిక ప్రకటనలో హక్కుల ఆధారంగా రెండు అంతర్జాతీయ ఒడంబడికలను చేసింది. అవి ఆర్థిక సామాజిక సాంస్కృతిక హక్కుల అంతర్జాతీయ ఒడంబడిక, రెండవది పౌర, రాజకీయ హక్కులపై అంతర్జాతీయ ఒడంబడిక. మూడింట రెండు వంతుల దేశాలు వీటిని ధృవీకరించాయి. ఐక్యరాజ్య సమితి అంతర్జాతీయ పౌర రాజకీయ ఒడంబడిక ఐచ్ఛిక ప్రోటోకోల్‌ని ఆమోదించింది. దీని వలన వ్యక్తులకు ఒడంబడిక యొక్క పరిశీలనా సంస్థ మానవ హక్కుల సంఘానికి వారి హక్కులూ ప్రభుత్వం భంగపరిచినప్పుడు యాచికను సమర్పించే హక్కూ ఉంటుంది. కానీ ఈ హక్కు ఆ దేశం ఒడంబడికను ధృవీకరించి ప్రోటోకోల్‌ను

అంగీకరించినపుడే అందుబాటులో ఉంటుంది. చాలా దేశాలు ఇది చేయలేదు.

### ప్రాదేశిక ఒడంబడికలు

సార్వత్రిక మానవ హక్కుల ప్రకటన ఈ రెండు ఒడంబడికలు ఐచ్ఛిక ప్రోటోకోల్ అన్నింటినీ కలిపి అంతర్జాతీయ మానవ హక్కుల బిల్లుగా వ్యవహరిస్తున్నారు. చాలా ఇతర మానవ హక్కులపై సార్వత్రిక జాతీయ ఒప్పందాలు, ప్రాదేశిక ఒప్పందాలు ఉన్నాయి. అందులో కొన్ని మానవ హక్కులపై అమెరికన్ ఒడంబడిక, ప్రజల హక్కులపై ఆఫ్రికన్ ఛార్టర్, మానవ హక్కులపై యూరోపియన్ ఒడంబడిక కొన్ని. ఇవి కాక ఇక్కడ చర్చించడానికి అవకాశం లేని చాలా పరికరాలున్నాయి. మానవ హక్కులపై ఇంకా ముందుకు చదవడానికి ఈ పుస్తకం చివర సూచనా గ్రంథాల జాబితా ఇవ్వబడింది

## 52. హక్కులు ఎలా వర్గీకరింపబడ్డాయి ?

హక్కులను అనేక విధాలుగా వర్గీకరించవచ్చును. అయినా ఆమోదింపబడిన విధానంలో హక్కులు పౌర, రాజకీయ, సామాజిక, ఆర్థిక, సాంస్కృతిక హక్కులుగా వర్గీకరణ అంతర్జాతీయ మానవ హక్కుల బిల్లులో ఉపయోగించబడింది. పౌర, రాజకీయ హక్కులకి ఉదాహరణలు ఇవి : జీవితానికి హక్కు, హింసల నుండి స్వేచ్ఛ, నిర్బంధ కాయకష్టం నుండి, స్వైరమైన అరెస్టు నుండి స్వేచ్ఛ, స్వచ్ఛమైన విచారణ హక్కు, ఆలోచనకి హక్కు, వాక్ స్వాతంత్ర్యం, సంఘంగా ఏర్పడటానికి, ప్రజా వ్యవహారాలలో పాలుపంచుకోవడానికి స్వేచ్ఛ. పౌర రాజకీయ హక్కులకు వ్యక్తులతో వర్గాలతో ప్రభుత్వ జోక్యం నుండి దూరంగా ఉండడమనే ఒక షరతు కావాలి. కానీ చర్యల యొక్క బాధ్యతను రాజ్యంపై లేదా ప్రభుత్వంపై వేయడం జరుగుతుంది. ఉదాహరణకు బీదవారికి, బడుగువర్గాల వారికి న్యాయస్థానాలలో హక్కులను పొందడానికి న్యాయసహాయానికి నిధులు అందించడం. మరొక ఉదాహరణ : వ్యక్తులపై తీవ్రమైన నేరాలు ఆరోపించబడినపుడు జాతీయమైన అల్ప సంఖ్యాకులకు ప్రచార సాధనాల అందుబాటుకొరకై ప్రజావ్యయాన్ని అనుమతించడం.

### ఆర్థిక, సామాజిక, సాంస్కృతిక హక్కులు

ఆర్థిక, సామాజిక, సాంస్కృతిక హక్కులకు ఉదాహరణలు : ఆహారం, ఆరోగ్యం, తగినంత జీవన ప్రమాణం, సమానమైన పనికి సమానమైన జీతం, సామాజిక భద్రత, పని చేయడానికి, సమ్మెకి, గృహవసతికి, విద్యకి, సాంస్కృతిక జీవితంలో పాల్గొనడానికి

హక్కులు. ఆర్థిక, సామాజిక హక్కులను అందించడానికి ప్రభుత్వం ఉండాలి. వీటిని వ్యక్తులు తమకు తాముగా అందించుకోలేరు. వారిలో నిరుద్యోగులు, అవిటివారు ఉండవచ్చును.

### వివక్ష నుండి స్వేచ్ఛ

హక్కులన్నింటిలోను కూడుకొని ఉన్న ఒక ముఖ్య నియమమేమంటే వాటి వినియోగంలో ప్రజల లింగ భేదం, జాతి, మతం, నమ్మకాల ఆధారంగా ఏ విధమైన వివక్షకు గురికాకూడదు.

## 53. కొన్ని హక్కులు మరి కొన్ని హక్కుల కంటే ఎక్కువ ముఖ్యమైనవా ?

దీనికి ఉత్తమమైన సమాధానం ఏమిటంటే అంతర్జాతీయంగా గుర్తించబడిన హక్కులన్నీ ఒకదానితో మరొకటి సంబంధం ఉన్నవే. ఒక దానిని మరొకటి బలపరచేవే. కొన్ని సమాజాలలో, వాటి యొక్క అభివృద్ధిని అనుసరించి చాలామంది పౌరులచే కొన్ని హక్కులు ఇవ్వడినట్లే భావించబడతాయి. ఉదాహరణకు : సంపన్న దేశాలలో హేతుబద్ధమైన జీవన స్థాయి తిండి, బట్ట, ఇల్లు, మరి విద్య హక్కు. బీద దేశాలలో ఈ హక్కులు ప్రజల గణనలో చాలా ఎత్తుగా ఉంటాయి. కానీ అన్ని ప్రజాస్వామ్య సమాజాలలోను అట్టి ఆర్థిక, సామాజిక హక్కులు మౌలిక పౌర రాజకీయ హక్కులు సమనయ న్యాయంచే పాలించబడటానికి స్వైరంగా అరెస్టు, బందీ చేయబడకుండా రక్షణ, వాక్ స్వాతంత్ర్యం, సంఘంగా ఏర్పడే హక్కు వాటికి హామీ ఇవ్వబడినట్లు వాటికీ హామీ ఇవ్వబడాలి. అంతర్జాతీయ న్యాయంలో వివక్ష లేకుండా పౌరులకు మానవహక్కులన్నింటినీ గౌరవించి పెంచడం ప్రభుత్వ విధి.

## 54. మానవ హక్కులు సార్వత్రికాలా ?

అవును. అంతర్జాతీయ ప్రమాణాలు ప్రపంచమంతటా వ్యక్తి యొక్క అవసరాలకు సామర్థ్యానికి సంబంధించినవి. ప్రపంచమంతా విభిన్న ప్రాంతాలలో విభిన్న సంస్కృతులతో ఏర్పడింది. బీద-సంపన్న దేశాలుగా విభజింపబడింది. అవి వ్యక్తితో మొదలవుతాయి కాబట్టి అంతర్జాతీయ మానవ హక్కుల ప్రమాణాలు కొన్ని వ్యక్తిని సమాజానికి భిన్నంగా చూసే సంస్కృతులకు పరకీయాలు. వ్యక్తి మొదటి విధి




మానవహక్కులు అన్నీ సార్వజనీనాలు

సమాజానికని ప్రజాస్వామ్యం ఊనిక చేస్తుంది. వ్యక్తి మానవ హక్కులు సమాజాల వర్గాల వారి సభ్యుల మధ్య సంబంధాలను పునః నిర్వచించేటట్లు చేయాలా అన్నది ప్రపంచమంతటా ఉత్తర దక్షిణాలలో ఎక్కువ చర్చించబడే అంశం. అది చర్చించదగినదే ఏమో. కానీ వ్యక్తి యొక్క మానవ హక్కులు గుర్తింపబడితే మానవ ఐక్యతకి, జాతికి కీడు వాటిల్లుతుందని అనడానికి ఋజువు లేదు. దానికి భిన్నంగా సార్వత్రిక మానవ హక్కుల విధాయకాలు మానవ వర్గాలనీ, ప్రజలనీ రక్షించి వ్యక్తులు వారి భాషా ఉపయోగంలో సంస్కృతిని పంచుకోవడంలో, మతం జీవన విధాలను అవలంబించ డంలో యితరులతో కలియడం యొక్క అవసరాన్ని గుర్తించ ప్రయత్నం చేస్తాయి. మానవులందరికీ మానవ హక్కుల సామాన్య అర్హత మౌలిక స్థాయిని అంతర్జాతీయ మానవ హక్కుల న్యాయం మొట్టమొదట గుర్తిస్తుంది. దానికి అతీతంగా దేశాంతర్గత ప్రజలతో కలిసి అన్ని సంస్కృతులూ అభివృద్ధి పొందడానికి అర్హతగలవేనని అంగీకరిస్తుంది.

## హక్కులు - విధులు

'సార్వత్రిక మానవ హక్కుల ప్రకటన' వ్యక్తి యొక్క సమాజం యెడల విధుల గురించి కూడా మాట్లాడుతుంది. వ్యక్తి వ్యక్తిత్వం యొక్క స్వచ్ఛమైన స్వేచ్ఛాయుత అభివృద్ధి సమాజంలో ఇతరులతో కలిసి ఉండడం ద్వారానే సాధ్యమని వక్కాణిస్తుంది. మానవ హక్కుల భావన ప్రతి ఒక్క వ్యక్తి యొక్క విశిష్ట విలువల విశ్వాసంతో మొదలవుతుంది. (చూ. ప్ర. 2 కూడా)

## ఎంపికలేని ప్రమాణాలు

సార్వత్రిక ఆశయాలుగా అంతర్జాతీయ మానవ హక్కుల ప్రమాణాల విమర్శపై బలం ప్రపంచ సంస్కృతిల మధ్య ప్రాధాన్యం వ్యక్తికా, సమాజానికా అని భావించబడిన ఘర్షణ కంటే వ్యక్తుల హక్కులా లేదా విధులకా ప్రాధాన్యం ఇవ్వడం అనే విషయంలో భావించబడిన ఘర్షణ వల్లనే వస్తుంది. ఈ మానవ హక్కుల ముఖాలలో వాటి అతి ముఖ్యమైన సార్వత్రికతను కాదనకుండానే విభిన్నమైన సంస్కృతులలో విభిన్నమైన సమతుల్యాలు ఉండవచ్చును. అట్టి విమర్శ ప్రపంచ వ్యాప్తంగా ప్రభుత్వాలు మానవ హక్కులపై దురాచారాలను పరిగణించే విధానంలో సమానంగా ఉండవని సందేహం లేని సాక్ష్యంచే శక్తినివ్వబడినది. ప్రభుత్వాల, దేశాల మధ్య అధికార సంబంధాలపై

ఆధారపడి ఖండనలు ఎంపికైనవిగా ఉండడం సర్వసామాన్యమే. మరోలా చెప్పాలంటే ప్రభుత్వాలు - రాజ్యాలు వారి ప్రత్యర్థుల చరిత్రలను ఖండిస్తాయి. వారి స్నేహితుల చరిత్రలను విస్మరిస్తాయి. మానవ హక్కులకీ, ప్రజాస్వామ్యానికి సార్వత్రిక మద్దతు కావలిస్తే అది అంతర్జాతీయ జవాబుదారీ అనే విధానంపై ఆధారపడాలి. ఆ విధానం సామాన్య ప్రపంచ ప్రమాణాలకు ఎంపికలేని హేతుబద్ధ నియమాలపై ఆధారపడడాన్ని బలపరచాలి.

## వియన్నా సమావేశం

మానవ హక్కులకు అంతర్జాతీయ సమాజాల హక్కులకు సంబంధించిన ముఖ్యమైన అవగాహనలు వియన్నాలో జూన్ 1993లో జరిగిన మానవ హక్కుల ప్రపంచ సమావేశంలో ధృవీకరించబడింది.

> 'మానవ హక్కులన్నీ సార్వత్రికమైనవి విడదీయరానివి, పరస్పరంగా ఆధారపడేవి, పరస్పర సంబంధం ఉన్నవి. అంతర్జాతీయ సమాజం మానవ హక్కులని ప్రపంచ వ్యాప్తంగా స్వచ్ఛంగా సమాన ప్రాతిపదికతో ఒకే ప్రాముఖ్యంలో పరిగణించాలి. జాతీయ, ప్రాంతీయ ప్రత్యేకతలనూ, వివిధ చారిత్రక, సాంస్కృతిక మతపరమైన నేపథ్యాలను మనసులో ఉంచుకోవాల్సిన వారి వారి రాజకీయ, ఆర్థిక, సాంస్కృతిక విధానాలను ప్రోత్సహించి అన్ని మానవ హక్కులనూ మౌలిక స్వేచ్ఛలనూ పరిరక్షించడం రాజ్యాల ప్రభుత్వాల విధి' (ముగింపు పత్రం, 3వ పేరా).

## 55. ఒక దేశపు మానవ హక్కుల చరిత్రపై అంతర్జాతీయ ఆతురతను వ్యక్తీకరించడం న్యాయబద్ధమైనదేనా ?

ఐక్యరాజ్యసమితి పత్రంలో నిర్ణయించబడినట్లు రాజ్యాల అంతరంగిక విషయాలలో జోక్యం కలిగించుకోకపోవడం అనే నియమం ఆధునిక, అంతర్జాతీయ విధానాలలో ఒక అతి ముఖ్యమైన సూత్రం. కానీ అంతర్జాతీయ మానవ హక్కుల ఉద్యమాల పెరుగుదల వాటి ప్రమాణాలు నిశ్చలంగా వ్యాప్తిచెందడం ప్రస్తుతం ఆమోదింపబడిన ఈ నియమాన్ని తీసుకొని వచ్చాయి. ఏ దేశమైనా తన పౌరులను పరిగణించే విధానం బహిరంగమైనదే. ఇతర ప్రభుత్వాలు లేదా ప్రభుత్వేతర సంస్థల బహిరంగ విమర్శ ఆ దేశపు అంతరంగిక విషయాలలో జోక్యంగా పరిగణించనవసరం లేదు. ఈ రెండు నియమాలు అంతర్జాతీయంగా ఆమోదింపబడినవే. మానవ హ॰ లమీద ప్రపంచ సమావేశం ఇలా ధృవీకరించింది. 'అన్ని మానవ హక్కుల ప్రోద్బలమూ, రక్షణా

అంతర్జాతీయ వర్గాల న్యాయబద్ధమైన ఆతురత' (ముగింపు పత్రం, పేరా 2.2).

## 56. మానవ హక్కులూ - ప్రజాస్వామ్యం వీటి మధ్య సంబంధం ఏమిటి ?

మానవ హక్కులపై ప్రపంచ సమావేశం ఈ సంబంధాన్ని గురించి మాట్లాడుతూ (దాని అభివృద్ధి విషయంతోపాటు) అది పరస్పర ఆధారమైనదనీ ఒకదాని నొకటి బలపరిచేదనీ చెప్పింది. ఈ విషయాన్ని మరోలా చెప్పాలంటే మానవ హక్కుల పరిరక్షణ, సమనయ న్యాయం అభివృద్ధి చెందినవేకాక అభివృద్ధి చెందుతున్న దేశాలలో కూడా ప్రజాస్వామ్య నియమాలకు కట్టుబడి ఉండడం వలనే అత్యుత్తమంగా సాధించవచ్చును. మానవ హక్కులా, స్వేచ్ఛల వినియోగం ప్రజాస్వామ్యంలో అసలు పనిచేయాలంటే అత్యవసరమని కూడా గుర్తింపబడింది. వ్యక్తిగత మానవ హక్కులు అప్రజాస్వామిక విధానాలలో కూడా పొందబడతాయనీ వాదించేవారున్నారు. ముఖ్యంగా ఆర్థిక అభివృద్ధికి ప్రాముఖ్యం ఇవ్వవలసి వచ్చినపుడు ఇలా జరుగుతుంది. కానీ అట్టి విధానాలు ఎప్పటికైనా తక్కువ దయాళువులై, ఎక్కువ అణగదొక్కేవి, అవినీతితో కూడుకున్నవి అస్థిరమైపోయినట్లు తలమునకైనంత సాక్ష్యం వుంది.

### మానవ హక్కుగా ప్రజాస్వామ్య ప్రభుత్వం

ప్రజాస్వామ్యం - మానవ హక్కుల మధ్య అతి దగ్గర సంబంధంలో నమ్మకం కొత్తదేమీ కాదు. మానవ హక్కుల సార్వత్రిక ప్రకటనలో ప్రజాస్వామ్య ప్రభుత్వంయొక్క ఆమోదంతో కూడినదే. దాని ఆదర్శం : 'ప్రజా ఇచ్ఛ ప్రభుత్వ అధికారానికి మూలం' (ప్రకరణం 21) పౌర రాజకీయ హక్కుల అంతర్జాతీయ ఒడంబడిక రాజ్యాలు ప్రతీ పౌరునికీ 'ప్రజా విషయాలలో ప్రత్యక్షంగా కాని పరోక్షంగా ప్రతినిధుల ద్వారా కానీ పాలుపంచుకోవడానికి స్వచ్ఛమైన, కాలబద్ధమైన ఎన్నికలలో ఓటు చేయడానికి లేక ఎన్నుకోబడడానికి ప్రజా పదవికి సమాన అందుబాటు హక్కునీ హామీ ఇవ్వడం అవసరమని పేర్కొంది' (ప్రకరణం 25).

### అభివృద్ధికి హక్కు

సార్వత్రిక మానవ హక్కులూ, ప్రజాస్వామ్య ప్రభుత్వం మధ్య పరస్పర ఆధారాన్ని స్పష్టంగా ఒప్పుకోవడం ప్రచ్ఛన్న యుద్ధానంతరం అంతర్జాతీయ సంబంధాలలో అతి ముఖ్యమైన

ముందంజ. అభివృద్ధి హక్కు సాధించడానికి స్వయంగా అభివృద్ధి చెందుతున్న మానవ హక్కుల ప్రజా ప్రభుత్వం యెడల ఈ కాలంలో ఇంకా సకారాత్మకమైన ముందంజ.

## 57. ప్రజాస్వామ్యంలో పౌర - రాజకీయ హక్కుల మధ్య సంబంధం ఏమిటి ?

ప్రజాస్వామ్యంలో వ్యక్తికీ పౌర రాజకీయ హక్కుల హామీ రెండు పాత్రలను నిర్వహిస్తుంది. మొదటిది, సామూహిక నిర్ణయం చేయడంలో ప్రజానియంత్రణ - రాజకీయ సమానత అనే ప్రజాస్వామ్య కవల నియమాలను కలిగి ఉండడానికి ఈ హక్కులు తప్పనిసరి. రెండవది, అట్టి హక్కులూ, స్వేచ్ఛలూ అధిక సంఖ్యాక నిర్ణయాలు వ్యక్తి స్వేచ్ఛ ఎంపికల యొక్క రంగాలను నిర్వచించి సామూహిక చర్యకు ఒక అడ్డుగా పనిచేస్తాయి. ఈ ద్విపాత్ర ప్రజాస్వామ్యంతో జతపడి ఉన్న కొన్ని పౌర రాజకీయ హక్కులను సూక్ష్మంగా పరిశీలిస్తే చక్కగా ఉదాహరణలు ఇచ్చినట్లు అవుతుంది.

### వ్యక్తియొక్క స్వేచ్ఛ - భద్రత

స్వైరమైన అరెస్టు, బంధింపు, రాజబహిష్కారం వీటి నుండి రక్షణ లేకుండా వ్యక్తి భద్రతలో రాజకీయ చర్చలోగాని, చర్యలోగాని పాల్గొనలేడు. ఈ సామాన్య బుద్ధికి సంబంధించిన అంశం శాసనసభ సభ్యులు పార్లమెంటు విధులు నిర్వహిస్తున్నప్పుడు అరెస్టు చేయబడరాదనే నియమంలో ఉదాహరణ పొందుతుంది. కానీ, ప్రజాస్వామ్యంలో అందరికీ స్వేచ్ఛలూ, హక్కులూ అందింపబడ్డాయి. ప్రజాస్వామ్య సమాజం అధిక సంఖ్యాకుల ఇచ్ఛకు విరుద్ధంగా ప్రజాదరణలేని వ్యక్తి యొక్క స్వేచ్ఛను భౌతిక సమగ్రతనూ పరిరక్షిస్తుంది.

### 'తగిన విధానం'

పౌరుణ్ణి అపనింద, దుర్భావమూ, హింస, పక్షపాత విచారణల నుంచి పరిరక్షించటానికి ఇలాంటి వాదన ఉపయోగించవచ్చును. ప్రజాస్వామ్యాన్ని తిరస్కరించే సమాజాలలో రాజకీయ శత్రువుని చిత్రహింసలకు గురిచేయడం సర్వసామాన్యమే. రాజకీయ సిద్ధాంతపర ప్రభావాన్ని పన్నాగాలనీ కూడా కుట్ర లేకుండా సమనయ న్యాయం ఆధారం చేసుకొని నేర న్యాయాన్ని పరిపాలించడానికి స్వతంత్రమైన న్యాయశాఖ ప్రజాస్వామ్యానికి అవసరం.

## ఆలోచన - అంతరాత్మ స్వేచ్ఛలు

ప్రజాస్వామ్య సమాజం ప్రతీ వ్యక్తికీ వ్యక్తి తనకు నచ్చినట్టుగా ఆలోచించడానికి అభిప్రాయం కలిగి ఉండడానికి జీవితం యెడల ఒక సామాన్యమైన భావనా విధానాన్ని ఏర్పరుచుకోడానికి, ఆలోచనా స్వేచ్ఛనిస్తుంది. ప్రజాస్వామ్య సమాజం వ్యక్తులకు సమానంగా కొందరితోపాటు మతంలో విశ్వాసం కలిగి ఉండడానికి ఇతరుల హక్కులకు భంగం కలగకుండా ఒక మతాన్ని అనుసరించడానికి, నమ్మకాలను ప్రదర్శించడానికి స్వేచ్ఛనిస్తుంది. వాడుకలో ఉన్న లేదా అత్యధిక సంఖ్యాకుల నమ్మకాలు మతపరమైన మతాతీతమైన వాటికి ప్రతిగా ఆలోచనా స్వేచ్ఛ వ్యక్తి హక్కుగా ఎప్పుడూ పరిరక్షింపబడాలి. ప్రత్యేకంగా అధిక సంఖ్యాక వర్గాలతోపాటు ఇతర మతాలలో నమ్మకం ఉన్న అల్ప సంఖ్యాకులకు కూడా ఇట్టి స్వేచ్ఛలకు హామీ ఇవ్వాలి.

## భావ ప్రకటనా స్వాతంత్ర్యం, ప్రసార సాధనాలు

మనం నిర్వచించినట్లు ప్రజాస్వామ్య సారాంశం ఏమంటే ఇతరులతోపాటు ప్రతీ పౌరునికీ వినడానికి అర్హమైన గొంతు ఉంటుంది. కాబట్టి ఇతరులు వినే అవకాశమనే వాక్‌స్వాతంత్ర్యం ఒక అత్యవసర మానవ హక్కు. అంతర్జాతీయ ప్రమాణాలు సరిహద్దులకు అతీతంగా ప్రసార సాధనాల ద్వారా సమాచారాన్ని పొందే హక్కులో కలిసి ఉంటుంది. ఆధునిక సమాజంలో దాని అర్థమేమంటే స్వతంత్రంగా స్పష్టంగా స్థాపింపబడిన నియమాలు వ్యక్తుల గౌరవాన్ని ఆంతరంగికతనీ రక్షించేవిగా స్వతంత్రంగా బహుళ ప్రచార సాధనాలు పౌరునికి సమాచారాన్ని అందించాలి. ప్రభుత్వాన్ని విమర్శించే విధానాల ఎంపికలలో అన్ని రకాల చర్చలనూ ప్రోత్సహించాలి (చూ.ప్ర. 6).

## సమాచార స్వేచ్ఛ

ప్రజాస్వామ్యంలో ప్రభుత్వ బహిరంగత నమాచార స్వేచ్ఛా నియమంచేత పెంచబడుతుంది. ప్రజలకు రహస్యం ఆంతరంగికమని వర్గీకరింపబడిన కొద్ది మినహాయింపులకు లోబడి ప్రభుత్వ సమాచారమూ పత్రాలూ స్వేచ్ఛగా అందుబాటులో ఉండాలి (చూడు ప్ర. 37).

## సంఘంగా ఏర్పడటానికి, సమావేశమవడానికి స్వేచ్ఛ

ప్రజలు సమావేశమై ప్రజా విషయాలు చర్చించి ట్రేడ్ యూనియన్లు, ఇతర సంఘాలు స్థాపించి రాజకీయ పార్టీలను ఏర్పరిచి వాటిలో పాలుపంచుకోవడానికి హామీలు




ఇది న్యాయబద్ధమైన ప్రజాస్వామిక హక్కు

ఇవ్వబడకపోతే ఆధునిక ప్రాతినిధ్య ప్రజాస్వామ్యాలు తమ విధులను నిర్వహించలేవు. ఈ స్వేచ్ఛలలో సమావేశమవడానికి, ప్రదర్శన చేయడానికి వృధా నివారణను పొందేటందుకు యాచిక లివ్వడానికి సంబంధించిన హక్కులు కలిసి వున్నాయి.

## 58. సామాజిక, ఆర్థిక హక్కులు ప్రజాస్వామ్యంతో ఎలా సంబంధం కలిగి వుంటాయి?

ప్రజాస్వామ్య సూచ్యాకారంగా (చూ.ప్ర. 15) ఉద్యోగం, గృహవసతి, ఆహారం తగిన జీవన ప్రమాణం, విద్య, ఇతర అవసరాలు పౌర సమాజానికి అత్యవసర పునాదులుగా పరిగణింపబడ్డాయి. సమాజంలో ఆకలి విస్తృతంగా వున్నప్పుడు ప్రజాస్వామ్య రాజకీయాలు చాలా అసంపూర్ణంగా మాత్రమే సాగింపబడగలవు. బ్రతికి వుండడమనే మౌలిక మానవ అవసరాన్ని తృప్తిపరచడం ప్రజాస్వామ్యం పనిచేయడానికి అవసరమైన వేదిక. ప్రజాస్వామ్య నియమాలు ప్రతీ పౌరుడూ, నియోజకుడూ సమానమైన పలుకు బడిని కలిగి వుండడాన్ని అవసరంగా భావిస్తాయి. జీవిత అవకాశాలలో-ఉదాహరణకు విద్యయొక్క అందుబాటులో సాంద్రమైన అసమానత వుండడంవల్ల సమాజంయొక్క ప్రజాస్వామికశక్తి తీవ్రంగా నియమితమవుతుంది. అదేవిధంగా సామూహిక ప్రవృత్తిగా ప్రజాస్వామ్యం అట్టి అసమానతలను గుర్తించి పరిస్థితి మెరుగుపరచడానికి ఒక సాధనం.

### అభివృద్ధి-మానవ హక్కులూ!

అభివృద్ధికీ ఇవే వర్తిస్తాయి. అభివృద్ధి విధానాలు ప్రజలకు జవాబుదారీ అయినపుడే ఒక చట్రంలో మానవ హక్కులూ, సమన్వయ న్యాయం గౌరవించబడితేనే అభివృద్ధి సమర్థనీయమై దీర్ఘకాలికంగా సాధ్యమవుతుంది (చూ.ప్ర. 68).

## 59. ప్రజాస్వామ్య ప్రభుత్వం న్యాయబద్ధంగా హక్కులను నియమితం చేయడానికి ఏమైనా ఆధారాలున్నాయా?

అంతర్జాతీయ ప్రమాణాలు కొన్ని హక్కులను ఉపయోగించడంలో కొన్ని ఆధారాలపై-ఉదాహరణకు, ప్రజా వ్యవస్థ, ప్రజా నీతులు, జాతీయ భద్రత ఇతరుల హక్కుల నియంత్రణను లేదా పరిమితం చేయడాన్ని అనుమతిస్తాయి. కానీ కొన్ని హక్కులను పరిమితం చేయడానికి వీలుకాదు. వ్యక్తికి మౌలికమైన కొన్ని హామీలు హింసనుండీ, వివక్షనుండీ, స్వేచ్ఛ, ఆలోచనా స్వేచ్ఛ ప్రజాస్వామ్య సమాజంలో ఎప్పుడూ

ఉపసంహరించడానికి వీలులేదు.

### హక్కులపై పరిమితులు విధించడానికి నియమాలు

అంతర్జాతీయ న్యాయశాస్త్రంలో హక్కులను పరిమితం చేయడం లేదా హక్కులలో జోక్యం చేసుకోవడానికి సంబంధించిన సమర్థనల నియమాలు స్థిరపరచబడి వున్నాయి. ఆ నియమా లేమంటే ఆ పరిమితం చేయబడడం న్యాయబద్ధమై వుండాలి, దానికి ఒక న్యాయబద్ధమైన ప్రయోజనం వుండాలి. అంటే పరిమితం చేయడంలోని ఉద్దేశం స్పష్టంగా అంతర్జాతీయ ప్రమాణంలో అనుమతించబడినదై వుండాలి. పరిమితం చేయడానికి గాని, జోక్యం చేసుకోవడానికిగాని అవసరం ప్రజాస్వామ్య సమాజం యొక్క భావనకి అనుగుణమైనదే వుండాలి. ఆచరణలో దీని అర్థమేమంటే ప్రభుత్వం ఈ పరిమితులను విధించడం అవసరానుకూలంగా వున్నట్లు చూపాలి.

### అసాధారణ పరిస్థితులు

ఈ విధంగా ఏకపార్టీని అణగద్రొక్కడం-ఎక్కడో ఒక స్పష్టమైన అంశంలో ఒక వ్యవస్థ రాజ్యాంగ విరుద్ధమైన హింసాత్మక చర్యకు పాల్పడినపుడు తప్ప- సమర్థనీయం కాదు. అలాగే మరీ అసాధారణ పరిస్థితులలోనే పత్రికలపై ముందుగా సెన్సార్‌ను అంతర్జాతీయ మానవ హక్కుల ప్రమాణాలు సహిస్తాయి. అలాంటి మినహాయింపులేమంటే చాలా సున్నితమైన సమాచారం దాని ప్రచురణ వలన వ్యక్తుల జీవితాలకు, దేశ భద్రతకు ప్రమాదాన్నితెచ్చేదయితే దానిని న్యాయస్థానానికి ప్రదర్శించడం.

## 60. అత్యవసర పరిస్థితిలో మానవ హక్కులను తాత్కాలికంగా నిలిపివేయవచ్చా?

జాతీయ భద్రతకు ముప్పువచ్చే సందర్భంలో అధికారికంగా ప్రకటించబడిన అత్యవసర పరిస్థితిలో కొన్ని పౌర రాజకీయ హక్కుల హామీని తాత్కాలికంగా నిలుపుచేయడానికి అంతర్జాతీయ మానవ హక్కుల ప్రమాణాలు అనుమతిస్తాయి. సామాన్యంగా ప్రభుత్వం ఇట్టి నిలిపివేతకు అత్యవసర అధికారాలు యిచ్చేది- తీవ్రవాదానికి హింసకీ త్రోవతీసే జాతిపరమైన అంతరంగిక రాజకీయ సంఘర్షణ. అలాంటి సందర్భాలలో పోలీసుకు లేదా భద్రతా దళాలకు వెదకడానికి, అరెస్టు చేయడానికి, విచారణ లేకుండా బందీ చేయడానికి అదనపు అధికారాలు ఇవ్వబడతాయి.

## తాత్కాలికంగా నిలిపివేయబడరాని హక్కులు

ప్రజాస్వామ్య సమాజం అత్యవసర అధికారాలను చాలావరకు అయిష్టతతోనే ఉపయోగిస్తుంది. ఉపయోగించినా అతి స్వల్పంగానే అతి స్వల్పకాలం వరకే అత్యవసరమయినపుడే ఉపయోగిస్తుంది. అంతేకాకుండా దుర్వినియోగం కాకుండా అత్యధిక రక్షణలతోనే ఉపయోగిస్తుంది. అత్యవసర పరిస్థితులలోను తాత్కాలికంగా కూడా నిలపదగినవి కొన్ని హక్కులున్నాయి. ఉదాహరణకి : హింస నుండి స్వేచ్ఛ, జీవించడానికి, ఆలోచనకి, అంతరాత్మకి స్వేచ్ఛ. ఇవి తొలగించుటకు వీలులేని హక్కులుగా గుర్తించబడ్డాయి. ఆ మేరకు అవి సంపూర్ణమైన హక్కులూ, స్వేచ్ఛలూ.

## 61. ప్రజాస్వామ్యం న్యాయబద్ధంగా ఏ ఒక్కరినైనా పౌరసత్వంనుంచి మినహాయించవచ్చా?

దానికి సమాధానమేమంటే రాజ్యానికి ఎవరు పౌరుడు, పౌర హక్కులెలా పొందాలి అనే విషయంలో నిర్ణయించే హక్కు నియమబద్ధంగా వుంది. ఈ సార్వభౌమ హక్కు వినియోగించడంలో వివక్ష పనికిరాదు. ఉదాహరణకు జాతిపరంగా వలసపోవడానికి, జాతిపరంగా వివక్ష చూపే విధానాన్ని అనుసరించడం- రాజ్యం అంతర్జాతీయంగా కాందిశీకులను అనుమతించడంపై ధృవీకరించబడిన ఒప్పందాలకు కట్టుబడి వుండాలి.

### నివాస విదేశీయుల హక్కులు

ప్రభుత్వం నివాసేతరులకు రాజకీయ హక్కులు లేవనవచ్చును. కానీ ఇప్పటి పోకడ ఏమంటే ఇంత కాల వ్యవధిని అనుసరించి దేశంలో నివసిస్తున్న విదేశీయులకు ఓటింగు హక్కుతో సహా రాజకీయాలలో పాల్గొనడానికి అనుమతించడం ఒక ప్రజాస్వామిక ఆచరణ (చూ.ప్ర. 21). ఈ పౌరసత్వంతోపాటూ వుండే రాజకీయ హక్కులు కాక న్యాయబద్ధంగా తమ దేశంలో నివసిస్తున్న విదేశీయుల ఇతర మౌలిక హక్కులు, స్వేచ్ఛలు వివక్ష, పక్షపాతం నుండి రక్షించబడేటట్లు చూడడం రాజ్యం విధి.[9]

---

9. భారతదేశంలో విదేశీవాసులకు ఓటుహక్కుతోసహా రాజకీయాలలో పాల్గొనడానికి హక్కులు ఇవ్వబడలేదు కాని వారికి ఇతర మౌలిక హక్కులని, స్వేచ్ఛలనీ హామీ ఇవ్వబడింది.




మానవ హక్కుల విద్య, పోలీసు, సైన్యవిభాగాల
అధికారులకి కూడా విస్తరిల్లాలి

## 62. ప్రజాస్వామ్యంలో అల్పసంఖ్యాకులకు ఏమైనా హక్కులు వున్నాయా?

అంతర్జాతీయ మానవ హక్కుల ప్రమాణాలు అల్పసంఖ్యాక వర్గాలకు కొన్ని స్పష్టమైన హామీలనిచ్చాయి. ఈ వర్గాలు మత, సాంస్కృతిక, జాతీయ భాషాపర, జాతిపరమైన అల్పసంఖ్యాకులు కావచ్చును. అట్టి వర్గాలు వారి ఉనికిని గుర్తించడానికి వారి నిర్దిష్ట వ్యక్తిత్వాన్ని రక్షించుకోడానికి, దాన్ని పెంచి పోషించుకోవడానికి మాత్రమే రాజ్యం వుంది. ఈ వర్గాలలోని వ్యక్తులకు సమాన ప్రతిపత్తితో దేశ విషయాలలో పాల్గొనే హక్కు, వారు నివసించే ప్రాంతాల వర్గాలకు సంబంధించిన నిర్ణయాలలో పాల్గొనే హక్కుతోపాటు ప్రజాస్వామిక హక్కులూ కావాలి.

### అల్పసంఖ్యాకులపై ఐక్యరాజ్యసమితి ప్రకటన

జాతీయ లేక జాతిపరమైన, మతపరమైన, భాషాపరమైన అల్పసంఖ్యాకుల హక్కులపై ఐక్యరాజ్యసమితి సాధారణ సభలో డిసెంబర్ 1992లో తీర్మానించబడ్డాయి. అన్నింటిలో కాకపోయినా కొన్ని రాజ్యాలలో అల్పసంఖ్యాకవర్గాలున్నాయి. వారి హక్కులయెడల సకారాత్మక దృక్పథం వుండడాన్ని ప్రజాస్వామ్య సమాజానికి ఒక పరీక్షగా ఎంచవచ్చును. ఈ ప్రకటన యొక్క నియమాలను అన్ని దేశాలలోను అమలుపరచడం ఒక స్పష్టమైన అవసరమైన ఉద్దేశ్యం.

## 63. ఆచరణలో మానవ హక్కులను ఎలా పరిరక్షించాలి?

హక్కుల పరిరక్షణకు ఏర్పరుచుకొనే పద్ధతులలో ప్రజాస్వామ్య దేశాలు విభేదిస్తాయి. కానీ అంతర్జాతీయ ప్రమాణాలు ప్రతీ వ్యక్తీ ఒక హక్కు భంగపడినట్లు ఆరోపింపబడినపుడు నివారణ కలిగివుండాలనే నిబంధనతోపాటు కొన్ని సూచనలను అందిస్తాయి. వారివారి దేశాలను అంగీకరించిన మానవ హక్కులపై, అంతర్జాతీయ ఒడంబడికలపై ఆధారంగా వ్యక్తులు వారి హక్కులను అభ్యర్థించగలగాలి. ప్రజాస్వామ్య ప్రవృత్తిలో కొన్ని రాజ్యాలు మాత్రమే మానవ హక్కుల బాధ్యతలను నిర్వర్తించే లిఖిత రాజ్యాంగాలు కలిగి వుంటాయి. సామాన్యంగా రాజ్యాంగ హక్కుల పత్రంలో నిర్వచించబడిన వ్యక్తి హక్కుల పరిరక్షణకు ముందువరుసలో న్యాయస్థానాలుంటాయి. వ్యక్తులకు వారివారి హక్కులను పరీక్షించుకోడానికి అవసరమైతే న్యాయ సహాయంతో సహా న్యాయస్థానానికి ఆటంకం లేని అందుబాటు వుండాలి. ప్రభుత్వం న్యాయస్థానాల తీర్పులను

ఉత్తర్వులను అమలుచేయాలి. రాజ్యాంగం అలా విధించనట్లయితే అమలులో చట్టాలను రద్దుచేయడం, నష్టపరిహారం ఇవ్వడం కూడా చేరివుండాలి. కానీ హక్కుల పరిరక్షణకు ఉదాహరణకు అన్నిరకాల వివక్షను న్యాయరహితం చేయడానికి బలహీనవర్గాలు-పిల్లలు సామాజికంగా అసానుకూలతలు కలిగిన వారికి, వికలాంగులకు మౌలికంగా రావలసిన వాటిని సాధించుకోవడానికి చట్టాల వలన, ఇతర చర్యల ద్వారా సకారాత్మక చర్యలు కూడా అవసరమవుతాయి.

## హక్కుల పరిరక్షణకై సంస్థలు

న్యాయాన్ని-అర్హతలనుసరించి రావలసిన వాటిని పొందటానికి ప్రజాస్వామ్యంలో ప్రజలు ఎన్నుకొన్న ప్రతినిధుల సహాయాన్ని అర్థిస్తారు. ప్రచార సాధనాలు పత్రికలూ కూడా హక్కుల దుర్వినియోగంలో కావలికుక్క పాత్రను నిర్వహిస్తాయి. ఆచరణలో ఒక శ్రేణి సంస్థలు హక్కుల పరిరక్షణలో ఉపయోగించబడతాయి. ఉదాహరణకు : ఆంబుడ్స్‌మన్ వ్యవస్థ లేదా ప్రభుత్వ పాలనా కార్యక్రమాన్ని పర్యవేక్షించే ఒక స్వతంత్ర ఉద్యోగికాని ప్రజాస్వామ్యానికి అతి ముఖ్య రక్షణ దాని నియమాలలో దాని ప్రయోజనాలలో ప్రజల విశ్వాసం కాబట్టి అన్ని స్థాయిలలోను మానవహక్కుల ప్రజాస్వామ్య పౌరసత్వ విద్య అత్యంత అవసరం. ఈ విద్యాకార్యక్రమాలు పాఠశాలలకు, కళాశాలలకు పరిమితం కాకూడదు. ఇవి పోలీసు, సైన్యంతో కూడిన ప్రజాధికారులందరి వరకు విస్తరించాలి.

5

# ప్రజాస్వామ్య లేదా పౌర సమాజం

## 64. పౌర సమాజం అంటమేమిటి?

ప్రభుత్వ అధీనంలోనే సామాజిక వ్యవస్థల స్థాపన పర్యవేక్షణ చేయాలనుకున్నా 20వ శతాబ్దపు ఫాసిస్టు, కమ్యూనిస్టు నియంతృత్వాల ఫలితంగా ప్రజాస్వామ్యం యొక్క అవసరంలో భాగంగా పౌర సమాజ భావం ప్రత్యేకంగా ఊనికనివ్వబడింది. పౌర సమాజ భావనను రెండు విభిన్న కోణాలనుంచి చూడవచ్చు. ఋణాత్మకంగా సమాజం యొక్క కార్యకలాపాలను నియంత్రణ చేయడం నివారించడానికి జీవితంలో ప్రభుత్వం అన్ని రంగాలలోను చొచ్చుకుపోవడాన్నీ సామాజిక చొరవ ప్రతిభను పీల్చే అవకాశాన్ని నియమితం చేయడం, ధనాత్మకంగా సకారాత్మకంగా సమాజంలోనే స్వతంత్రంగా స్వయంగా ఏర్పరుచుకొనే చాలా వ్యవస్థలుండడానికి ప్రజలు సామూహికంగా పనిచేసి, తమ సమస్యలను తీర్చుకొనేలా, దురాక్రమణల నుంచి రక్షించుకొని అవి ప్రజాభిప్రాయాన్ని ప్రభుత్వంపై ఒత్తిడి తీసుకొని వచ్చే మార్గాలుగా పని చేయించడానికి.

### పౌర సమాజంలోని భాగాలు

పౌర సమాజంలో ముఖ్యభాగాలు : విపణి ఆర్థిక వ్యవస్థ (చూ.ప్ర.9), స్వతంత్ర ప్రచార సాధనాలు (చూ.ప్ర. 6) ప్రభుత్వానికి స్వతంత్రంగా వినగలిగే ప్రభుత్వ విధానాలు అనేక ముఖాలలో నిపుణుల వనరులు అతిప్రధానంగా సమాజంలో వాటిగుండా ప్రజలు వారివారి వ్యవహారాలను అజమాయిషీ చేయగల సంపన్నమవుతున్న స్వచ్ఛంద సంస్థలు వివిధ కాలాలలో వివిధ ప్రదేశాలలో ప్రజాస్వామ్య రక్షణను ప్రోత్సహిస్తాయి. అవి ట్రేడ్ యూనియన్లు, వృత్తి పరమైన సంఘాలు, స్త్రీల బృందాలు, మానవ హక్కుల మరియు అభివృద్ధి సంస్థలూ లేక అట్టడుగు స్థాయి నుండి వచ్చిన ఏరకమైన సంస్థలైనా కావచ్చును.

భావ ప్రకటనా స్వేచ్ఛ సంఘంగా ఏర్పడే స్వేచ్ఛ, ఉన్న వాతావరణంలో అలాంటి బృందాలు ప్రయత్నం లేకుండా వాటంతట అవే అభివృద్ధి చెందగలవు. ప్రజలు వారి వారి వ్యవహారాలను వ్యవస్థీకరించడానికి వాటి రక్షణకీ వారి ప్రయోజనాలను ముందుకు తీసుకుపోడానికి సామూహిక చర్య అవసరాన్ని గుర్తించినపుడు వాటిని ప్రోత్సహించవచ్చును. ఉదాహరణకు : ప్రభుత్వ విధానాలలో వారి సంప్రదింపు పాత్రను గుర్తించడంద్వారా.

## 65. పౌర సంఘాలు అప్రజాస్వామికంగా వుండగలవా?

పౌర సంఘాలు వ్యవస్థీకరణలో నిధులను సమకూర్చుకొనడంలో స్వతంత్రమైనవి కాబట్టి ప్రభుత్వ విధానాలలో తగు అంశాలని మార్పు చేయడానికిగాని లేదా విఫలం చేయడానికిగాని తగిన శక్తి గలిగి వుంటాయి. ఇది ఏ స్థితిలో అప్రజాస్వామికం అవుతుందన్నది నిర్వచించడం కష్టం. చాలా ప్రజాస్వామ్య దేశాలు వ్యవస్థీకరింపబడిన సామాజిక బృందాలతో సంప్రదించి వారితో రాజీ అవుతాయి. ఎందుచేతనంటే సంప్రదింపు, ఏకీభావం ప్రభుత్వాన్ని నడపడానికి ముఖ్య అవసరం. వారి వారి ప్రయోజనాల కొరకు కృషి చేసే కొన్ని వర్గాలు మరికొన్ని వర్గాల కంటే శక్తివంతంగా ఉంటాయి. వాటి వ్యవస్థ, ఆర్థిక వనరులూ, వారి వారి పలుకుబడీ కొన్ని ఇతర సంఘాల కంటే చాలా ఎక్కువగా వుండవచ్చును. ఇట్టి ప్రభావం సామూహిక సభ్యత్వం వలన వచ్చినదైతే ఆ సంఘం ధనం వల్ల, పలుకుబడి వల్ల ఏర్పడిన సంఘం కంటే ఎక్కువ ప్రజాస్వామికమైనదిగా ఏ సంఘంలో వ్యవస్థ ప్రజాస్వామికంగా ఉంటే, ఏ సంఘంలో నాయకులు సభ్యులకు సరియైన ప్రతినిధులైతే అట్టి సంఘాలని గంభీరంగా పరిగణించాలి. చివరగా ప్రజాస్వామ్య సమాజం ప్రజలకు ప్రాతినిధ్యం వహించే సామాజిక, ఆర్థిక, భౌతికమైన లోపాల కారణంగా రాజకీయ ప్రవృత్తిలో వారికి పలుకుబడి లేక శక్తిహీనులై వుండే వారికి సలహా సంప్రదింపులలో ప్రత్యేక స్థానాన్ని ఇవ్వాలి.

## 66. ఆర్థిక సంస్థలు అంతర్గతంగా ప్రజాస్వామికంగా వుండగలవా?

చాలామంది ప్రజాస్వామికులు వారి వారి పని స్థలాలు వారి జీవితాల లక్షణాన్ని నిర్ణయించేవి గనక ఆ స్థలాలను ప్రజాస్వామీకరించడానికి ప్రాముఖ్యాన్ని ఇవ్వడం అవసరమని వాదించారు. కనీస పక్షంగా దీని అర్థమేమంటే యజమానులు, శ్రామికులు

ట్రేడ్ యూనియన్లు ఏర్పాటు చేసుకోవడానికి ఆటంకాలు కలిగించకుండా ఉండడం. దీని వల్ల శ్రామికులు సామూహికంగా వారి జీవన ప్రమాణాలను పెంపు చేసుకోవడానికి హక్కులను రక్షించుకోవడానికి, శ్రమ పరిస్థితులను మెరుగు పరచుకోవడానికి పని చేస్తారు. ఇంకా ఆదర్శవంతమైన ఉద్దేశ్యమేమంటే శ్రామికులకు తమ బాధ్యతలతో కట్టుబడి నిర్ణయాలలో లాభాలలో భాగం పంచుకొనే అవకాశం ఇవ్వడం. అట్టి ప్రణాళికలు శ్రామికులను పనిలోంచి తొలగించేందుకు అవకాశాలను కలిగిస్తాయని ఒక వాదన. కానీ ఇవి శ్రామికులలో క్రమశిక్షణ ఇవ్వడానికి ఉద్యోగుల సృజనాత్మకమైన శక్తులను ప్రోత్సహించడానికి అవకాశాన్నిస్తాయి. శ్రామికులని పాలికులని అనడం కంటే పౌరులుగా పరిగణించడం ఉత్తమం. కాబట్టి మరోలా చెప్పాలంటే పని స్థలపు ప్రజాస్వామీకరణ జీతాలలోను యాజమాన్యం పనిస్థలాల పరిస్థితుల మధ్య తేడాలను పరిమితం చేయడానికి ఒత్తిడులను పుట్టింప చేస్తాయని అనుకున్నా ప్రజాస్వామ్యం, పనిలో నైపుణ్యం విభిన్నంగా ఉండేవి కానక్కరలేదు.

### ఆర్థిక సంస్థల జవాబుదారీ

ప్రజాస్వామ్య సమాజంలో స్థానిక ప్రజల యెడల కూడా ఆర్థికసంస్థలకు కొన్ని బాధ్యతలున్నాయి. ముఖ్యంగా సంస్థల యొక్క పరిసరాలపై ప్రభావం దృష్ట్యా ప్రభుత్వ సంస్థల వల్ల, వాటి కార్యకలాపాల వల్ల నష్టం వాటిల్లితే ప్రజలకు వాటి నివారణ హక్కు ఉడాలి. అలాగే ప్రైవేటు సంస్థలు వారి ఆరోగ్యానికి శ్రేయస్సుకీ నష్టం కలిగించేవైతే దీనికీ నివారణ కావాలి. అందుచేత ప్రైవేటు సంస్థలూ కూడా పరిసరాల పరిరక్షణకు చట్ట బద్ధమైన నియమాలకు లోబడి ప్రవర్తించాలి.

## 67. ప్రజాస్వామ్యానికి ప్రైవేటు ఆస్తి అవసరమా?

ప్రైవేటు ఆస్తి వ్యవస్థ ఉండాలని అది విపణి ఆర్థిక వ్యవస్థకు అవసరమని కొంతమంది ఆర్థిక వేత్తల వాదన. వాటితోపాటు ప్రభుత్వానికి స్వతంత్రంగా రాజకీయ కార్యకలాపాలను కొనసాగించడం యొక్క ప్రాముఖ్యానికి సంబంధించిన రాజకీయ వాదనలు కూడా వున్నాయి. ప్రైవేటు ఆస్తి ఈ విధంగా సమాజానికి కేంద్రక సంస్థగాను రాజకీయస్వేచ్ఛకు రక్షణగాను పరిగణించాలి.

### ప్రైవేటు ఆస్తిపై పరిమితులు

ప్రైవేటు ఆస్తి హక్కుపై ప్రభుత్వ జోక్యాన్ని, వ్యక్తి స్వేచ్ఛను ప్రమాదంగా భావించి

ప్రతిటించాలని అనుకోనవసరంలేదు. సామాజికంగా గుర్తింపబడి అమలు పరిచిన వ్యక్తి స్వేచ్ఛ మితిపైనే ప్రైవేటు ఆస్తి సంస్థ అనుమతించబడినది. అట్టి ఆస్తిని మినహాయించి ఉపయోగించడం ఇతరులకు దాని అందుబాటుని నియమితం చేయడాన్ని ముందుగా భావిస్తుంది. ఆ స్వేచ్ఛను కాదనడానికి సంబంధించిన షరతులు సామాజికంగా నిర్ణయించబడాలి. న్యాయబద్ధంగా పరిస్థితులు మారినపుడు అవి చట్టంలోని మార్పులకు లోబడి ఉండాలి. క్లుప్తంగా చెప్పాలంటే ఆస్తి యొక్క వినియోగాన్ని చట్టంచే న్యాయబద్ధంగా నియంత్రించవచ్చు. ఆస్తి పంపిణీ బహిరంగ పౌరవిధానం ముఖ్యమైనదే అయినా సామూహికంగా ఆమోదింపబడిన షరతుల పరిమితాలలో తప్ప అది స్వాభావిక లేదా సంపూర్ణ హక్కు కాలేదు.

## 68. ప్రజాస్వామ్యం ఆర్థిక అసమానతలతో పొందిక కలిగినదేనా?

ఈ ప్రశ్నకు ఔను కాదు అనే సరళమైన సమాధానం లేదు.అది అంశా విషయం. సమాజంలో ఎంత ఎక్కువ ఆర్థిక అసమానతలుంటే - ధనం కూడబెట్టడం రాజకీయ ఫలితాలను నిర్ణయించే సాధనంగా ఉపయోగించడం వలన - రాజకీయ సమానత్వం అంతకష్టమవుతుంది. చాలా తీవ్ర సందర్భాలలో ధనికులు బీదవారి ఓట్లను వారి ప్రయోజనాలకు ముప్పు కలిగించేవిగా భావించి నియోజక వృత్తిని నిష్ఫలితం చేయడానికి లేదా వారికి ప్రయోజనకారి అయినట్లు మార్చడానికి ప్రయత్నిస్తారు. అటువంటి బీదలు ప్రజాస్వామిక మార్గాలలో వారి స్థితిని అభివృద్ధి చేసుకొనే ఆశలేక ప్రజాస్వామ్యం మద్దతు నివ్వదగినది కాదనుకుంటారు. ఇక్కడి ప్రశ్న ప్రజాస్వామ్యంలో ఉన్నానాణ్యత కాదు, దానిని ఏ రూపంలో అయినా కొనసాగించడం ఎలా అన్నది ప్రశ్న.

### రాజకీయ అసమానతను అత్యల్పం చేయడం

విపణి ఆర్థిక వ్యవస్థలో కొంత మేరకు ఆర్థిక అసమానత సమర్థనీయమైనదీ, తప్పని సరీ కూడా. అసమానతల యొక్క రాజకీయ ప్రభావాన్ని లేదా వాటి వల్ల వచ్చే ఫలితాలను తగ్గించడం ప్రజాస్వామ్యపు ఆతురతా, విధి. ఈ పరిమితి నిర్ణయంలో ఒక చివర కఠినమైన చట్టం వుంది. ఎన్నికల ఖర్చులపై పార్టీలకు, వ్యక్తులకు ఒక పరిమితి, ప్రచార స్థానాల గాఢతను తగ్గించడం ఆ చట్టం విధులు మరొక చివర పౌరులందరికీ కార్యసాధకమైన పౌరసత్వాన్ని నిర్వహించడానికి కనీస జీవన అవసరాలకి హామీ వుండాలి.

## 69. ప్రజాస్వామ్యం ఆర్థిక అభివృద్ధిపై ఆధారపడుతుందా?

దేశం ఆర్థికంగా అభివృద్ధి చెందినదైనకొద్దీ నియంతృత్వంలోకి దిగజారకుండా ప్రజాస్వామ్యాన్నికొనసాగిస్తుందనడానికి పరిగణించదగినన్ని ఋజువులున్నాయి. దీనికి కారణం పౌరులకీ, పౌర బృందానికీ, వారి సమాజ నిర్మాణం మీద, ఆర్థికాభివృద్ధి మీద ఉన్న ప్రభావమే. విస్తృతంగా అక్షరాస్యతా, విద్యా వ్యాపించిఉంటే పరిపక్వమైన, విజ్ఞాన వంతమైన నియోజకవర్గాలోస్తాయి. అభివృద్ధి చెందిన మధ్య తరగతి వివిధ సాంకేతిక వృత్తి పరమైన పాత్రలను నిర్వహిస్తూ వుంటే పితృస్వామిక లేదా నియంతృత్వ ప్రభుత్వ విధానాలకు ప్రతిఘటన బలంగా ఉంటుంది. ఆర్థిక అభివృద్ధి ప్రవృత్తి పౌర సమానత్వ జటిలతనూ, స్వయంగా వ్యవస్థీకరించుకున్న బృందాలకూ, సంఘాలకూ తమను తాము ప్రభుత్వ జోక్యం నుంచి రక్షించుకోగలమన్న నమ్మకాన్నీ స్వతంత్రతనూ పెంచుతుంది.

### మినహాయింపులు

ఎక్కువ స్థాయి ఆర్థికాభివృద్ధి ఉన్నప్పుడు మాత్రమే ప్రజాస్వామ్యం కొనసాగుతుందనుకోవడం పొరపాటు. అన్ని ఖండాలలోను తలసరి ఆదాయం తక్కువై తక్కువ స్థాయి ఆర్థికాభివృద్ధిగల దేశాలు (భారత్, జమైకా, బోస్వానా) దశాబ్దాలుగా బహిరంగ నియోజక పోటీని కొనసాగిస్తున్న ఉదాహరణలూ ఉన్నాయి. ప్రభుత్వం సార్వత్రిక అక్షరాస్యతా విధానలను ప్రోత్సహించడం ఒక ప్రత్యేకస్థాయి ఆర్థికాభివృద్ధి కంటే ఎక్కువ ముఖ్యం కావచ్చును. వారెక్కడ ప్రారంభించినప్పటికీ చిన్న వయస్సులోని ప్రజాస్వామ్యాలకు కావలసినదేమంటే కొనసాగించగలిగిన ఆర్థిక అభివృద్ధి పంపిణీలోని ఘర్షణలు తగ్గి దీని వలన సమాజంలోని వివిధ వర్గాలు మెరుగుదలను పంచుకోగలరు. అభివృద్ధి చెందిన దేశాలు ప్రముఖ అంతర్జాతీయ ఆర్థిక సంస్థలు ఈ సందర్భంలో సహాయం చేయడానికి లేదా అడ్డంకి కావడానికి అవకాశం ఉంటుంది.

## 70. మతం ప్రజాస్వామ్యానికి సహాయకారా లేదా అడ్డంకా?

ఔను, కాదు అని సమాధానం చెప్పలేని ప్రశ్నలలో ఇది ఒకటి. ఎందుచేతనంటే ఈ ప్రశ్నకి సమాధానం సందర్భం మీద ఆధారపడి వుంటుంది కాబట్టి. ప్రపంచంలోని గొప్ప మత విశ్వాసాలను ఖచ్చితంగా వర్గాల కింద విభజింపలేము. కొన్ని ప్రజాస్వామ్యాన్ని బలపరిచేవి, కొన్ని తటస్థమైనవి, కొన్ని ప్రజాస్వామ్యానికి హాని కలిగించేవి. కారణమేమంటే మతాలన్నింటిలోను పోటీ పడే విభిన్న పోకడలుంటాయి. చారిత్రకంగా

క్రైస్తవ మతం రాజరికాన్ని దైవదత్త హక్కుగాను, సమాన గణతంత్రంగాను పరిగణించి రెండింటికీ మద్దతునిచ్చింది. ఒకే సమయంలో దీనిలో ప్రభావం కలిగిన వర్గాలు, ఇతర విశ్వాసాలను సమర్థించాయి. నియంతృత్వాలనూ సమర్థించాయి. మరికొన్ని వర్గాలు ఆయా విశ్వాసాల ప్రత్యర్థులను రక్షించడానికి, వారి మానవ హక్కుల భంగపాటును చాటడానికి ప్రాణాలను సహితం ప్రమాదగ్రస్తం చేశాయి.

## మతమూ - రాజ్యమూ

నమ్మేవారిలో విశ్వాసానికి సంబంధించిన సజీవమైన చర్చకీ అర్థవివరణకీ లోబడే మతాలుకంటే మీదనుంచీ అందింపబడిన సత్యాలను ప్రశ్నించకుండా నమ్మే శ్రేణీ బద్ధమైన మతాలు ప్రజాస్వామ్యానికి తక్కువ దోహదకారిగా ఉంటాయని వాదించ వచ్చును. ప్రజాస్వామ్యానికి  అంతరంగిక వ్యవస్థ కంటే రాజ్యంతో మతానికి ఉన్న సంబంధం ముఖ్యమైనది. మతమూ, రాజ్యమూ రెంటిమధ్య ఎంత దగ్గర సంబంధం వుంటే వేరొక మతానికి చెందిన వారిని సమాన పౌరులుగా పరిణించబడడం అంత తక్కువగా సంభవం. తీవ్ర పరిస్థితులలో మతాధికారులు రాజ్యాన్ని భూమి మీద మత విషయమైన ప్రయోజనాన్ని తీర్చేదైన పరికరంగా పరిగణిస్తే రాజకీయాలు మత యుద్ధాలుగా మారిపోతాయి. ఇతర మతాలలోని సభ్యులను ఒక వరుసలో నిలిపి వారిని హింసించడం, వారి భావ ప్రకటనా స్వతంత్రాన్ని కట్టడి చేయడం జరుగుతుంది.

## మతసహనం

ఇలాంటి బాధతో కలిసిన చారిత్రక అనుభవాలనుంచీ, అంతర్యుద్ధాలనుంచీ జాతి పరమైన హింస పుట్టి అందులోనుంచి మత సహనమనే ఆలోచన వెలువడింది. మనమతమే అన్నింటినీ మించి చివరికి మిగిలే సత్యాన్ని కలిగినదని మనం నమ్మినా, దానిని ఇతరులను నమ్మమని ఒత్తిడి చేయడం యొక్క ఖరీదు వివిధ మతాల బహుతా లక్షణం వున్న ప్రపంచంలో మానవ గణనలో చాలా ఎక్కువ సహనమంటే మన నమ్మకాలను వదలి పారేయమని అర్థం కాదు. లేదా ఇతరులపై ప్రభావం చూపకుండా వుండడమూ కాదు. దానికర్థమేమంటే ప్రజలు - వారు పొరపాటుగా ఎంచుకోడానికి అది దారి తీసినా - వారికి వారే నిర్ణయించుకొనే మౌలిక మానవ హక్కుదాన్ని ఇవ్వడం.

## అల్పసంఖ్యాక మతాలు

సహనమూ మత వైవిధ్యాల ఎడల అంగీకారాన్ని పొందడానికి అతి కార్యసాధకమైన

పరిసరాలేమంటే ఏ మతం పై విశ్వాసానికీ ప్రతిష్టాకరమైన స్థానాన్ని ఇవ్వని రాజ్యమే. అట్టి రాజ్యం వివిధ మతాలకు ఒకే విధమైన మద్దతునిస్తుంది. పన్నుల విధింపు ద్వారా, మత పరమైన విద్యను అందించడం ద్వారా. రాజ్య ఉత్సవాల విషయంలో అధిక సంఖ్యాకుల మతాన్నిఉపయోగించే రాజ్యంలో కూడా సహనం ఉండవచ్చును. కానీ అధిక సంఖ్యాకుల మతాన్ని నమ్మని వారి మీద రుద్దడానికి ప్రయత్నిస్తే తప్పనిసరిగా అది మరొక విశ్వాసం కలిగినవారి మౌలిక ప్రజాస్వామ్య స్వేచ్ఛలను అధిక సంఖ్యాక మతంలోని వారి స్వేచ్ఛలతో కలిపి (భావ ప్రకటన సమాజంగా ఏర్పడడం మొదలైన స్వేచ్ఛలను) భంగపరుస్తుంది. ఇక్కడ మనం అధిక సంఖ్యాకులు ఒక క్షణంలో ఏమి కోరుకుంటారు - రాజకీయ స్వతంత్రానికి ప్రభుత్వంపై కొనసాగే ప్రజానియంత్రణకీ కావలసిన పరిస్థితులూ అనే రెండింటిపై విభిన్నతను గమనించాలి.

## 71. మతపరమైన, జాతి పరమైన సంఘర్షణలున్నచోట ప్రజాస్వామ్యం ఉండడం సాధ్యమేనా?

ఒకే ప్రదేశంలో ప్రజలకి ఒకే రాజకీయ వ్యక్తిత్వం లేకపోతే స్వతంత్ర సంస్థలు కొనసాగింపబడడం కష్టమనే నిర్ణయాన్ని వ్యతిరేకించలేము. జాతీ, మత భాషా విభేదాలకు అతీతమైన ఈ వ్యక్తిత్వం చారిత్రక అనుభవాన్ని పంచుకోవడం నుంచి పొందవచ్చును. అన్ని వర్గాలను స్వచ్ఛంగా పరిగణించే అందరూ దానితో ఏకీభవించే రాజకీయ సంస్థలున్నప్పుడు దానిని పెంచవచ్చును. రాజకీయ పదవికి ఏ వర్గాన్నైనా మినహాయిస్తే దాని వలన ఆ వర్గానికి వచ్చే వివక్ష అనుకూలత అణగద్రొక్కడం వంటి భయాల నుంచి జాతిపరమైన వైరం పెరుగుతుంది. దూరదృష్టిలేని రాజకీయ నాయకులు ఇటువంటి భయాలను పెంచడం వలన తాత్కాలికంగా అనుకూలతలను పొందవచ్చు. కాని వేర్పడడం విభజన, అవి సాధ్యమైనపుడు కూడా, నిస్పృహతో కూడిన పరిష్కారాలు మాత్రమే. ఇవి సమస్యను వాయిదా వేసేవి. అంతేగాక వ్యధకు గురియైన ఒక క్రొత్త అల్పసంఖ్యాక వర్గాన్ని తయారు చేసేవి. భవిష్యత్తులో కొత్త అణచివేతలకు గురిచేసే వర్గాలను సృష్టించడం చారిత్రకంగా వస్తున్న అణచివేతకు పరిష్కారంకాదు.

### రాజ్యాంగపరమైన రక్షణలు

సమకాలీన సమాజాలలో జాతులు, మతాలు కలిసి ఉండడం వల్ల వివక్ష నుంచి అణచివేత నుంచి అల్ప సంఖ్యాక వర్గాలన్నింటికీ రక్షణ కొరకు రాజ్యాంగపరమైన




రాజకీయం + గృహ జీవితం (అంతరంగిక లక్షణం)

ఏర్పాట్లు అవసరమవుతాయి. (చూ॥ పు॥ 10, 12, 50, 63) అట్టి ఏర్పాట్లు చేయబడినట్లు తగిన ఋజువులు లేకుండా ఏ క్రొత్త రాజ్యానికీ అంతర్జాతీయ గుర్తింపు ఇవ్వకూడదు.

## 72. ప్రజాస్వామ్యానికి కుటుంబ వ్యవస్థ ఎలా అవసరమైనది?

చారిత్రకంగా ఈనాటి అన్ని సమజాలలో కుటుంబంలోని స్త్రీలే పిల్లల పెంపకం, పిల్లల రక్షణ గృహ సంబంధమైన పనులు చూసుకోవడం, పురుషుల అవసరాలని తీర్చడం మొదలైన ముఖ్యమైన బాధ్యతలను వహిస్తున్నారు. గృహ సంబంధమైన ఈ ఏర్పాట్లు కేవలం ఆంతరంగిక విషయంగా కనబడినా ప్రజాస్వామ్య కార్యకలాపాలలో స్త్రీల కాలాన్నీ, శక్తినీ నియమితం చేయడం వలన ప్రజాజీవితంలో అవి చాలా అర్థవంతమైనవి. ఇట్టి ఏర్పాట్లు వాటిని ప్రోత్సహించే దృక్పథాలు నిలిచి ఉన్నంత కాలం స్త్రీలకు రాజకీయ సమానత్వం రాదు. వారు లేకపోవడం వలన ప్రజాస్వామిక జీవనం నష్టపోతుంది. కానీ ప్రజాజీవితంలో స్త్రీల హోదా తగిన విధానాల వలన స్త్రీ సంఘాలు స్వయం సేవా బృందాల ద్వారా అవి ప్రభుత్వాన్ని ప్రభావితం చేయడం వల్ల పొందడానికి సాధ్యమవుతుంది.

### పిల్లలూ-ప్రజాస్వామ్యం

రేపటి పౌరుల అభివృద్ధికి సహాయం చేసే సకారాత్మకమైన పాత్రను నిర్వహించడంలో కుటుంబానికి చాలా ప్రాధాన్యత ఉంది. సమాన ఆదరణ పరిగణింపు గృహ సంబంధమైన విషయాలలో ఇతరుల మాటలను గౌరవించడంలోను హక్కులను పొందడం అంటే తత్సంబంధమైన విధులను నిర్వర్తించాలని గుర్తించడం చిన్నప్పటి నుంచీ అనుభవాలైతే అవి తరువాత ప్రజాస్వామ్య పౌరులుగా వ్యవహరించడానికి ముఖ్యమవుతాయి. విశాల సమాజం యెడల దృక్పథాలను పిల్లలు కుటుంబం ద్వారానే అలవరుచుకుంటారు. ప్రజా కార్యకలాపాల యెడల ఏర్పరచుకున్న అభిప్రాయాలు వారు పెద్దయ్యాక కూడా నిలిచి ఉంటాయి.

## 73. పాఠశాలలు ప్రజాస్వామ్యం కొరకు విద్యలో ఎట్టి పాత్రను నిర్వహిస్తాయి?

ప్రత్యేక నైపుణ్యాలు, సామర్థ్యాలు పెంచడమే కాక ప్రత్యేకంగా అక్షరాస్యత విజ్ఞాన వ్యాపనతోపాటు పాఠశాలలు సమాజం యొక్క సంస్కృతీ, సంప్రదాయాలను విద్యార్థులకు అందించడంలో ప్రముఖ పాత్రను నిర్వహిస్తాయి. వివిధ సంస్కృతుల

విమర్శనాత్మక గణనలో కూడా పాఠశాలలకి ఒక పాత్ర ఉంది. చాలా మతాలూ, నమ్మకాలూ ఉన్న పరస్పర ఆధారమైన ప్రపంచంలో వారి స్థానమేమిటో పిల్లలకు బోధపడేటట్టు చేయడంలో పాఠశాలలు సహకరిస్తాయి. ప్రజాస్వామ్యంలో ఇంకా ప్రత్యేక శిక్షణ దేశ రాజ్యాంగం ఎలా అభివృద్ధి చెందినది, పౌరసత్వపు విధులు స్వేచ్ఛల యెడల ఆచరణాత్మక విజ్ఞానం మానవ హక్కులు వాటి ప్రాముఖ్యంపై అవగాహన పాఠశాల నుంచి పొందవచ్చును. ప్రజాస్వామ్య విద్య కేవలం విజ్ఞాన సముపార్జనకే కాదు. ఆ విద్య తరగతి సభల వల్ల ఎన్నికైన పాఠశాల సంఘాల సామూహిక నిర్ణయాలలో పాలుపంచుకోవడం వల్ల పెంచబడుతుంది. ఈ విద్య ఏ వయస్సులో ఇవ్వాలన్నది ఆయా దేశాల యొక్క అప్పటి విద్యావిధానం మీద ఆధారపడి ఉంటుంది. ఇది 'రాజకీయ'మని ప్రజాస్వామ్యమైనా దీనిని సరిగా పరిగణించలేకపోతే దాని ప్రజాదరణ ఆధారాన్ని తీవ్రంగా నష్టపరుచుకొంటుంది.

## 74. ప్రజాస్వామ్య సంస్కృతిని ఎలా పెంచాలి?

ప్రజాస్వామ్య వేత్తలు ప్రజాస్వామిక సంస్థలను నడిపే అనుభవం ద్వారా - ఉదాహరణకు ప్రజలకు వారు నిర్ణయాలు తీసుకోవాల్సిన సమస్యలపై సమాచారాన్ని ఇవ్వడం ద్వారాను అన్ని స్థాయిలలోను రాజకీయంగా పాల్గొనడం వలన పెంచబడిన నైపుణ్యాలు దృక్పథాల ద్వారాను- ప్రజాస్వామిక సంస్కృతి అభివృద్ధి చెందుతుందని ఎప్పుడూ వాదించేవారు. కాబట్టి అట్టి పాల్గొనే అవకాశాలు ఔపచారిక రాజకీయ రంగాలలోను పౌర సమాజంలోని సంఘాలు సంస్థలలోను సాధ్యమైనంత వరకు విస్తృతం కావాలి. అన్ని రకాల స్వచ్ఛంద సంఘాలు, రాజకీయ పక్షాలతో సహా ఈ సంస్థలు వాటంతట అవే సభ్యులకు రాజకీయ విద్యను అందించగల అర్థవంతమైన వనరులవుతాయి.

### ప్రజాస్వామ్య సంస్కృతిని పెంచడం

73వ పేరాలో చెప్పబడిన పాఠశాలల ద్వారానే కాక ప్రజాస్వామ్య సంస్కృతిని చాలా ఇతర మార్గాలలోను పెంచవచ్చు. కళలు సామాజిక సమస్యల ఆలోచనాత్మక ప్రకటనకీ ప్రజాస్వామిక భావాలకీ ఆచరణకీ మార్గాలు. ప్రజా ఉత్సవాలు దేశ చరిత్ర సంస్థల ప్రత్యేక ప్రజాస్వామిక ప్రజాదరణ పొందిన కోణాల నుంచి జరుపుకోవచ్చు. వీటన్నింటికంటే మిన్నగా రాజకీయ విద్యలో అతి విస్తృతమైన అర్థంలో ప్రచారసాధనాలు ప్రజా విజ్ఞాన చైతన్య స్థాయిలను పెంచడానికి ప్రభుత్వ విధానాల విమర్శనాత్మకమైన గణనకీ సమాచారాన్ని ప్రజలకు అందించడంలో ముఖ్యపాత్రను వహిస్తాయి.

# 6

# ప్రజాస్వామ్యం యొక్క భవిష్యత్తు

## 75. ఈ రోజు ప్రజాస్వామ్యం ఎదుర్కొంటున్న ముఖ్య సమస్యలేమిటి?

ఈనాడు ప్రజాస్వామ్యం ఎదుర్కొంటున్న అతి తీవ్ర సమస్యలు ఆర్థిక రంగపరమైనవి. ప్రపంచంలో చాలా దేశాల ప్రజలు ఆర్థిక రంగ ప్రభావాలకి లోనవుతున్నారు. అభివృద్ధి చెందిన దేశాల ఆర్థిక వ్యవస్థలు ఈ శతాబ్దం మూడవ దశకం నుంచీ ఎరగని గట్టి నిరుద్యోగ స్థాయిని అనుభవిస్తున్నారు. వీటితో పాటు ప్రభుత్వ బడ్జెట్‌లు సంక్షేమ కేటాయింపులలోని కోతలు వారికి చింతను కలిగిస్తున్నాయి. కమ్యూనిస్టు గతం నుంచి బయటపడిన రాజ్యాలు వారి ఆర్థిక వ్యవస్థలలో ప్రైవేటీకరణ విపణీకరణ ఘాతాలకు గురి అవుతున్నారు. అవి విస్తృతంగా భద్రతారాహిత్యాన్ని తెచ్చిపెడుతున్నాయి. ఇవి అసమానతలనూ అత్యంత ద్రవ్యోల్బణ ప్రమాదాన్ని గాఢతరం చేస్తున్నాయి. అంతగా అభివృద్ధి చెందని చాలా దేశాలు శూన్యం లేదా అంతకంటె తక్కువయిన అభివృద్ధిని కొన్ని సంవత్సరాలుగా భరిస్తున్నాయి. దాని వల్ల ప్రజలు బీదవారయ్యారు. సంక్షేమ కార్యక్రమాలలో కోత విధించబడింది. కరువు యొక్క ప్రమాదం మీదకొచ్చింది.

### ఆర్థిక ఇబ్బంది

ఇప్పుడు అనేక దేశాల ప్రజలు అనుభవిస్తున్న ఆర్థిక ఇబ్బంది స్థాయి గత్యంతరం లేని రాజకీయ పరిణామాలు గలిగినది. అది అన్ని రకాల సామాజిక వైషమ్యాలను ఆర్థిక అవకాశాల పోటీలోని ఘర్షణలను గాఢతరం చేస్తుంది. నష్టాలను భరించలేనివిగా చేస్తుంది. ఆర్థిక వలసపోవడాన్ని ప్రోత్సహిస్తుంది. దీని వలన వలసపోయిన వారిలో శత్రుత్వం ఎక్కువవుతుంది. ఎక్కువగా అభివృద్ధి చెందిన దేశాలలో ఒక దుర్గ రాజ్యం (Fortress state) కావాలన్న డిమాండ్ పెరుగుతుంది. ఆర్థిక మాంద్య పరిస్థితుల వల్ల సమాన పౌరసత్వాన్ని పొందడం కష్టతరమవుతుంది. ప్రజాస్వామ్య ప్రభుత్వం సమాజం

యొక్క సమస్యలను పరిష్కరించగలిగిన శక్తిలో విశ్వాసం పోతుంది. ఈ ఘాతాల నుండి బలమైన, స్థిరమైన ప్రజాస్వామ్యాలు తట్టుకోగలిగినా - భద్రంగా స్థిరపడడానికి సాపేక్షంగా ఇంకా అనుకూల పరిస్థితులు కావలసిన పిన్న వయసు ప్రజాస్వామ్యాలకు అవి చాలా నష్టాన్ని కలుగచేస్తాయి.

### రాజకీయ నియంత్రణ నష్టమైపోవడం

ప్రస్తుత ఆర్థిక మాంద్యత యొక్క మూడు లక్షణాలు ప్రజాస్వామ్య ప్రభుత్వంలోని నమ్మకాన్ని బలహీనం చేయడానికి తోడ్పడ్డాయి. మొదటిదేమంటే దేశం యొక్క ఆర్థిక సంపదలని నిర్ణయించే చాలా సంస్థలూ ప్రవృత్తులూ దేశ సరిహద్దుల ఆవలనే ఉండి సార్వభౌమ్యమని చెప్పుకునే దేశంయొక్క నియంత్రణలో లేకపోవడం. ఇది అన్ని దేశాల మీద ముఖ్యంగా తక్కువ అభివృద్ధి చెందిన దేశాల మీద ప్రభావం కలిగిన ఉంటుంది. ఆ దేశాలు ముడిపదార్థాల ఖరీదులు - ఎంతో ముఖ్యమైన ఋణాలని తీర్చడం లేదా అంతరంగిక పెట్టుబడి మీద ప్రభావం తీసుకురావడానికి పెద్దగా ఏమీ చేయలేరు. ఈ పరిస్థితిని విషమం చేసే రెండవది గత రెండు దశాబ్దాలుగా వస్తున్న ప్రభుత్వాలు వారి వారి దేశాల ఆర్థిక గమ్యాలను ఏర్పరచి మెరుగుపరచడానికి ఏమీ చేయలేవని భావించే ఆర్థిక చాదస్తం. ఈ గమ్యాలను విపణి శక్తులూ, వ్యక్తులూ, సంస్థలూ విపణి అవకాశాలలో స్పందన నిర్ణయిస్తాయి. ఈ నమ్మకంతో పాటు మూడవది - క్రియాశీలకమైన ప్రభుత్వాన్ని కొనసాగించగల సామూహిక బాధ్యతను బలహీన పరిచే - దేశంలోను విదేశాలలోను తక్కువ స్థితిలో ఉన్నవారి యెడల దాతృత్వ భావాన్ని ప్రోత్సహించని శక్తివంతమైన వ్యక్తిగత లేదా కుటుంబ ప్రయోజనాల స్వభావం. సోషలిజం ప్రతిష్ట పోయినపుడూ ప్రగతిశీలక అంతర్జాతీయత విలువ తగ్గిన ప్రపంచంలో ఆర్థిక సామాజిక పరస్పర ఆధారాలకి సంబంధించిన సమస్యలకు సామూహక పరిష్కారం కావాలన్న ఆలోచన ఇంకా బాగా వ్యక్తీకరింపవలసి ఉంది.

## 76. బీద సమాజాలు నిజంగా ప్రజాస్వామ్యాన్ని పొందడానికి నిధులు, సాధనాలు ఉన్నాయా?

ఈ ఆలోచన ఎన్నో వివిధమైన ఆతురతలను కలిగి ఉంటుంది. ఒకటేమిటంటే ప్రజాస్వామ్య వ్యవస్థ చాలా ఖరీదైనది, ఎక్కువ కాలాన్ని హరించేది. రాజ్యం యొక్క నిధులని, కాలాన్ని ప్రజల యొక్క అత్యంత అవసరాలైన ఆరోగ్యం, విద్య, మౌలికమైన

ఆర్థిక మనుగడలకే వెచ్చించడం ఇంకా ప్రయోజనకరం అవుతుంది. వీటితో పోలిస్తే ఎన్నికల నిర్వహణ ప్రజాస్వామ్య పాత్రను నిర్వహించడానికి ఉద్యోగులకు శిక్షణా ప్రజా పార్లమెంటరీ జవాబుదారీల వలన విధాన నిర్మాణంలోను అమలులోను జాప్యాలు ప్రజాస్వామ్యాన్ని అన్ని రాజ్యాలకు అందుబాటులో లేకుండా చేస్తాయి.

## ప్రజాస్వామ్యంలో అసానుకూలతలు

ఈ ఇరుకైన వాదానికి - అభివృద్ధి చెందుతున్న ఆర్థిక వ్యవస్థలో ప్రభుత్వ విధానాలలో ప్రజాస్వామ్యం యొక్క సానుకూలతల కంటే అసానుకూలతలే ఎక్కువనే మరొక విశాలమైన ఆతురతను చేర్చ వచ్చును. రాజ్యాలు కొత్తగా స్థాపింపబడినవైనపుడు జాతీయ వ్యక్తిత్వం బాగా అభివృద్ధి చెందని దశలో సామాజిక నియోజక పోటీ నష్టాన్ని కలిగించవచ్చు. ప్రజాస్వామ్యం హ్రస్వ ప్రయోజనాలకి దిగజారకుండా ఉండాలంటే కావలసిన విజ్ఞానవంతమైన, పరిపక్వత కలిగిన నియోజకులుండాలి. మాటలలో శూరత్వం బహిరంగంగా అసహనం ఆర్థిక ప్రగతి వల్ల వచ్చే లక్షణాలు. ప్రజాస్వామ్యం కంటే జాతీయ ఐక్యత, ఆర్థిక అభివృద్ధి ఎక్కువ ముఖ్యమైన అవసరాలని కాదు. చారిత్రిక క్రమంలో ప్రజాస్వామ్యానికి ముందే జాతీయ ఐక్యత, ఆర్థికాభివృద్ధీ కావాలి. ప్రజాస్వామ్యం ఒక దేశానికి ముందస్తుగా కావలసిన వాటిని లేదా ఒక వేదికని ఇస్తుంది.

## ప్రజాస్వామ్యం అభివృద్ధి

ముందు ప్రశ్నల (ఉదా. 13,36,39) సమాధానాలలో ఈ అభ్యంతరాల ఇబ్బందుల ప్రత్యేక లక్షణాలు వివరించబడినా వీటన్నింటినీ ఒక చోటకు తీసుకురావడం ఉపయోగకరంగా ఉంటుంది. మొదటిది - ఆర్థిక అభివృద్ధి పూర్తిగా సంఖ్యాత్మకంగా జనాభా తలసరి ఆదాయంలో లెక్కించదగినది కాదు. అది ఆదాయ విభజన ప్రభుత్వ వ్యయ విభజన మీద ఆధారపడే ప్రజాభ్యుదయానికీ, శ్రేయస్సుకీ సంబంధించిన గుణాత్మకమైన భావన కూడా. ఆర్థికాభివృద్ధి యొక్క సంఖ్యాత్మక కోణాలు రాజ్యాధికారం ప్రజల యెడల దాని స్పందన మీద ఆధారపడతాయి. ప్రజాస్వామిక నియోజకులు ఆర్థిక అసమానతలను తగ్గించే విధానాలను, ఆరోగ్యం, విద్య మొదలైన వాటి మీద వ్యయాన్ని కోరతారు కానీ సాంఘికంగా ఎక్కువ ఉపయోగకరం కాని సైనిక అభివృద్ధీ లేదా ప్రతిష్ఠాత్మకరమైన ప్రణాళికలను కాదు. బహిరంగ జవాబుదారీ పాలనా ప్రజావనరులను నియంతృత్వాల కంటే ప్రజాస్వామ్యాలు మెరుగుగా సమర్థవంతంగా

వినియోగిస్తాయి. ప్రజాస్వామ్య వ్యవస్థలో కుంభకోణాలు, మానవ హక్కుల దుర్వినియోగం, పరిసరాల వినాశనం, కరువులాంటి విషయాలు ఎక్కువ కాలం గమనించబడకుండా ఉండలేవు. ప్రజాస్వామ్యం, అభివృద్ధి, మానవ హక్కుల రక్షణా వీటి మధ్య సహకారాత్మక సంబంధానికి జూన్ 1993లో మానవ హక్కుల వియన్నా ప్రపంచ సమావేశం ముగింపు పత్రంలో నొక్కిచెప్పబడింది.

### ప్రజాస్వామ్యాలను మెరుగుపరచడం

జవాబుదారీ, ప్రతిస్పందనా లేకుండా రాజకీయ అధికారం మునిగిపోతే సమాజాలు ప్రజాస్వామ్యాలు కాకుండా ఉండగలవా అనేదే సమస్య. మరొక సమస్య ప్రజాస్వామ్యాలను ఇంకా ఎలా సమర్థవంతంగా పనిచేయించడం ఎలా అన్నది. ప్రజాస్వామ్యాన్ని కాదనడం కంటే దానిని పొంది దేశాలు తమ పరిస్థితులను అవసరాలను అనుసరించి పై సమస్యలకు పరిష్కారాలను వెదుక్కోవడం అవసరం.

## 77. అభివృద్ధి చెందిన ప్రజాస్వామ్యాలు, అభివృద్ధి చెందుతున్న వాటికి ఎలా సహాయపడగలవు?

అభివృద్ధి పొందుతున్న వాటికి అభివృద్ధి చెందిన ప్రజాస్వామ్యాలు చాలా విధాలుగా సహాయం చేయగలవు. అతి సాధారణ స్థాయిలో అవి అభివృద్ధి హక్కుకి హృదయపూర్వక గుర్తింపు నివ్వగలవు. దానితో పాటు అంతర్జాతీయ సమాజాలు వాటికి సహాయం చేయాలన్న విధులకు కూడా గుర్తింపు నివ్వగలవు. ఇంకా నిర్దిష్టంగా వారికి శిక్షణ నివ్వడంలోను, మంచి ప్రజాస్వామ్య ఆచారాల గురించి విజ్ఞానాన్ని ఇవ్వటంలోను సహాయం చెయ్యగలవు. ప్రజాధికారుల, పార్లమెంట్ గుమాస్తాల, రాజ్యాంగ న్యాయవాదుల, ఆర్థిక నియంత్రకుల, శాసనసభ సభ్యుల, పార్టీ ఉద్యోగుల శిక్షణకు కూడా అభివృద్ధి చెందిన దేశాలు అభివృద్ధి చెందుతున్న దేశాలకి సహాయాన్నివ్వగలవు. నియోజక పోటీ రంగంలో మంచి ఆచారాలు విస్తారంగా అభివృద్ధి చెందాయి. ఈ రంగంలో అంతర్జాతీయ సంస్థలు ఒక దేశంలో ఎన్నికలు ఎంత వరకు స్వేచ్ఛగా, స్వచ్ఛంగా నిర్వహించబడ్డాయో, గణన చేసే పరికరాలుగా విస్తృతంగా ఆమోదింపబడ్డాయి. అలాగే తృప్తి చెందిన విధానంలో అంతర్జాతీయ ప్రమాణాలు కలిగిన మానవహక్కుల విషయంలోను వాటి పాత్ర ఆమోదింపబడింది. ఈ ఆచారాల ప్రమాణాలను, బహిరంగ జవాబుదారీ ప్రభుత్వంతో సహా ఇతర రంగాలకు కూడా

విస్తరింపజేయడానికి అవకాశం ఉంది. ఈ రంగాలన్నింటిలోను అన్ని ప్రజాస్వామ్యాలలో ఇంకా మెరుగుపరచదగిన అంశాలున్నాయి. మార్పులను చేసుకొని మెరుగు పరుచుకోవడం వల్ల ఇతరులకు అందించే సహాయంలో అభివృద్ధి చెందిన ప్రజాస్వామ్యాలపై నమ్మకం పెరుగుతుంది.

## సార్వభౌమత్వం - అంతర్జాతీయ జోక్యం

ప్రజాస్వామీకరణ యొక్క అంశాలకు సహాయం కంటే - సమకాలీన ఆచారమైన ఆర్థిక సహాయ వినియోగం దాని నిలిపివేత బహుపార్టీ ఎన్నికలను త్వరితం చేయడం కనీస మానవహక్కుల ప్రమాణాలను అంగీకరించేటట్లు చేయడానికి ఒక ఆయుధంగా చేయడం ఇంకా వివాదాస్పదమైన విషయం. దీర్ఘకాలంగా ఈయబడిన అభివృద్ధి సహాయం మానవహక్కుల దుర్వినియోగంలో రికార్డు కలిగిన నియంతృత్వాలకు కొనసాగించాయని అభివృద్ధి చెందిన అట్టి దేశాల విధానాలకు మద్దతు నిచ్చేవారు వాదిస్తారు. షరతులను విధించడం ప్రతిపక్ష బృందాలను ప్రజాస్వామ్య ప్రచారాలను ప్రోత్సహిస్తుందని చెపుతారు. ఈ విధానాలతో విభేదించేవారు- అవి ఆచరణలో అసంగతమైనవని, ఇతర విదేశీ అధికారానికి లోబడేదనీ దాని ఫలితాలు తథ్యమైనవి కావని, అవి కేవలం నామమాత్రపు అంగీకారాన్ని పొందగలవని, బయట నుంచి వత్తిడిల ద్వారా అంతరంగిక స్వీయ నిర్ణయాలను ప్రోత్సహించడంలో స్వవచన వ్యాఘాతం ఉందని వాదిస్తారు. కాని ప్రత్యేక సందర్భం మీద అట్టి విధానాల మీద చాలా విషయాలు ఆధారపడి ఉంటాయి. కానీ ఒక్క విషయం మాత్రం నిస్సందేహమైనది. మనం సార్వభౌమత్వం బహిరంగ ఒత్తిడిల నుంచి రాజ్యాలను రక్షించడానికి ఇకమీద ఆమోదయోగ్యం కాని ప్రపంచంలోకి వస్తున్నాము. వారివారి దేశాలలో వారి పౌరులకే రక్షణను ఇవ్వలేని రాజ్యాలకు సార్వభౌమత్వం ఉండదు. (చూ॥పు॥55) ద్వైపాక్షిక దాతల కంటే స్థాపించబడిన ప్రాదేశిక లేదా అంతర్జాతీయ సంస్థల అంగీకరింపబడిన మానవహక్కుల సమావేశం యొక్క నిర్ణయాల అమలు ద్వారా అట్టి ఒత్తిడి కార్యసాధకమౌతుంది.

## ప్రజాస్వామ్యం - 'నిర్మితికి సంబంధించిన సర్దుబాట్లు'

అభివృద్ధి చెందిన దేశాల నుంచీ రాజకీయ షరతులకు విధానాల గురించి కాక ఒక వంక ప్రజాస్వామ్యానికి మద్దతునిస్తూ మరొక వంక నిర్మితికి సంబంధించిన సర్దుబాట్లు,

ఋణాలను తీర్చే విధానాలను నిర్ణయించడం గురించి అభ్యంతరం ఉంది. ఆర్థిక సహాయ ప్రయోజనం విదేశీ ఋణాల మీది వడ్డీ చెల్లింపుల వల్ల రద్దవుతుంది. ప్రజా వ్యయంపై సర్దుబాట్లు విధించే నియమాల వల్ల బీదలు ఎక్కువగా ఆధారపడే ప్రజాస్వామ్య ప్రవృత్తిలో ప్రజాదరణను కొనసాగించగల ప్రణాళికలు కుంటుపడతాయి. ప్రజలలో వారి ప్రభుత్వం వారి స్వీయ ఆర్థికగతిని నియంత్రించగలదన్న నమ్మకం సర్దుబాటు నియమాల విధింపు వలన సన్నగిల్లుతుంది.

## 78. అంతర్జాతీయ సంస్థలు ప్రజాస్వామీకరింప బడగలవా?

సమకాలిన ప్రజాస్వామ్యాలు ఎదుర్కొనే సమస్యలలో ప్రధానమైనది ప్రజల శ్రేయస్సుని ప్రభావితం చేసే విషయాలు జాతీయ నియంత్రణకు అవతల ఉండటం వల్ల స్వీయ నిర్ణయం చేసుకునే శక్తి యొక్క తరుగుదల, ఈ జాతీయ స్వయంప్రతిపత్తి తరుగుదలకు సంబంధించిన ఆర్థిక కోణాన్ని ఇంతకు ముందు ప్రశ్నలలో (75 మరియు 77) చర్చించబడినది. ఈ సమస్య పరిసరాల క్షీణత, ప్రాకృతిక వనరులపై నియంత్రణ, జనాభా సంచారం ఇంకా సంప్రదాయ సిద్ధమైన సైనిక దురాక్రమణలతో సహా చాలా అంశాలకు విస్తరిస్తుంది. తమ సరిహద్దులకు ఆవల జరిగే సంఘటనల పరిణామాలు తమకు అంటకుండా ఏ సమాజమూ తనకు తాను దూరంగా ఉండి పరిరక్షించుకోలేదు.

### జవాబుదారీ రూపాలు

కాబట్టి తక్షణం అత్యంత అవసరమైన రెండు ప్రశ్నలున్నాయి. దేశాల గమనాలను రూపొందించే అంతర్జాతీయ ప్రైవేటు కార్పొరేషన్‌ల ప్రపంచ శక్తులను క్రమబద్ధం చేసి నియంత్రించగల అంతర్జాతీయ సంస్థను ఎలా తయారుచేసి సంఘటితం చేయాలన్నది మొదటి ప్రశ్న. ఈ శక్తులను అర్థవంతమైన ప్రజాస్వామ్య జవాబుదారీకి లోబడేటట్లు చేయడమెలా అన్నది రెండవ ప్రశ్న. ప్రాదేశిక ప్రపంచ స్థాయిలలో ప్రభుత్వాల మధ్య ఒడంబడికల సంధుల రూపంలో అట్టి చాలా సంస్థలు ఉండనే ఉన్నాయి. ఇంకా అవకాశమున్న అంతర్జాతీయ ద్రవ్యనిధి, అంతర్జాతీయ న్యాయస్థానం, ఐక్యరాజ్యసమితి వంటి శాశ్వత సంస్థలూ ఉన్నాయి. ప్రజాస్వామ్య దృష్టి నుంచి అట్టి సంస్థల పరిమితులేమంటే (1) అవి ఇరుకైన ప్రభుత్వాల మధ్య ఉండే ప్రాతినిధ్య జవాబుదారీ నమూనాల ననుసరించే పనిచేస్తాయి. (2) అవి దేశాంతరాల ప్రజాభిప్రాయానికి ఇచ్చే స్పందన కంటే ప్రభుత్వ విధానాలకే ఎక్కువ ప్రతిస్పందన కలిగి ఉంటాయి. (3)

సంధికి ఒప్పుకోని సభ్యరాజ్యాలపై అధికారాల అమలుకి అవకాశం నియమితం అయి ఉంటుంది. (4) జనాభా సంఖ్యననుసరించి కాక వారి గత సామ్రాజ్యస్థాయి లేదా ప్రస్తుత బలం మీద ఆధారపడి నిర్ణయాలు తీసుకుంటాయి.

### ప్రపంచ పార్లమెంటు

మానవహక్కుల సమావేశాలు, న్యాయస్థానాలు లేక యూరప్ పార్లమెంటు లాంటి ప్రాదేశిక పార్లమెంటుల వంటి ప్రస్తుత సంస్థల అందుబాటును పెంచి అంతర్జాతీయ సంస్థల యొక్క ప్రజాస్వామీకరణ వంక ప్రగతి కొరకై గమనం నెమ్మదిగానే ఉంటుంది. ప్రపంచ సమస్యల అంతర్జాతీయ పరిష్కారాల యొక్క అవసరం తక్షణం కార్యసాధకంగా అమలు చేయగల అధికారాలున్న పార్లమెంటును రూపొందించడం, దానితో పాటు ప్రపంచ పౌరసత్వ భావనని పెంచడం అందని ఆదర్శమూ కాదు, కేవలం ఊహాలోని ఆలోచనా కాదు.

## 79. కొత్త ప్రపంచ సమాజంచే జాతీయ వ్యక్తిత్వాలు మునిగి మరుగునపడి పోతాయా?

ఈ మధ్య వస్తున్న ప్రవృత్తులలో పరస్పర అసంబద్ధతా లక్షణం ఉంది. ఒక వంక స్థానిక వ్యక్తిత్వాలని సాధించడానికి చరిత్ర, సంస్కృతులను రెచ్చగొడుతూ అదే సమయంలో ప్రపంచ పౌరులందరి గతులనూ దగ్గర కలిపి ఉంచడానికి ప్రయత్నం అసంబద్ధత. అయినా జాతీయ సంప్రదాయాల సంస్కృతులూ, ప్రత్యేకతలూ అదృశ్యమైపోయే ప్రమాదం ఏమీ లేదు. నిజంగా జాతీయ వ్యక్తిత్వానికి కొంత భద్రత ఉండటం విశ్వసనీయమైన దాతృత్వంతో కూడిన అంతర్జాతీయతకు షరతుగా గుర్తించవచ్చును. పౌరులందరి రాజకీయ విధేయతను పొందే గుత్తాధిపత్యం గల జాతీయ రాజ్యం పోయి భవిష్యత్తులో అనేక రాజకీయ వ్యక్తిత్వాలు కలిగిన బహుతా విధానం రావడానికి అవకాశం ఉంది. ఈ విధానంలో ప్రజలు ఒక దేశానికీ, ఒక బహుదేశ సమాఖ్యకీ, ఒక ఖండానికీ, ప్రపంచానికీ పౌరులుగా తమని తాము నిర్వచించుకుంటారు. అట్టి అభివృద్ధిని ప్రజాస్వామికులందరూ ఆహ్వానిస్తారు. ఎందుచేతనంటే ప్రజాస్వామ్యం యొక్క సార్వత్రిక శక్తీ, దాని నియమాలు దాని అనుయాయులను జాతీయ రాజ్యం యొక్క ఎల్లల నుంచీ-ఒకే ఒక్క రాజకీయ విధేయతా స్థాయికి కట్టుబడిన స్థితికి ఆవలకి తీసుకువెళతాయి.



నిరుత్సాహ పడకండి! ప్రజాస్వామ్యం మీరు విజయవంతంగా
పోటీ చేయడానికి మరొక అవకాశాన్ని ఇస్తుంది

## 80. ప్రజాస్వామ్యం సామాన్య ప్రజలకు సంబంధించి ఉండేటట్లు చేయడం ఎలా?

అన్నింటి కంటే ముఖ్యమైన ఈ కీలకమైన ప్రశ్నతో ప్రజాస్వామ్యంపై ప్రశ్నల జవాబుల పుస్తకాన్ని ముగించడం ఉచితంగా ఉంటుంది. సామాన్య ప్రజలు ప్రజాస్వామ్యాన్ని అర్థం చేసుకోకపోతే దానికీ వారి దైనందిక జీవితానికి వారి జీవన పరిస్థితులకీ సంబంధం లేదనుకుంటే - దానిని పరిరక్షించడానికి వారు ఏమీ చేయరు. ఎన్నికల సమయంలో వారి ముందున్న ఎంపికలలో ఏ విధమైన తేడా లేదనుకుంటే, రాజకీయ నాయకులు ప్రజలు ఓటు చేసిన దిశలో మార్పులు చేయడానికి శక్తి గాని, ఇచ్ఛగాని లేనివారైతే, మౌలికమైన పౌర రాజకీయ హక్కులకి హామీ లేకపోతే, ప్రజలు తమని తాము వ్యవస్థీకరించుకొని ప్రజా విషయాలపై నిర్భయంగా ప్రచారం చేసుకోలేకపోతే-అన్నింటికంటే ముఖ్యంగా - అతి స్థానిక స్థాయి - పనిస్థానం ఇరుగుపొరుగు పరిస్థితులలో ప్రభావం చూపే శక్తి ప్రజలకి లేకపోతే, ప్రజాస్వామ్యం కేవలం రూపం మాత్రమే ఉండి లోపల పదార్థం లేని గుల్ల అయిపోతుంది. అంతకు ముందు నియంతృత్వ విధానం నుండి క్రొత్తగా ఏర్పడిన రాజ్యం ప్రజాస్వామీకరణంలోనైనా, లేదా, చాలా కాలమై స్థాపింపబడిన ప్రజాస్వామ్యాలను గాఢంచేసి పునరుద్ధరించడానికైనా ఎల్లెడల ప్రజాస్వామికులకు ఎదురయ్యే కర్తవ్యాలేమిటంటే - ప్రజాస్వామ్య రూపం వెనుక ఉన్న పదార్థానికి బలాన్నివ్వడం, ప్రజా నియంత్రణ, రాజకీయ సమానతలను సంస్థాపరంగా కార్యసాధకం చెయ్యడమూ.

# ఇంకా ముందుకు నడవాలంటే

1. అర్‌బ్లాష్టర్, ఆంథోనీ, 1994. **డెమోక్రసీ**, బకింగ్‌హామ్: ఓపెన్ యూనివర్శిటీ ప్రెస్, సెకండ్ ఎడిషన్.

2. బొబ్బియో, నోర్ బెర్టో, 1987. **ది ఫ్యూచర్ ఆఫ్ డెమోక్రసీ**, కేంబ్రిడ్జి పాలిటీ ప్రెస్.

3. డాహ్ల, రాబర్ట్, 1989. **డెమోక్రసీ అండ్ ఇట్స్ క్రిటిక్స్**, న్యూ హేవెన్ అండ్ లండన్ : ఏల్ యూనివర్శిటీ ప్రెస్.

4. డున్, జాన్ (ఎడ్.) 1992. **డెమోక్రసీ : ది అన్‌ఫినిష్డ జర్నీ**, ఆక్స్‌ఫర్డ్ : ఆక్స్‌ఫర్డ్ యూనివర్శిటీ ప్రెస్.

5. హెడ్‌నియస్, ఎక్సెల్, 1992. **డెమోక్రసీ అండ్ డెవలప్‌మెంట్**, కేంబ్రిడ్జ్ : కేంబ్రిడ్జ్ యూనివర్శిటీ ప్రెస్.

6. హన్నుమ్, హోరస్స్, 1990. **ఆటోనమీ, సావరినిటీ అండ్ సెల్ఫ్ డిటర్మినేషన్**, ఫిలడెల్ఫియా : యూనివర్శిటీ ఆఫ్ పెన్సిల్‌వేనియా ప్రెస్.

7. హెల్డ్, డేవిడ్(ఎడ్.), 1993. **ప్రాస్పెక్ట్స్ ఫర్ డెమోక్రసీ**, కేంబ్రిడ్జ్ : పాలిటీ ప్రెస్.

8. హంటింగ్ టన్, సామ్యూల్, 1991. **ది థర్డ్‌వేవ్ : డెమోక్రటైజేషన్ యిన్ ది లేట్ ట్వన్టీయత్** సెంచరీ, నోర్మన్ అండ్ లండన్ : యూనవర్శిటీ ఆఫ్ ఓక్లహోమా ప్రెస్.

9. కీన్, జాన్, 1991. **ది మీడియా అండ్ డెమోక్రసీ**, కేంబ్రిడ్జ్ : పాలిటీప్రెస్

10. **లిజ్‌ఫార్ట్**, అరెండ్ 1984. **డెమోక్రసీ**, న్యూ హేవెన్ అండ్ లండన్ : ఏల్ యూనివర్శిటీ ప్రెస్.

11. నికెల్, జేమ్స్ డబ్ల్యు. 1987. **మేకింగ్ సెన్స్ ఆఫ్ హ్యూమన్ రైట్స్**, బర్కెలీ : యూనివర్శిటీ ఆఫ్ కాలిఫోర్నియా ప్రెస్.

12. ప్లాట్‌నర్, మార్క్ అండ్ డైమండ్, లారీ (ఎడ్స్.), 1992. కేపిటలిజమ్, సోషలిజమ్ అండ్ డెమోక్రసీ (జర్నల్ ఆఫ్ డెమోక్రసీ స్పెషల్ ఇష్యూ నం. 3.3), బాల్టిమోర్ : జాన్ హాప్‌కిన్స్ యూనివర్శిటీ ప్రెస్.

13. రాడ్లే, నిగెల్, 1987. ది ట్రీట్‌మెంట్ ఆఫ్ ప్రిజనర్స్ అండర్ ఇంటర్నేషనల్ లా, ఆక్స్‌ఫర్డ్ : ఆక్స్‌ఫర్డ్ యూనివర్శిటీ ప్రెస్.

14. రోసాస్, అల్లాన్ అండ్ హెల్గెసెన్, జాన్ (ఎడ్స్.), 1992. హ్యూమన్ రైట్స్ అండ్ ప్లూరలిస్ట్ డెమోక్రసీ, డోర్డ్రెక్ట్ : మార్టినస్ నిజ్‌హాఫ్.

15. యునైటెడ్ నేషన్స్, 1988. హ్యూమన్‌రైట్స్ ఫ్యాక్ట్ షీట్ సిరీస్.

16. యునైటెడ్ నేషన్స్, 1993. హ్యూమన్ రైట్స్ : ఎ కంపైలేషన్ ఆఫ్ ఇంటర్నేషనల్ ఇన్‌స్ట్రూమెంట్స్, టు వాల్యూమ్స్.

Printed at Impress Offset E-17, Sector 7, NOIDA-201301